

# NEELAVENI

By

B. NADAMUNI RAJU

August '77

Cover Design
'CHANDRA'

Blocks
krishna Procees
VIJAYAWADA-2

Printing
SRI 'VENKATARAMANA'
VIJAYAWADA-2

Pudlished By
SRI KAVITA PUBLICATIONS
VIJAYAWADA-2.

# విషయ సూచిక:

# నీలవేణి

కాగితాల బొత్తాం ముందేసుకొని కూర్చున్నాను. కుడి చేతిలో కలం, ఎడమచేతిలో సిగరెట్ - దీర్ఘంగా ఆలోచిస్తున్నాను. కథ వ్రాయాలి! ఏం కథ వ్రాయాలి? ఎన్నో కథలు వ్రాశాను, ఎన్నో సమస్యల్ని తడిమాను. ప్రేమ, విరహం, నిరాశ - జీవితంలోని ఒంపుసొంపుల్ని సాధ్యమైనంతవరకు నా కథల్లో ప్రతిఫలించాలని నా ఆశ. రచయిత ఏం చెప్పాడనికాక, ఆ చెప్పేదేదో ఎలా చెప్పడమనేది నా దృష్టిలో ప్రధానం. ఆ ప్రమాణాన్ని దృష్టిలో పెట్టుకున్న నాటినుంచి నాకు రచనల పరిమాణం తగ్గిపోయిందనే చెప్పాలి. చెప్పేదేదో నలుగురిలా కాకుండా సరిక్రొత్తలా చెప్పాలనే ఆవేదన, దీక్ష నా నరనరాల్లోను నిండుకుపోయింది. ఫలితంగా చాల రోజులనుంచి ఒక్క కథ కూడా వ్రాసిన పాపాన పోలేదు. ఇదొక మాదిరి స్తబ్ధత కాదుగదా! భయంవేసింది.

అందుకనే యేమైనాసరే కథ వ్రాయాలని కూర్చున్నాను. మనసు చక్రంలా తిరుగుతూంది. సమస్యల తోరణాలు కళ్ళ కవుపిస్తున్నాయి. కాని ఏ ఒక్క దానిమీద దృష్టి కేంద్రీకరింప బడటంలేదు. కళ్ళలో ప్రాణం పెట్టుకున్న గుమాస్తా, బక్కచిక్కిన బడిపంతులు, కాలేజీలో చదివే రెండు జడల అమ్మాయిలు, టెరిలిన్‌షర్టు వేసుకున్న అబ్బాయిలు, సంసార సమస్యలు, అవిభక్త కుటుంబంలోని అరమరలు, గ్రామజీవనము, యాంత్రిక సమస్యలు, హాస్పిటల్‌లోని రోగులు - డాక్టర్లు, నర్సులు, శరవేగంతో నడుస్తూన్న సినిమారీలులోని బొమ్మల్లా ఒకదానివెంట మరొకటి నా దృష్టిపథంలోనుంచి దూసుకుపోతున్నవి.

కడపటి దమ్ము గట్టిగా లాగి సిగరెట్ పీక విసిరి కొట్టాను. కుర్చీలోనే చేరగిలబోయి గట్టిగా కళ్లు మూసుకున్నాను. అంతర్ దృష్టి అనే పదాన్ని పుస్తకాల్లో చదవడం, వేదాంతులు చెప్పగా వినటం జరిగిందే కాని అనుభవంలో అదెలాంటిదో నే నెరుగను! కాని ఆ సమయంలో ఒక నిండైన ప్రశాంతత నా మనసును ఆవరించి నేను ఏ నాడు యెరుగని ఒక కొత్త శక్తి నాలో పారాడుతోందని అనిపించింది. సగం నిద్రా - సగం మెలకువా - యేదో యెరుగని మైకం - జాగ్రదావస్థ అన్నీ కలగా పులగంగా కలిసిపోయినవి. అంతర్ దృష్టి అంటే యిలాంటిదేనేమో నని అప్పుడు స్ఫురణ కొచ్చింది. క్షణంలో సగం అన్నట్టు నేను వ్రాయబోయే కథని నా మెదడు మడతలు నా కేకరువుపెట్ట ప్రారం

భించినవి. 'వెరీగుడ్' - ఉత్సాహంగా కళ్ళు తెరచాను. మరో సిగరెట్ అంటించి తృప్తిగా ఒక దమ్ము లాగాను. కాగితాలు ముందుకు లాక్కొని కథ మొదలు పెట్టబోతు న్నాను. అలవికాని ఆశల్ని రేపుకొని జీవితంలో నికరంగా ఓడిపోయిన నీలవేణి, నటననే పరమావధిగా భావించి, కుహనా జీవితాన్ని కొనసాగించిన సుబ్బారావు నా కథలోని ప్రధాన పాత్రలు. కథ విషాదాంతమని మరి వేరే చెప్పనవ సరంలేదు. స్త్రీ పాత్ర కాబట్టి, నీలవేణి మీద నా సానుభూ తిని కనబరచటం, నా ప్రధాన కర్తవ్యమే కాదు; నేటి కాలపు ఫాషన్‌కూడాను. వంచిత అయిన ఆ అభాగ్యురాలిని చంపటం సానుభూతి చిహ్నంగా చంపటం అధర్మం! రైలుక్రింద పడ వేయటమా లేక భావిలో దూకించడమా, కాకపోతే పిచ్చి పట్టించి రాళ్ళు రువ్వించి చంపటమా; - ఊహాలో రూపు రేఖలు దిద్దుకున్న కథలో ముగింపులోని మలుపును గురించి ఆలోచిస్తున్నాను.

"మాష్టారూ!" సున్నితమైన స్వరం మధురంగా విని పించింది.

అర్ధ నిమీలిత నేత్రుడనై వున్న నేను కళ్ళు తెరిచి చూచి విస్తుపోయాను. సోగ కళ్ళు, దానిమ్మ గింజల్లాంటి పలువరుస, చక్కని శరీరచ్ఛాయ, అప్పుడే వికసిస్తున్న పుష్పంలాంటి విరిసీ విరియని యౌవ్వనశోభ - సన్నగా, నాజూగ్గా, పద్దెనిమిదో వసంతాన్నయినా చూడని దానిలా వుంది ఓ అమ్మాయి నా యెదుట! వాయిల్ చీర, గ్లాస్కో

జాకెట్ - చెవులకు దుద్దులు తప్ప మరే ఆభరణాలు లేవు. జడలో తురిమిన ఒంటి గులాబీ రేకులు కూడ రెండు మూడు రాలిపోయినట్టున్నాయి. సామాన్య కుటుంబానికి చెందిన ఆడబిడ్డలా వుంది. దూరతీరాల్లో కనరాన్నిదాన్ని దేన్నో కనుగొనాలనేటట్టున్న కళ్ళలోని అన్వేషణ, ఆశ యిట్టే యెవరినయినా ఆకర్షిస్తాయి.

ఎవ రీ అమ్మాయి? ఒంటరిగాణ్ణి! ఎందుకు నా గదిలో కొచ్చింది! అందులోను వేళగాని వేళ!

"ఏమిటి మాస్టారూ! అలా చూస్తారు? నేను నీలవేణి నండీ!" ఆమె తన్ను తాను సగర్వంగా పరిచయం చేసుకొంది.

"నీలవేణి...వా...?" నేను దిమ్మెరపోయి ప్రశ్నించాను.

"అవునండీ! నీలవేణినే! క్షణం క్రిందట రైలుకింద పడవేయటమూ, భావిలో దూకించటమూ కాకపోతే పిచ్చి పట్టించి, రాళ్ళు రువ్వించి మరీ చంపటమూ అని యెవరిని గురించి ఆలోచన చేశారో ఆవిడను నేనే!"

"ఆ..." నేను నోరు తెరిచాను. నీలవేణి అనే ఈవిడ యిలా బరితెగించి, నా ముక్కుమీద పిడికిలి ఝాడిస్తుందని యెరిగివుంటే యీవిడ ఊసే యెత్తుకొని వుండనే! యే ధర్మవేణినో, కృష్ణవేణినో నా కథానాయకురాలిగా తీసుకొని వుందునే! భగవాన్ ఏంచేయూ లివ్వాళ? మనసులోనే మథన పడ్డాను.

అసాధ్యురాలిలా ఉంది అమ్మాయి. పుస్తకంలోని పంక్తుల్నిలా వరుసగా నా ఆలోచనల్ని చదివిన దానిలా, "మరేం భయపడకండి మాస్టారూ! నేనేం మీ మీదికి పోరాడటానికిరాలేదు. నా కథ మీరు వ్రాయాలనుకున్నారు. మీ ఊహాపథంలో రూపొందిన ఆ కథను నేనిప్పుడే చదివాను కూడ. అందులో సగం మాత్రమే సత్యం. మిగిలిందంతా మిథ్య! అభూతకల్పన! కళ పేరుతో అతిశయోక్తులు, అబద్ధాలు మీ రెందుకని వ్రాస్తారు? గోరంతల్ని కొండంతల్ని చేస్తేనేగాని మీకు తృప్తి లేదా? సహృదయులైన మీరు కావాలని యీ దుష్టత్వానికి తలపడి వుండరని, పొరబడటం యెంతటివారికైనా తప్పనిసరియని భావించి స్వయంగా నా కథ మీకు చెప్పేందుకు వచ్చాను. నేను వస్తూంటే తనూ వస్తానని మా ఆయన సుబ్బారావుకూడ వెంటబడ్డాడు. ఎంత భార్యాభర్తలమైనా స్వార్థమనేది ఒక పట్టాన వదులుతుందటండీ! నే నొక్కర్తినే వచ్చి నా పాత్రను మీ చేత ఎంచక్కా తీర్చిదిద్దించుకుంటా నేమోనని, నేనూ మీరు కలిసి దోషమంతా ఆయన నెత్తినే రుద్దుతామేమోనని భయపడ్డట్టుంది పాపం మానవుడు. మరేం పర్వాలేదు. కథలో మొదటి పాత్ర నాది. నేను వెళ్ళి నా గొడవ చెప్పుకున్న తర్వాత, మీరు వెళ్ళవచ్చులే నని ఆపి వచ్చాను మాస్టారూ! మరి నన్ను ప్రారంభించ మంటారా?" ప్రశ్నించింది.

'తెలివి తేటలకేం కొదువలేదు. మంచి మాటకారిలా గూడ వుంది' మనసులోనే అనుకున్నాను. కాని వెంటనే నా

యెదుట నిలుచుని వుంది, నేను సృష్టించిన పాత్ర నీలవేణి అని స్ఫురణకు వచ్చింది. అయినా కాలం మరీ తెలుగుమీరి పోయింది. కాకపోతే చచ్చినట్టు నోరుమూసుకుని చెప్పినట్లల్లా వినవలసిన కథల్లోని పాత్రలు కూడ యెదురుగా వచ్చి బెదిరిస్తాయా!

సృష్టికర్త అనేవాడు మనకు కనుపిస్తే బావుంటుంది. నిలవేసి యెందు కీలాంటి జీవితాన్ని ప్రసాదించావో చెప్పమని డిమాండ్ చేసేవారిమి!

"మాస్టారూ! మీరేమో యింకా ఆలోచిస్తున్నట్టున్నారు. నాకు తీరుబాటు తక్కువ. ఉదయంనుంచి అలసి సొలసిపోయాను. ఆఫీసుపని, ఇంటిలో వంటా వార్పూ..." అర్ధోక్తిలో ఆగింది.

"ఉద్యోగం కూడ వెలిగిస్తున్నావటమ్మా!" ఆశ్చర్యంగా అడిగేశాను. నా పాత్ర నీలవేణి నిరాశతో మరణిస్తుంది. ఉద్యోగం చేయగలదనే వూహకూడ నాకు రాలేదు.

"మీ కాశ్చర్యంగా ఉందా మాస్టారూ! అందుకేగా మీరు ఊహించిన కథ సగం మాత్రమే నిజమని నే నన్నది" ఎదురు దెబ్బతీసిన వీరురాలుగా సగర్వంగా అంది.

అప్రయత్నంగా చేతిలోని వాచీవైపు చూచాను. పదకొండు గంటలయింది. వీధుల్లో జన సంచారంకూడ ఆగిపోయినట్టుంది. దూరంగా యెక్కడో పెళ్ళి మైకు గాబోసు, చేసే సందడి మంద్రంగా వినిపిస్తుంది. ఈ రాత్రి శివరాత్రి అయ్యేలా వుంది. ఈవిడను త్వరగా సాగనంపడం మంచిదని భావించి "అలా కూర్చోవమ్మా! కూర్చుని క్లుప్తంగా నీ కథ

యేమిటో చెప్పు. అమితోత్సాహంగా వచ్చావు. అందు లోను ఆడబిడ్డవు అందుకని వింటాను" అలనాడు కవచకుండ లాలు యివ్వ నుద్యమించిన కర్ణుడిలా పోజు పెట్టాను.

"పర్వాలేదులెండి మాస్టారూ! కూర్చుంటే 'మూడ్' రాదు. నిలుచునే చెప్తాను" అంది నీలవేణి.

"అబ్బో..." నే నేదో మనసులో అనుకునే లోగానే ఆమె తన కథనాన్ని ప్రారంభించింది.

"ఈ ఊరి మూల వీధిలోని ఎలిమెంటరీ స్కూలు హెడ్‌మాస్టర్ సుబ్బరామయ్యగారు మా నాన్న! ఆయన ప్రథమ సంతానాన్ని నేను. నా తర్వాత అయిదురుగు బిడ్డలు. అందరూ ఆడపిల్లలే! మొదటి బిడ్డను కాబట్టి నా ముద్దు ముచ్చటలు బాగానే తీరుతుండేవి. నేను ఆడింది ఆట, పాడింది పాటగా చలామణి అవుతూ వుండేవి. ఆ రోజులు మరీ నేటి దినాల్లా పేట్రేగిపోతూ వుండేవి కావు. బడిపంతులుకు అంతో యింతో గౌరవము, ఆదరణ, లభ్యమవుతూ వుండేవి. పైగా యింటిలో కూడ సంఖ్య తక్కువ!"

"ఇదంతా తెలిసిన సంగతేలే! ఉత్తి పాతచింతకాయ పచ్చడి. విని విని విసుగయిపోయింది. తర్వాత చెప్పు!" నేను మధ్యలో జోక్యం కలుగజేసుకొని నా అసహిష్ణుతను ప్రక టించాను.

నీలవేణి మెల్లగా నవ్వింది. సానుభూతి సూచకంగా - 'అయ్యో పాపం!' అన్నట్టున్న నవ్వు అది! నాకు వళ్ళు మండిపోయింది. కాని ఆమె తిరిగి వెంటనే వుపక్రమించింది.

"నాకు పదేళ్ళు వచ్చాయి. ఎలిమెంట్రీ స్కూల్లో

నుంచి హైస్కూలులో ప్రవేశించాను. జీవితంలో నాకో క్రొత్త మలుపు! 'నేను' అనే అహం నా కా రోజుల్లోనుంచే వచ్చింది. నా అందచందాలు, అందరి మన్ననలకూ పాత్ర మైనవి. స్కూల్లోనూ, యింటిలోనూ—బడికివెళ్ళే దారిలోను అందరూ నన్ను మెచ్చుకుంటూ వుండేవారు. మా నాన్న 'మా నీలు రాజకుమారి! పొరబాటుగా మన కుటుంబంలో జన్మించింది!' అని పలుమార్లు నా యెదుటే అనేవారు. బడిలో విద్యార్థుల కళ్ళన్నీ నా పైనే! తోటి విద్యార్థినుల కళ్ళలో నన్ను చూస్తే అసూయ తారాడుతూ వుండేది. వయసు వచ్చేకొద్దీ ఆకర్షణీయమైన నా అందం క్రొత్త రూపు రేఖల్ని సంతరించుకొని మరింత స్ఫుటంగా అందరి కళ్ళ లోనూ తారాడేది! రాను రాను నా మదిలో ఒక అధిక్యత పెరిగి పెద్దదిగాను ప్రారంభించింది. పదేళ్ళ వయసున్నలో నుంచి, వయసుతో బాటు మనసుకూడ పెరిగింది చుట్టూ వున్న వా రందరికంటే నేను ఉన్నతురాలిననీ, మసిబొగ్గు లలో మాణిక్యం విలువ యెప్పుడైనా గుర్తింపబడక తప్ప దని నాలో ఒక బలమైన విశ్వాసం యేర్పడిపోయింది! వయసు పెరిగేకొద్దీ, యవ్వనం వికసించేకొద్దీ అందరి కళ్ళూ నా మీదే నిలుస్తూ వుండేవి. ప్రత్యక్షంగాను, పరోక్షం గాను అందరూ నా అందచందాల్ని కొనియాడేవారు! కాని మా అమ్మ మాత్రం నా వైపు బాధగా చూచేది! అలా ఆమె చూడటం నాకు వింతగానే గాకుండా అసహ్యంగా తోచేది! 'ఎందుకే అమ్మా! అలా చూస్తావ్?' యెన్నో

సార్లు ప్రశ్నించాను కూడ! కాని అందు కామె జవాబుగా విషాదం వుట్టిపడే ఒక మందహాసాన్ని వెలువరించి 'ఏమీ లేదు తల్లీ! నీ బతుకు యెలా గడుస్తుందోనన్న బెంగ తప్ప మరేమి వుంది.' అని తిరుగా ప్రశ్నించేది! 'ఈవిడదో పిచ్చి' నేను మా అమ్మ ధోరణిని చూచి 'పాపం' అని జాలిపడే దాన్ని."

చెబుతున్న నీలవేణి హఠాత్తుగా ఆపేసింది! ఆయాసం తీర్చుకొంటున్న దానిలా రెండు క్షణాలు మౌనంగా నిలుచుంది. ఆ రెండు క్షణాలు నేను పరిశీలనగా ఆవిడవైపు చూచాను. సందేహం లేదు. చాల అందంగానే వుందని మనసులోనే అనుకున్నాను.

ఆమె తిరిగి "అలవరచుకున్న ఆధిక్యతకు తోడు నేను విపరీతంగా పుస్తకాలు చదివేదాన్ని. అవన్నీ ఉద్గ్రంథాలేవీ కావు. చౌకబారు పుస్తకాలు! మత్తు పదార్థాలు మనిషికి నిషా కలుగజేస్తవని మాత్రమే ఆ రోజుల్లో చెబుతుండే వారు. చెత్త పుస్తకాలుకూడ మత్తుపదార్థాలకంటే యేమీ తీసిపోయేవి కాదని కాలక్రమేణ నా కర్థమయింది. మానవుని లోని పాశవిక శక్తుల్ని తట్టి లేపుతూ, నరాలను జివ్వుమని పించే సాహిత్యం నేను కొల్లలుగా చదువుతుండే దాన్ని! దానికి తోడు తెలుగు - హిందీ సినిమాలంటే పడి చచ్చేదాన్ని! మంచిగానో, మారాంచేసో ఏదో ఒక విధంగా అన్ని సిని మాలు చూస్తూ వుండేదాన్ని. నా మనసులో జనించిన అతి శయము, పుస్తకాల్లోని భావాలు, ఆశలు, మూడు జమిలిగా

నన్ను పూర్తిగా నశం చేసుకొన్నవి. ఫలితంగా జీవితంలో నేను ప్రత్యేకంగా వుంటూ వుండేదాన్ని. వాస్తవిక పరిస్థితులు, చుట్టూ వున్న సమాజము, దాని ఆచార వ్యవహారాలు నా ఆలోచనా పథం దరిదాపులకు కూడ వచ్చేవి కావు. కాశీమజిలీలల్లోని రాకుమారులు, ఫారిన్ కార్లలో షికార్లు కొట్టే ధనాఢ్యులు - ఫుల్ సూటులో వున్న అధునాతన యువకులు, విలువగల వ్యసనాలతో యేదో దూరతీరాలలో దేనికోసమో వెదుకుతున్నట్లు కనిపిస్తూ నుదుటిమీదకు పడుతున్న క్రాఫ్ వెంట్రుకల్ని నిర్లక్ష్యంగా ఎగదోసుకునే పిల్లకారు నాయకులవంటివారు, నా కల్లల్లో కనుపించి నన్ను పలకరించి వెళ్ళిపోతూ వుండేవారు. సిరి దా నంతట దే వస్తుంది. అందుకు తగ్గ కృషి అవసరంలేదు. 'సిరి రావటానికి నారికేళ సలిలము భంగి అదృష్టము దాపురిస్తుంది. దానిని యెవరూ ఆపలేరు' అని మనసారా భావించేదాన్ని! ఫోర్తుఫారం పాసయిన రోజునుంచి సంబంధాలు వస్తూ వుండేవి. అమ్మ ప్రతి రోజూ యింటిలో పోరాడుతూ వుండేది. నాన్న 'మన మేం పై చదువులు చదివిస్తామా! ఎట్లాగూ హైస్కూలు ఉంది. స్కూలుఫైనల్ కానీ! ఈ లోగా మంచి సంబంధం వస్తే అప్పుడే యేదైనా చూస్తాం' అని ఆమెకు జవాబిస్తుండేవాడు.

'మంచి సంబంధం గాలిలో కొట్టుకవస్తుందా! ఎదిగిన ఆడబిడ్డను యింటిలో పెట్టుకొని మీకు చీమకుట్టినట్లయినా లేదు. ఇదేం ఖర్మండీ!' ఆమె తలబాదుకొనేది!

'కళ్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగదే వెర్రిదానా! భగవంతుడు చల్లని చూపు చూడాలిగాని...' తన బలహీనత బయట పడకుండా వేదాంతాన్ని కవచంగా ఉపయోగించాడు.

వారిని చూచి, వారి మాటలు వింటూ నేను జాలిగా నవ్వుకునేదాన్ని. ఏ క్షణంలో ఏ లక్షాధికారైన యువకుడో తన్ను చూచి యిట్టే సర్వస్వమూ మరచిపోయి తన కనుసన్నల్లో మెలగటానికి ప్రయత్నిస్తాడనీ - ఏ చలనచిత్ర నిర్మాతో తన అంద చందాలు విని తన కోసం వెతుక్కులాడుకుంటూ వస్తాడనీ, ఎందుకు వాళ్ళకు ఊహరాదు? ఊరికే బాధపడటం, ఆలోచనలు చేయటం, ఛీ! ఉత్తి నిరాశావాదులు అనుకునేదాన్ని.

రోజులు గడుస్తున్న కొద్దీ అమ్మ ఆవేదన అధికమైంది. నాన్న వేదాంతంయొక్క మోతాదు క్రమక్రమంగా తగ్గించి నా పెళ్ళికోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. స్కూలు ఫయినల్ పరీక్షలు యిచ్చాను. దానితో నాన్న హఠాత్తుగా మేల్కొన్నవాడిలా అమ్మకంటే యెక్కువ ఆలోచనలతో సతమతం కావటం నేను గమనించ గలిగాను.

నాన్నగారి అవిరామ కృషి ఫలితంగా నా కొకటొక టే పెళ్ళి సంబంధాలొచ్చాయి. అందంగాని, ఆడపిల్ల చదువుగాని, కుటుంబ సాంప్రదాయంగాని నేటి కాలంలో కన్నెల వివాహానికి ప్రధానంగాదు, కట్నం ప్రధానం. ఆడపిల్ల తండ్రి కూతురుతోపాటు యెన్ని వేలిస్తాడనేది ఘొదట

వరుల, వారి తల్లిదండ్రుల ఆలోచనా పథంలో తారాడుతుంది. ఆ దృష్ట్యా చూస్తే వాది వృత్తి నాసి సంబంధం! కట్నం కాదుగదా నాన్నగారు కనీసం వివాహం కూడ చేయించియివ్వగల పరిస్థితులలో లేరు. దినగండం నూరేళ్ళ ఆయుస్సుగా సంసార మనుగడే ఒక పోరాటంగా పరిణమించినవాడు మరి యేం చేయగలడు!

మొదటి సంబంధం ఒక అగ్రహారీకులది. వరుడు ఒడ్డూ, పొడవులతో పాటు రూపంలోనూ బాగానే వున్నాడు; కాని వయసు నలభైవ పడి దాటుతోంది. ప్రథమ కళత్రం యిటీవలనే మరణించింది. ఇద్దరు బిడ్డలున్నారు. నాలుగెకరాల మాన్యం, స్వంత యిల్లు - 'అతనికేం నిక్షేపంలాంటి వాడు!' అంది అమ్మ! కాని నాన్నకు పూర్తిగా ఇష్టంలేదు. అమ్మ పోరు పడలేక తనూ చేతగానివాడని అనిపించుకునేందుకు యిష్టంలేక ఆ సంబంధాన్ని తెచ్చారు.

తెల్లటి వాయిల్ చీర - ఎర్రసిల్కు బ్లౌజు - తలనిండా పూలు - అమ్మ నన్ను అలంకరించింది. నాకు నవ్వొస్తోంది. అంతా ఎగతాళిగా వుంది నా దృష్టికి. అయినా పెద్దల బుద్ధికి బాధ యెందుకు కలిగించాలని అలంకరించుకొని పెళ్ళి చూపులకు ఒప్పుకున్నాను.

అమ్మ వెంబడి తలవంచుకొని హాల్లోకి వచ్చాను. పెళ్ళికుమారునితో పాటు మరో బుంగమీసాల పెద్దమనిషి కూర్చుని వున్నారు. ఎర్రటికండువా మెడ చుట్టూ ధరించిన వ్యక్తే వరుడు అని సులభంగా ఊహించ గలిగాను.

బేరానికి ముందు సంతలో పశువుని చూచినట్టు వారి ద్దరూ నన్ను పరిశీలనగా ఎగాదిగా చూస్తూవుంటే నా వంటి మీద తేళ్ళు - జెర్రులు ప్రాకిన ట్లయింది.

'పర్వాలేదు! బాగుంది...' పెద్దమనిషి యిష్టంలేనట్టుగా వాస్తవాన్ని అంగీకరించినట్టు నా అందాన్ని గురించి సర్టిఫికెట్ యిస్తూవుంటే నాకు వళ్ళు మండిపోయింది.

'వంటా - ఇంటి పనులు అన్నీ అలవాటే నటమ్మా!' వరుడు అమ్మను అడుగుతున్నాడు.

'బాబాయ్! మీ బిడ్డలు పెళ్ళికెదిగా రా?' అతగాణ్ణి ప్రశ్నించాలని పెదాలపైకి వచ్చిన మాటల్ని బలవంతాన దిగమ్రింగుకొని విసవిసా ఆ గదిలోనుంచి లోనికి వెళ్ళిపోయాను.

అక్కడున్న అందరి ముఖాలమీద దిగ్భ్రాంతి కనిపించి వుంటుందనటంలో సందేహంలేదు. నేనేమీ లెక్క చేయకుండా పెరడులోని ఎర్రగన్నేరు చెట్టుక్రింద మంచంలో కూలబడి, అసంపూర్తిగా వదలిన డిటెక్టివ్ పుస్తకం చదవటంలో లీనమైపోయాను. ఆ తర్వాత ఎప్పుడో అమ్మ వచ్చి నెత్తీ నోరు బాదుకుంది. నాన్న వచ్చి యేవో హితోపదేశాలు చేశాడు. అవన్నీ నేను అసలు వినిపించుకుంటేనా...!

మరికొన్ని రోజులకు మరో సంబంధ మొచ్చింది. కట్టి వాడు, యువకుడు, బుద్ధిమంతుడు, వెనకావుందా యే ఆధారం లేకున్నా ఫాదాలతోను, ట్యూషన్లతోను స్కూల్

ఫయినల్ వరకు చదివి క్రొత్తగా తాలూకా ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం సంపాదించుకున్నాడట! నాన్నకీ సంబంధం ఎంతగానో నచ్చింది. అమ్మకు పూర్తిగా యిష్టం లేకున్నా మనసు సరిపెట్టుకుంది.

పెళ్ళి చూపులనాడు ఇద్దరి ముగ్గురి నడుమన కూర్చున్న అబ్బాయిని పరిశీలనగా చూచాను. ఎండిన చేపలా వున్నాడు. ముక్కూ ముఖం బాగున్నా పీక్కుపోయిన ముఖంతో ప్రపంచంలోని విచారాన్నంతా తనే మోస్తున్న వాడిలా క్రుంగిపోతున్నట్టున్నాడు. కారునలుపేం గాకున్నా నల్లగా వున్నాడు. కళ్ళల్లో గడ్డకట్టుకున్న దిగులు కాదు, కాదు భీతి తొణికిసలాడుతూవుంది. జీవితంలో అప్పుడే ఓడిపోయిన వాడిలా బెదిరిపోయిన గొడ్డులా గున్నాడు. అతన్ని చూస్తూనే నాకు నవ్వుతో బాటు 'పాపం' అని తెగ జాలి వేసింది! నేను సంకోచం లేకుండా ధైర్యంగా చూస్తూన్నా అతడు కళ్ళెత్తి సూటిగా నా వైపే చూడలేక పోయాడు.

ప్రక్కన కూర్చున్న మిత్రుల వత్తిడి భరించలేనట్టుగా 'మీరు...స్కూల్ ఫయినల్ పాసయ్యారా?' నట్లు గొడుతూ ప్రశ్నించాడు.

అవునన్నట్లు తల ఊపుతూ 'మీరేం చదివారు?' ధైర్యంగా తిరిగి ప్రశ్నించాను.

పాపం మానవుడు! బిత్తరపోయాడు! 'అవును' సిగ్గుతో తలవంచుకొని జవాబిచ్చాడు. అతని మిత్రులు వింతగా నా వైపు చూచారు. అమ్మ కొరకొరా చూచింది నన్ను. నాన్న తల వంచేసుకున్నాడు.

ఆ పెళ్ళిచూపుల అధ్యాయం అంతటితో ముగిసింది. నాన్న వారిని సాగనంపి యింటికి వచ్చారు. అమ్మ నన్ను, నాన్ననూ కలిపి సణుగుతుండల్లా ఆయన రాకను గమనించి 'మీ నిర్వాకం చూడండి! కూతుర్ని యెలా తయారు చేశారో! ఆడపిల్ల హద్దులు మీరితే మరెందుకయినా పనికి వస్తుందా! అయిదో తరగతిలో చదువు మానేయమంటే విన్నారూ? ఎప్పుడూ చేతిలో పనికిమాలిన పుస్తకాలు - హావ్వ! ఈలా బరితెంచి యిది ప్రవర్తిస్తే పెళ్ళిమాట అటుండనీ, మరెవరైనా మన గుమ్మం తొక్కుతారటండీ!' ఆమె ఆరున్నొక్క శృతిలో అందుకుంది.

నాన్న యేమీ మాట్లాడలేదు. మౌనంగా నా వైపు చూచాడు. ఆయన కళ్ళల్లో బాధ స్పష్టంగా కనుపిస్తున్నది. నేను ఊరుకోలేకపోయాను. అప్రయత్నంగా నా నయనా ల్లోంచి అశ్రుధారలు జాలువారినవి. 'నాన్నా! నేను మీ కంత బరువయ్యానా? ఎలాగో నన్ను వదిలించుకోవాలని యెందుకు మీరిలా వ్యర్థ ప్రయత్నాలు చేస్తారు. ఇక్కడ నా వునికే మీ కంత కష్టంగావుంటే గోరంత విషంపెట్టి నన్ను చంపండి! ఏదో బాధ్యత తీర్చుకున్నట్లు చేతులు దులుపుకోవ డమేనా మీకు కావలసింది, నా బాగోగులు మీకు అవసరం లేదా? నానా కష్టాల యెదుట నన్ను నిలుచోబెడతారు. సిగ్గుతో నా శరీరం కుంచించుకొనిపోతూ వుంటుంది. ఈలాంటి వారిని కట్టుకుని నూరేళ్ళ జీవితాన్ని బుగ్గిపాలు చేసుకొంటేనే గాని మీకు తృప్తిలేదా!' రుద్ధ కంఠంతో ప్రశ్నించాను.

'అయ్యో, తల్లీ! ఏమి అగడమే!' అమ్మ నోరు నొక్కుకుంది.

నాన్నగారు మాత్రం నా బాధ అర్థంచేసుకున్నట్టు 'మరేం చేయమంటావు తల్లీ! కలల్లో కరిగిపోవద్దు. వాస్తవికంగా ఆలోచించు! కుటుంబ పరిస్థితులు - చుట్టూవున్న సమాజం, దాని నియమ నిబంధనలు మానవుల్ని అస్వతంత్రుల్ని చేస్తవి. ఏ తలిదండ్రులైనా తమ సంతానం భవిష్యత్తు ఉజ్వలంగా వుంటుంది. లేకపోతే వినాశం తప్పదు. వినాశనానికైనా వెరువకుండా ముక్కుకు సూటిగా పొయ్యేందుకు మనం మహాత్ములమేం కాము' అన్నారు నాన్నగారు. ఆయన గొంతుకలో కన్నీరున్నట్టుంది - మాట తడబడింది.

'లేదు నాన్నా! నాకు వివాహమేవద్దు! మీ ప్రథమ సంతానం కుమార్తె గాకుండా కుమారుడని భావించుకోండి. స్కూల్ ఫయినల్ పాసయ్యాను! ప్రయత్నించేస్తే ఏదైనా వుద్యోగం దొరక్కపోదు. కాలం కలిసివచ్చినప్పుడు జానం తటదే వివాహసమస్య తీరిపోతుంది. మీరు మరేమీ పెళ్ళి సంబంధాలు చూడవద్దు. బోలెడంత కట్నాల్ని మనమీయలేనప్పుడు మంచి సంబంధాలు రావాలని కోరుకోవటంకూడా దురాశే అవుతుంది. మనసులేనివాణ్ణి కట్టుకొని జీవితాంతం బాధపడేకన్నా ఉద్యోగం చేయటంలో తప్పేమివుంది నాన్నా!'' ఆత్మవిశ్వాసం నాలో తొణికిసలాడింది. దృఢంగా వెలువడినవి నా మాటలు.

అమ్మ మా సంభాషణను మరి సహించలేనట్టు అక్క

డనుంచి మా సంభాషణను మరి సహించలేనట్టు అక్కడ నుంచి వెళ్ళిపోయింది. నాన్నగారు నాకేమీ జవాబియ్యలేదు. ఆలోచిస్తున్నట్టున్నారు.

"నాన్నా! కాలం ఎంతో మారిపోయింది స్త్రీ విద్య, స్త్రీలు ఉద్యోగాలు చేయటం నేటి రోజుల్లో మామూలైన విషయమని మీకు తెలియదా? ఎందుకు సంకోచిస్తారు. నా వివాహ సమస్యతో అహర్నిశాలు మీరు తల బద్దలుకొట్టుకోవటం నా కెంత బాధావహంగా వుందో మీ కెలా చెప్పను? చదువుకున్నదాన్ని, ఆదర్శోపాధ్యాయుడుగా పేరుపొందిన మీ బిడ్డని. మీకు తలవంపులుగాని అప్రతిష్ఠగాని కలిగించే పనినేనేం చేయనని నాలో విశ్వాస ముంచండి!" వినయంగా ప్రార్థించాను.

నాన్నగారు రెండు క్షణాలు ఆలోచించి తల పంకించి 'సరే నమ్మా! నీ యిష్టం!' అన్నారు.

ఆ రోజునుంచి నేను ఉద్యోగంకోసం ప్రయత్నాలు ప్రారంభించాను. ఎంప్లాయ్‌మెంటు ఎక్ఛేంజిలో పేరు రిజిష్టరు చేసుకున్నాను. నా కిచ్చిన వాగ్దానాన్ని బట్టి నాన్న మరి పెళ్ళి ప్రయత్నాలు చేయలేదు. అమ్మ సణుగుడును మేము లెక్క పెట్టటం మానుకున్నాం!

మరో నెలకే గర్ల్సు హైస్కూల్లో గుమాస్తా ఉద్యోగానికి యింటర్వ్యూ వచ్చింది నాకు. చదివిస్తేనే సరైన సంబంధం రానప్పుడు మరింక ఉద్యోగంచేస్తే అసలు పెళ్ళవుతుందా యని ఆమె బాధ! నాన్నాగారి అనుజ్ఞ ఆశీర్వా

చాలు నాకున్నాయి. ఏడెనిమిదిమంది అభ్యర్థుల్లోనూ నన్ను సెలెక్టుచేశారు. ఏనుగెక్కినంత సంబరమయింది నాకు. జాగ్రత్తగా నా ఉద్యోగ విధుల్ని నిర్వర్తిస్తున్నాను. ఇరుగు పొరుగువాళ్ళు ఎత్తిపొడవటం, దారంట వెళుతున్నప్పుడల్లా యెరిగినవారంతా యెద్దేవాగా చూడటం లెక్కచేసేదాన్ని గాదు. మొదట మొదట బాధగానే వున్నా రానురాను అది అలవాటయిపోయింది."

నీలవేణి తన కథనాన్ని ఆపింది. ఆమె విశాల ఫాల భాగాన మిలమిల మెరుస్తున్న స్వేదబిందువుల్ని పమిట కొంగుతో తుడుచుకుంది.

నా యెదుట నిలుచునివుంది, నేను సృష్టించిన పాత్ర అనే సంగతి నేను మరచిపోయాను. ఎవరో కొత్త వ్యక్తి చెబుతున్న కథలా యెంతో ఆసక్తితో వింటూ కూర్చు న్నాను. నీలవేణి ఉద్యోగంతో నేనూహించిన కథ నా ఊహ కనుగుణంగా కాకుండా ఒక కొత్త మలుపు తిరుగుతూ వుండటం వెంటనే గ్రహించాను. కథ నాపిన ఆవిడ వంక నిర్నిమేష దృష్టుల్ని బరుపుతూ కూర్చున్నాను.

"ఏం మాస్టారూ! బోర్ కొడుతోందా...?" చిరునవ్వు చిందిస్తూ ప్రశ్నించింది నీలవేణి.

"అబ్బె! పోకడ మారిపోయవుంటేను..." అర్థోక్తి లోనే, నసిగాను నేను.

"అందుకేకదా మాస్టారూ! పనిగట్టుకొని వచ్చి మరీ చెబుతూంది!" ఆమె చిలిపిగా నవ్వింది.

"అలా కూర్చోవమ్మా! ఎంతసేపని అలా నిలబడ తావ్!" హృదయపూర్వకంగా ఆహ్వానించాను ఎదుట వున్న కుర్చీని చూపుతూ.

ఆమె అడ్డంగా తలూపుతూ 'పర్వాలేదులెండి!' అంది.

తిరిగి నీలవేణి తన కథనాన్ని ప్రారంభించింది.

"టెరిలిన్ షర్టు, ఉలన్ పాంటు, యెగదువ్విన ఉంగ రాల క్రాఫ్ - ఒక యువకుడు రోజూ నాకు రెండు మూడు సార్లయినా తారసపడుతూండేవాడు. ఎర్రటి అతగాడి ముఖం నన్ను చూస్తేనే మరింత యెర్రగా ప్రకాశించేది. నేను అతని వైపు దృష్టి సారిస్తే దిగ్గున తలవంచుకునేవాడు. లేదా చూపు మరలించుకొనేవాడు. నేను అతనివైపు చూడనట్లుంటే చాలు, నా వైపే వళ్ళంతా కళ్లుజేసుకొని చూచేవాడు. గమనించ నట్టే నేనతని కదలికల్ని గమనిస్తూ వుండేదాన్ని. పాతికేళ్ళ కంటే యెక్కువ వయసేం వుండదు. అందమైనవాడనటంలో సందేహం యేమీ లేదు. మరికొన్ని రోజులకు, రోజూ నేను స్కూల్ కి వెళ్ళేటప్పుడు, తిరిగి యింటికి పోతున్నప్పుడు అతడు నన్ను దూరంనుంచే వెంబడించేవాడు. నాకూ ఒక బాడీగార్డు - మనసులోనే నవ్వుకొనేదాన్ని.

మొదట కొద్దిరోజులు ఆ యువకుడ్ని గురించి ఎప్పు డైనా మనసులోనే తలచుకొని చులకనగా నవ్వుకొనేదాన్ని. కాని...రానురాను అతని 'ఆరాధన' లాంటి చూపులు, ప్రవర్తన, నాలో మార్పు గలగజేయ ప్రారంభించినవి.

బితుకు బితుగ్గా రెండు మూడుసార్లు నా కళ్ళల్లోకి కూడా చూచాడు అతడు! అలా యెవరైనా చూస్తే కసిరికొట్టినట్లు చూసే నేను; ఎందుకనో మిన్నకుండా వూరకుండిపోయాను. రోజులు గడిచేకొద్దీ అతని 'ఆరాధన' ఇనుమడించింది. నాకు తెలియకుండానే నేనుకూడ అతన్ని గురించి ఆలోచించటం మొదలైంది! యువకుడు, అందమైనవాడు, విద్యావంతుడి లానే వున్నాడు. శ్రీమంతుడేనని అతడు రోజూ ధరిస్తున్న దుస్తులే సాక్ష్యమిస్తున్నాయి. గుణగణాలు, కుటుంబ సంప్రదాయం మంచివైతే, తోటి కులస్థుడైతే...నాకు తెలియకుండానే నాలో ఆలోచనలు పొరాడ ప్రారంభించినవి. అదృష్ట దేవత తన కనుకొలకుల్లోనుంచి నా వైపు దృష్టి సారించటం లేదుగదా - అని కూడ అనుకొనేదాన్ని.

ఆరు మాసాలనుంచి ఉద్యోగం చేస్తున్నా స్కూల్ అడ్రసుకు నా కెప్పుడూ ఒక ఉత్తరమైన వచ్చిన పాపాన పోలేదు. నాకు ఉత్తరాలు వ్రాసేవారు యెవరున్నారు? అలాంటిది, ప్యూన్ ఒకరోజు కవరొకటి తెచ్చి నా చేత నుంచాడు. నీలం కవరు, ముత్యాల్లాంటి ముచ్చటైన అక్షరాలలో అడ్రసు యెవరో శిల్పి తన పనివాడితనాన్నంతా, చూపి చెక్కినట్లుంది! ఉత్తరం చింపేందుకు నా కెందుకనో భయంవేసింది. చిరునామా అక్షరాలవంక అలాగే చూస్తూ నిలుచున్నాను నేను. ఏనాడు యెరుగని వ్రాత అది! సరికొత్తగా వుంది. ఆఫీసుగదిలో యెవ్వరూ లేరు. టీచర్లంతా క్లాసులకు వెళ్ళిపోయారు. ప్యూన్ బయట వరండాలో

కూర్చుని వున్నాడు. అత్రుత ఒకవైపు, యేదో తెలియని భీతి మరొకవైపు పీడిస్తూవుంటే దిక్కులు చూస్తూ మెల్లగా కవరు చింపాను.

'నీలవేణిగారికి,

ధైర్యంచేసి మీకు యిలా వ్రాస్తున్నందుకు క్షమించండి. నన్ను రోజూ మీరు చూస్తూనే వున్నారు! ఈ పాటికే నేనెవరో మీరు గ్రహించి వుంటారు. ఆరు మాసాలనుంచి ఆరాటపడి తుదకీనాడు ధైర్యంచేసి మీకు ఉత్తరం వ్రాస్తున్నాను. రేపు సాయంకాలం ఆరుగంటలకు మునిసిపల్ పార్కులో మీ కొఱకు యెదురుచూస్తూ వుంటాను. మీరు రాకపోతే, నా ఆశలన్నీ నిరాశలేనని, నేనూహించినవన్నీ గాలిమేడలేనని భావిస్తాను...మరి ఎల్లుండినుంచి నన్ను మీరు చూడలేరని మీరే తెలుసుకుంటారు. ఇష్టంలేని ఆడపిల్లల్ని 'టీజ్' చేసే అయోగ్యుణ్ణి కాదని నమ్మండి.

నా యీ ప్రవర్తనలో దోషముందని మీరు భావిస్తే మరో మారు మీ క్షమాభిక్ష నర్థిస్తున్నాను.

ఇట్లు
సుబ్బారావు.'

ఉత్తరాన్ని ఒకటి రెండుసార్లు చదివాను. ముందుగా కోపం ముంచుక వచ్చింది. ఆ తర్వాత మరేవేవో ఆలోచనలు నన్ను ముసురుకున్నాయి. ఉత్తరం ముక్కలు ముక్కలుగా చించి టేబుల్ క్రింద వున్న చిత్తుకాగితాల బుట్టలో వేశాను. ఆ దినమంతా ఏ ఒక్క ఆఫీసుపనిగాని మనస్ఫూ

ర్తిగా చేయలేకపోయాను. ఉత్తరం చించి వేసినా ఆ అక్షరాల పంక్తులు నా కళ్ళెదుటే నడయాడుతున్నట్లు కనుపించినవి. ఆ రాత్రంతా కంటిమీద కునుకు పట్టిందికాదు. పరస్పర వ్యతిరేకాలైన భిన్న భావాలు నా యెదలో సంఘర్షణ పడినవి. అమ్మ సణుగుడిని నేను లెక్క చేయకున్నా ఆమె ఆవేదనను పూర్తిగా అర్థంచేసుకోగలను! ఆమె తన చుట్టూవున్న సమాజానికి సజీవ చిహ్నం! అందుకనే బిడ్డ భవిష్యత్తుకోసం ఆమె అంతగా బాధపడటం! స్త్రీ జీవితం బహు సున్నితమైంది. అడుగడుగునా జాగ్రత్త అవసరం. లేకపోతే వినాశనం తప్పదు. యుగయుగాలుగా వంచింపబడుతున్న భారత స్త్రీకి మోక్ష మెప్పుడో! ఎవరీ సుబ్బారావు? రోడ్ సైడ్ రోమియోకాదు గదా? నేను సులభంగా వంచింపబడక పోయినా అపవాదులు తన మెడకు చుట్టుకుంటేనో! ఎంత అప్రతిష్ఠ! విశాల హృదయుడైన తండ్రి నా మీద యెంతో భరవసా పెట్టుకుని వున్నాడు. ఏదైనా అవాంఛనీయమైన సంగతి సంప్రాప్తమయితే ఆయన ఎంతగా కుమిలిపోతారో! ఆలోచిస్తూ వుంటేనే భయంవేసింది నాకు.

కాని...మరోవైపు మరొక రకమయిన యోచనలు పొటమరించినవి. జీవితగతి మారేందుకు జీవితంలో ప్రతి ఒక్కరికి ఒకటి రెండు మలుపులు మాత్రమే తటస్థపడతవి. తప్పటడుగు వేయకుండా, జాగ్రత్తగా వచ్చిన అవకాశాన్ని వదులుకోకుండా స్వీకరించటం ధీశాలుర లక్షణం. ఉత్తరం వ్రాసిన సుబ్బారావు యెందుకని నిజాయితీ పరుడు కాకూ

డదు? ప్రథమ వీక్షణంలోనే ప్రేమించి, ఆ ప్రేమకోసమే సర్వస్వమూ త్యాగంచేసినవా రెందరు లేరు? నా కుటుంబ ఆర్థిక పరిస్థితుల్నిబట్టి 'సుబ్బారావు' లాంటి సంబంధాన్ని నేను కలలోకూడా వూహించ వీలులేని విషయం! మనసారా అతడు నన్ను ప్రేమిస్తూవుంటేను, మిగిలిన అతని సంగతులన్నీ తమకు సంతృప్తికరంగా వుంటేను ఎందుకని అతణ్ణి వివాహమాడరాదు? వికసించిన పుష్పంలా సంపూర్ణ యవ్వనవతి అయిన నేను వివాహానికేం విముఖురాల్ని గాదుగదా? విరాగిణిని కాదుగదా! భావి జీవితాన్ని గూర్చి యెన్నో సుఖస్వప్నాల్ని కంటున్నదాన్ని. ఒకవేళ నాకు యిష్టంగాకపోతేనో, లేక అతనొకవేళ దగాకోరయితేనో మరి ఆ వూసే యెత్తుకోకుంటే సరిపోతుంది. కాబట్టి ఈ అవకాశాన్ని ఎందుకని వినియోగించుకో కూడదు? అందులోను అతడు భావావేశంలో పరుగులు తీస్తున్న వానిలా వున్నాడు. నేను పార్కుకి వెళ్ళకపోతే తన 'ఆరాధ' సంతా విఫలమయిందని, భగ్నప్రేమికుడిగా భావించుకొని యేదైనా అఘాయిత్యానికి పాల్పడడుగదా! అలా ఆలోచించినందుకు నవ్వు వచ్చింది. అందరి సానుభూతిని కోరవలసిన అభాగ్యురాలినయిన నేను ఎవరో ముక్కూ మొగమూ ఎరుగని యువకునిమీద జాలి చూపటం వింతైన విషయం కాదూ?

ఎప్పుడో తొలికోడి కూసేవేళకుగాని ఒక నిర్ణయానికి రాలేకపోయాను. సుబ్బారావు వ్రాసినట్టు మరునాడు ఆరు గంటలకు మునిసిపల్ పార్కుకు వెళ్ళి అతన్ని కలుసుకోవ

టానికి నిశ్చయించుకున్నాను! అన్ని రంగాల్లోనూ పురుషునితో బాటు ముందంజవేస్తున్న ఆధునిక తరానికి చెందిన యువతినైన నేను జీవితంలో వచ్చిన యీ అవకాశాన్ని పరీక్షించుకోవటంలో తప్పేమీలేదని భావించుకున్నాను. విద్యావంతురాల్ని. వివేక విజ్ఞానాలున్నదాన్ని. నేను సంయమనం గోల్పోవటం, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానానికి తిలోదకాలివ్వడం జరుగదని ఆత్మవిశ్వాసంతో దృఢనిశ్చయానికి వచ్చాను. అలా ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత తెల్లవారుఝాము పిల్ల తుమ్మెదలు జోకొట్టినట్లుంటే హాయిగా కన్నుమూశాను.

*           *           *

ఆ మరునాడు సాయంకాలం ఆరుగంటలకు స్కూల్ నుంచి తిన్నగా పార్కువైపు బయలుదేరాను. రేపిన తేనెటీగ తుట్టెచుట్టూ మూగే యీగల్లా ఆలోచనలు మనసుచుట్టూ ముసురుకుంటూ వుంటే వాటి ప్రభావం నా మీద పడకుండా వీలయినంతవరకు ప్రశాంతంగా, నిర్లక్ష్యంగా వున్నట్టు అవుపించేటందుకు ప్రయత్నించాను.

"వచ్చారా!...మీరు" పార్కులో ఆ చివర సిమెంటు తిన్నెమీద ఒక కాలూని నిలుచునివున్న సుబ్బారావు నన్ను చూచిన వెంటనే వికసిత వదనంతో దగ్గరకు వచ్చి పలుకరించాడు. ఆ రెండు మాటలు యెంతో కష్టసాధ్యంగా అతనిలోనుంచి వెలువడినట్లున్నవి. సిగ్గుపడుతున్నట్టు ఎర్రనైన అతని ముఖం తిరుగులేని సాక్ష్యాన్ని యిస్తోంది.

నేను మౌనంగా తలూపాను. ఏదో తెలియనిభయం, వింత ఆవేశము, సిగ్గు, సంకోచంతో నా హృదయం కుంచించుకొని పోతూ వున్నట్లనిపించింది.

మా యిద్దరిమధ్యా మౌనం అతి గంభీరంగా తావలం చేసుకొంది.

మాటా మంతీ లేకుండా అలా నిలబడటం నాకు సహించటం లేదు. క్షణం ఒక యుగంగా నడుస్తోంది. సాయం సమయపు పిల్లగాలులు వీస్తున్నా సుబ్బారావు నుదుట చెమట కారుతోనే వుంది!

చేతి గుడ్డతో ముఖం తుడుచుకుంటూ 'అలా కూర్చుందామా?' ఎట్టకేలకు అన్నాడతను ఎటో చూస్తూ.

ఇద్దరం వెళ్ళి సిమెంటు తిన్నెమీద చెరొక చివరను కూర్చున్నాం.

తిరిగీ మౌనమే! అతడు తల వంచుకె కూర్చున్నాడు.

"మీరెందుకని ఉత్తరం వ్రాశారు? విషయమేమిటో చెప్పండి." నేను సంకోచాన్ని విడిచి సూటిగా అడిగాను.

'అబ్బే...' అతడు తడబడ్డాడు. తల తడుము కున్నాడు. అతన్ని చూస్తుంటే పాపం అనిపించింది నాకు!

ఉన్నట్లుండి హఠాత్తుగా 'నీలవేణిగారూ!... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మనసారా ప్రేమిస్తున్నాను. మీరు లేకపోతే నాకు జీవితమే లేదు! నా ప్రేమ పవిత్రమైంది. మీకు అభ్యంతరం లేకపోతే మిమ్మల్ని వివాహం

చేసుకునేందుకు సంసిద్ధుణ్ణి!' అతడు తలవంచుకొని పంతు లమ్మకు పాఠం ఒప్పజెప్పే కుర్రాడిలాగ పలికాడు.

అతని ధోరణి నాకు నవ్వు తెప్పించింది. కొనపంటితో కింద పెదవిని నొక్కుకుంటూ నవ్వు నాపుకొని 'మిష్టర్! ప్రేమా, వివాహము అసామాన్యమైన విషయాలేం కావు జీవితంలో ఒకసారి పొరపాటు చేస్తే తిరిగి సవరించుకోలేం! మన చుట్టూ ఒక సమాజముంది. సామాజిక నిబంధనలున్నవి. ఆర్థిక వ్యత్యాసాలు, కులగోత్రాలు, పెద్దల అనుమతి- అన్నీ ఆలోచించుకొని అడుగుతున్నారా?' అడిగాను.

"నీలవేణిగారూ!" తలయెత్తి నన్ను సంబోధించిన అతడు రెండు క్షణాలు ఆగి తర్వాత యిలా అన్నాడు:

"కులగోత్రాలు గొడవ మనకు అడ్డురాదు. మనిద్దరమూ ఒకే కులస్థులము. ఆర్థిక అంతస్థుల తారతమ్యమంటారా, నేను జమీందారునేంగాదు. సామాన్యుణ్ణే. పెద్దల అనుమతితో నా కవసరంలేదు. నేను దురదృష్టవంతుణ్ణి. చిన్న నాటనే తల్లిదండ్రులకు దూరమయినవాణ్ణి. నా మేనమామ వెంకట్రామయ్యగారు కలెక్టరేట్‌లో స్థిరపడ్డారు. ఆయన రక్షణలో నేను వుంటూ వుంట! ఆయన నా మాట దేనిని కాదనరు. మీరు...' కొంచెంసేపాగి 'నేను మీ గురించి మీ కుటుంబాన్ని గురించి బాగా తెలుసుకున్నాను. మీ రేమీ చెప్పనవసరం లేదు. మీ కిష్టమైతే...' అర్థోక్తిలో ఆగాడు.

నా యెదుటవున్న యువకుణ్ణి సరిక్రొత్తగా చూచినట్లు చూచాను. అంతవరకు నాలో అతనిమీదున్న అలసత్వభావం

హరించుకపోయినట్లయింది. 'సుబ్బారావుగారూ! నాకు కొంత వ్యవధినివ్వండి! వివాహం నూరేళ్ళపంట. త్వరలోనే నా నిర్ణయాన్ని మీరు తెలుసుకోనగలరు.' నేను తిన్నెమీదనుంచి లేచాను.

మా యిద్దరిది ప్రవర్తన, సంభాషణా ధోరణి- అంతా వ్యాపార సరళిలో నడిచింది. యువ హృదయాలకు సహజమైన ఉద్రేక అవకాశాలకు మేము లోనుగాకుండా ప్రవర్తించినందుకు, వ్యవహార ధోరణిలో మా సమావేశం ముగిసినందుకు నిజంగా నేనెంతో ఆనందపడ్డాను.

చేతులు జోడించి అతడితో శలవు పుచ్చుకుంటున్నప్పుడు సుబ్బారావు ఆశగా నా కళ్ళలోకి చూచాడు. ఆ చూపుల్ని గమనించనట్టే నేను ప్రవర్తించి బయటకు నడిచాను.

మరునాడే నాన్నగారికి విషయమంతా అక్షరంకూడ పొల్లుబోకుండా వివరంగా చెప్పాను. ఆయన ముందుగా గాభరాపడ్డా, వెంటనే తేరుకొని సంతోషించారు. సుబ్బారావుని గురించిన వివరాలన్నీ రెండు రోజుల్లోనే తెలుసుకుంటానని అన్నారాయన.

నాన్నగారు చేసిన వాకబు ఫలితంగా తెలిసిందానికి, సుబ్బారావు చెప్పిందానికి భేదమేమీ లేదు. తల్లిదండ్రులిద్దరూ అతని చిన్నవయసులోనే మరణిస్తే పిల్లలు లేని మేనమామ యింటిలోనే పెరిగి పెద్దవాడయ్యాడు. స్వగ్రామంలో పిత్రార్జితమైన పొలం నాలుగెకరాలుంది. ప్రతియేటా కౌలురూపంలో అయిదు వందలు వస్తుంది. ఆ స్తి అంతే! కుర్రాడు బుద్ధిమంతుడు. ఈ బి. ఎ. ప్యాస

ద్యాడు. ఉద్యోగ ప్రయత్నాల్లో ఉన్నాడు.

నాన్నగారు తను తెలుసుకున్నదంతా చెప్పి 'బంగారంలాంటి సంబంధం తల్లీ! ఇది గనుక సెటిల్ అయితే మరి నాకు బెంగేవుండదు' అన్నారు."

కథ చెబుతున్న నీలవేణి హఠాత్తుగా ఆపి నా వైపు చూచింది. కథలో లీనమైన నేను యాదృచ్ఛికంగానే వూకొడుతున్నాను.

ఆమె మెల్లగా నవ్వింది.

"తర్వాత..." అడిగాను ఆత్రంగా నేను.

"తర్వాత... ఏముంది మాస్టారూ! పెద్దల ఆధ్వర్యంలో సుబ్బారావుకి, నాకు పెళ్ళయింది. ఆయన గత సంవత్సరమే బి. ఇడి; పాసయివచ్చారు ఇప్పుడు హైస్కూల్లో టీచరు. ఇద్దరమూ ఉద్యోగం చేస్తున్నాం. అడపా తడపా మా తండ్రిగారి కుటుంబాన్ని కూడ నేను ఆదుకుంటూ వుంటాను. నా రెండో చెల్లెలు మాతోపాటే వుండి చదువుకొంటోంది. హాయిగా మా సంసారం జరిగి పోతోంది" ఆపింది నీలవేణి.

"ఆ..." నేను నోరు తెఱచాను.

"మాస్టారూ!..." ఆమె తిరిగి ప్రారంభించింది.

"మీరు అభ్యుదయ కాముకులమని అనుకుంటూ వుంటారు. స్త్రీజన పక్షపాతులని అనిపించుకోవాలని ఆరాట పడుతూ వుంటారుకూడా! పాఠకుల్లో నా పాత్రమీద సానుభూతిని వర్షింపజేయాలని నన్ను దారి తప్పించారు. సుబ్బారావుని వంచకుణ్ణి చేశారు. విద్యా విజ్ఞానాలుండి పురో

గామి దశవైపు పయనించే ఆధునాతన స్త్రీని వంచితురాల్ని చేశారు. పురాణాల్లోనుండి మేము వంచింపబడుతూనే వున్నాం. మీరు కూడా..." ఆమె ఒక క్షణం ఆగి తిరిగి, 'పైగా ఘోరంగా ఆత్మహత్యా పాలయినట్లు చూడబో బోయారు! ఇది మీకు ధర్మమేనా మేస్టారూ? ఇలా చేసి నందువల్ల మీరు చేసేది స్త్రీ జనోద్ధరణ కాదుగదా, అందుకు పూర్తి వ్యతిరేకమైన భావాల్ని ప్రజల్లో ప్రోగుచేస్తున్నారు' నిలవేసి ప్రశ్నిస్తున్నట్లుంది నీలవేణి!

నేను గుక్క తిప్పుకోలేక పోయాను. పెదవికి మించిన పల్లులాంటి పాత్ర యీవిడ! అయినా ఓటమిని అంగీకరించ కుండా 'విద్యా వివేకాలుండి కూడ వెర్రి తలలు వేసేవారు, వంచింపబడి దిక్కుతోచక ఆత్మహత్యలకు దిగేవారూ, విద్యావంతులయిన స్త్రీలలో లేరా?' గట్టిగానే ప్రశ్నించాను.

నీలవేణి పకపకానవ్వింది. ప్రవాహసదృశంగా నవ్వింది.

నే నావిడవైపు విస్తుపోయి చూచాను.

ఆమె బలవంతాన నవ్వాపుకొని 'ఎవరో కొందరా లాంటి వారున్నారని స్త్రీ జనోద్ధరణ అనే గోచర్మాల్ని కప్పుకొని 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతీ!' అని గర్జించ వయ్యా! పోయిందేముంది' తీవ్రంగా యెద్దేవాచేసి జవాబు నాశించకుండా మాట మాత్రమైనా చెప్పకుండా గబగబా యింది నీలవేణి!...

నేను నివ్వెరబడి పోయాను!

కిటికీలోనుంచి వీచిన విసురుగాలి! నా ముందున్న కాగితాలు కిలకిలా నవ్వాయి!

# మధ్యతరగతి మనుషులు

సంజెవేళ పొలంనుంచి మరలి వచ్చిన రామచంద్ర య్యకు పాద ప్రక్షాళనానికి కంచు చెంబుతో నీళ్ళందిస్తూ "అబ్బాయి దగ్గరి నుండి ఉత్తర మొచ్చిందండీ!" అంది జానకమ్మ.

"కులాసాగానే ఉన్నాడటగదూ!" ప్రశ్నించి జవాబు నాశించకుండానే రామచంద్రయ్య పెరట్లోకి వెళ్ళాడు.

జానకమ్మ తుండుగుడ్డ భర్తకందిస్తూ "పరీక్షకు ఫీజు మూడు రోజుల్లో కట్టాలట. మొత్తం రెండు వందలైనాపంప మని వ్రాశాడు" అంది.

రామచంద్రయ్య భార్య మాటలకు "వూ" కొట్టాడు. అంతవరకు ప్రసన్నంగా వున్న అతని ముఖంమీద విచార రేఖలు మంద్రంగా అలుముకొన్నాయి.

మంచినీళ్ళ గ్లాసు భార్య చేతికందిస్తూ "మరో రెండు

మాసాలు. దేవుని కృపవల్ల యింతవరకు నెగ్గుకొచ్చాము. ఇప్పుడు తప్పుతుందా! ఏలానో చూడాలి" భార్యనుద్దేశించని స్వరమేయైనా గట్టిగానే అన్నాడు రామచంద్రయ్య.

జానకమ్మ బితుకు బితుగ్గా భర్తముఖంలోకి చూచింది.

"పిల్లలే?" బెంచీమీద చేరగిలబడుతూ ప్రశ్నించాడతను.

"మగపిల్లలిద్దరూ భోంచేసి స్కూల్లో డ్రామా వుందంటూ వెళ్ళారు. అమ్మాయి పక్కింటికి పేరంటానికి వెళ్ళింది.... చేతిలో చిల్లిగవ్వ లేదే! నాయుడు ముందే తొందర చేస్తున్నాడు. అబ్బాయికి ఫీజు పంపకపోతే పేరు తీసివేస్తారండీ మధ్యాహ్నంనుంచి తను పడుతున్న వ్యధను బయట పెట్టింది జానకమ్మ.

రామచంద్రయ్య ముఖం మీదకు నవ్వు తెచ్చిపెట్టుకొన్నాడు. "ఎందుకు దిగులుపడతావు! ఇంతా చేసిన వాళ్ళం యిప్పుడు వెనక్కు జంకుతామా? ఏదో విధంగా సరిచేస్తాం" భార్య దిగులు పోగొట్టేందుకు భరివాసా యిచ్చాడతను, కొండంత దిగులును తన గుండెల్లో దాచుకుంటూ!

అడపా తడపా తెచ్చిన మొత్తాలన్నీ లెక్కవేసి రెండు వేల రూపాయలకు తన పొలం తాకట్టు తనఖాపత్రం వ్రాసి యిచ్చిన సుబ్బారాయుడు దగ్గరకు వెళ్ళాడు, రామచంద్రయ్య. నెలకోమాటయినా వడ్డీ డబ్బులకోసం పరాయివాడ్ని బ్రతిమలాడి, బామాలి, రూపాయకు నెలకో అణా వడ్డీ చొప్పున తీసుకునేందుకు అలవాటుపడ్డ రామచంద్రయ్య

యిప్పుడు కూడా మరో రెండు వందలు తీసుకొని కడపలో బి.ఏ ఫైనల్ యియర్ చదువుతున్న పెద్దకొడుకు వెంకట్రమణకు మనియార్డర్ చేశాడు.

నాలుగెకరాల పొలము, యిల్లు, కాడి ఎద్దులు సొంత సేద్యము చేసే పేదరైతే అయినా మాట నిజాయితీతోను, నాలుగు అక్షరం ముక్కలు వచ్చి మర్యాదా మన్ననలు యెరిగినవాడు కా టం వల్ల రామచంద్రయ్య అంతకంటే యెక్కువ ఆస్తిపాస్తులున్న చాలమంది రైతులకంటే గౌరవనీయమైన స్థానమే సంపాదించుకున్నాడు గ్రామంలో. పేరుకు గ్రామమే నైనా వేంపల్లి తాలూకా కేంద్రమంతటి వూరు! హైస్కూలు, పోలీసు స్టేషన్, పోస్టాఫీసు, కాఫీహోటళ్ళ-సంధి యుగంలో సమాజంలా ఉంది. ఊట కాల్వలు, పంట పొలాలు, కష్టించి పనిచేసే రైతాంగం, సంత, పశువుల మందలు, పల్లెటూరిని గుర్తుకుతెస్తే, సినిమాహాలు, హైస్కూలు విద్యార్థులు బ్లాక్ ఆఫీసులో పనిచేసే ఉద్యోగ బృందము పట్టణాన్ని తలపింప జేస్తుంది.

చిన్ననాట సుబ్బరాజు బడిలో రామాయణ భారతాలు ధారాళంగా చదివేంతటి విద్యనభ్యసించిన రామచంద్రయ్య, ఆ రోజుల్లో గ్రామాల్లోని కొద్దిమంది విద్యావంతుల్లో ఒకడుగా పేరుపొందినవాడు. కాని...నేడు వాతావరణమే మారిపోయింది. శరవేగంతో మార్పులు జరిగిపోయినవి. అతడి విద్య ఈనాడు కొరగానిది. జానకమ్మ

రామచంద్రయ్యకు సాక్షాత్తు మేనరికము. చిన్ననాటినుంచి ఒకేచోట పెరిగి పెద్దవారైనారు. పిల్లలు పుట్టినదాది ఆలు మగలుగానే, పదిమంది పెద్దలలోనూ పరిగణింపబడుతూ అలాగే దంపతులయ్యారు. వారిద్దరి దాంపత్యమూ యిరుగు పొరుగులకు ఆదర్శప్రాయ మయింది.

రామచంద్రయ్యకు నలుగురు బిడ్డలు. పెద్దవాడు వెంకటరమణ, రెండో సంతానం రాజేశ్వరి, తర్వాత శ్రీకృష్ణుడూ, ఉమాపతీని.

యాభై సంవత్సరాల్ని చూచిన రామచంద్రయ్య నాలుగేళ్ళ క్రిందటివరకు జీవితంలో అప్పుచేయడమంటే ఏమిటో యెరుగడు. వెంకటరమణ చదువుతున్న హయ్యరు ఎలిమెంటరీ స్కూలుగా పరివర్తనమయింది. అంతవరకు ఆ గ్రామస్థులు తమ బిడ్డల చదువులు ఎలిమెంటరీ స్కూల్ విద్యతోనే ముగింపుచేసి సంతృప్తిపడుతూ వుండేవారు. ఎవరో వేళ్ళమీద లెక్కపెట్టతగ్గ కొద్దిమంది బిడ్డలు మాత్రం హైస్కూల్ చదువుకని పులివెందులకు, కడపకు వెళ్ళేవారు. స్కూలు మార్పుతో వెంకటరమణ హైస్కూలు విద్యార్థి అయ్యాడు. ఉన్న ఊరిలో ఉన్నత పాఠశాల చదువులో చురుకుతనం, ఉత్సాహం చూపుతున్నాడుకుర్రాడు. చుట్టూ ప్రపంచం మారిపోతూవుంటే తను మడిగట్టుక కూర్చోవటం బాగుండదు. అందుకనే రామచంద్రయ్య చదవను, వ్రాయను వస్తూ బడి మాన్పించి సేద్యంలో ప్రవేశపెట్టాలనుకొన్న కొడుకును చదువు కొనసాగించేలా చేశాడు.

"నాన్నా! స్కూల్ ఫయినల్ పాసయ్యాను" వార్తా పత్రిక చేతబట్టుకొని వచ్చి అమితోత్సాహంతో తన కృతార్థతని వెల్లడించాడు వెంకటరమణ.

"ఆ..." రామచంద్రయ్య ఉత్సాహం చూపలేదు. అంతకు మునుపే భార్యద్వారా పిల్లాడు కాలేజీలో చదువుకోవాలని వల్లమాలిన అభిలాషను చూపుతున్నట్లువిన్నాడు. 'కాలేజి చదువు' అంటే ఏమిటో అనుభవంలో లేకున్నా ఏనుగను పోషించేటంతటిదది - అని బాగా వినివున్నాడతను. రెక్కాడితేగాని డొక్కాడని తను యెక్కడ, కొడుకుకు కాలేజీలో చదువు చెప్పించడం యెక్కడ? రంగురంగులలో ఆకర్షణీయంగానే అవుపిస్తున్నా గగన కుసుమానికి చేయిచాచడం అసంగతమైన సంగతి అని అతడెరుగును.

తండ్రి నిర్లక్ష్యం అమితోత్సాహియైన పసి హృదయానికి గాయం కలుగజేసింది. ప్రక్కకు వెళ్ళి కన్నీరు తుడుచుకున్నాడు.

మరో పదిరోజులు గడిచాయి. హెడ్మాస్టర్ సుందర రామయ్య, రామచంద్రయ్యను పిలిపించాడు. వెంకటరమణ స్కూలంతటికి ఫస్టున పాసయ్యాడని, మొత్తం రాష్ట్రంలోనే అంత మంచి మార్కులతో పాసయినవారు యే ఒకరిద్దరో వున్నారని చెబుతూ పిల్లాడ్ని పెద్ద చదువులకు సంపమన్నాడు సుందరరామయ్య! హెడ్మాష్టర్ ప్రక్కనే బితుకు బితుగ్గా నిలుచుని వున్నాడు. వెంకటరమణ, తండ్రి నోటమ్మట వచ్చే జవాబుకోసం చెవులు రిక్కించి వింటున్నాడు పిల్లాడు. రామ

చంద్రయ్య దాపరికంలేకుండా తన కష్ట సుఖాలన్నీ వెళ్ళబోసుకున్నాడు హెడ్మాస్టర్ ముందు! అంతా విన్న సుందర రామయ్య "నీ యిష్టం రామచంద్రయ్యా! అదృష్టం అనేది అందరినీ వరించదు. నా బిడ్డల్లో కూడ యింత తెలివిగల వాడ్ని నేను చూడలేదు. స్కాలర్ షిప్పు గూడ తప్పకుండా వస్తుంది. ఆనక చింతించి ప్రయోజనం లేదు. నీ కష్టాలన్నీ నిజమే! నాలుగెకరాలలో నీవే ఒక కుటుంబాన్ని పోషించలేకుండా వున్నానంటున్నావు. నీ ముగ్గురు కొడుకుల మూడు కుటుంబాలకు భవిష్యత్తులో ఆ పొలం సరిపోతుందేమో ఆలోచించు! కాలంతోపాటు మనుషులు కూడా మారారులయ్యా! ఆస్తికంటే పదిలమయింది చదువు. పిల్లాడు బుద్ధిమంతుడు. మీ కుటుంబాన్ని వున్నతికి తీసుకెళ్తాడనే దానిలో సందేహం లేదు. ఆలోచించి నిర్ణయించుకో!" అన్నాడు.

రామచంద్రయ్య మరి ఆలోచించలేదు. హఠాత్తుగా నిర్ణయానికే వచ్చాడు - "సరే, మీ మాట కాదంటానా బాబూ! అదేదో సీటు - అది - దాన్ని గురించి అయ్యగారి ద్వారా ప్రయత్నం చేసుకొంటాను." ఆనంద విహ్వలుడైన పిల్లాడ్ని ప్రేమపూర్వకంగా చూస్తూ యింటికి వెళ్ళిపోయాడు.

వెంకటరమణ కాలేజీ చదువు ప్రారంభంకావటం రామచంద్రయ్య జీవితంలో ఒక కొత్తమలుపు! అలల వురవడి, ఆటుపోట్ల ప్రకంపనాలు లేని ప్రశాంత సరోవరంలా వున్న అతని సంసారిక జీవనంలో సరికొత్త మార్పు వచ్చింది.

భవిష్యత్తు మీద భరవసా, ఊహాల కందుబాటులో కమనీయంగా కనిపిస్తున్న తమ వున్నతి - రామచంద్రయ్యను

ఉత్తేజితుణ్ణి చేసింది. మోయరానిదని పూర్తిగా యెరిగే వున్నా జంకకుండా, జడవకుండా భారాన్ని తలమీద కెత్తుకున్నా డతను. జనకమ్మ వివేకి, ఆలోచనాజీవి అయినా భర్తమీాద ఆమెకు అపారమైన విశ్వాసం. అందుకనే మనసులోనే మధనపడుతున్నా రామచంద్రయ్య నిర్ణయాన్ని ఆమె ఎదిరించలేదు.

వానపాములా కాలం గడిచింది. వెంకటరమణ కాలేజీలో చేరి నాలుగేళ్ళు పూర్తి కావస్తోంది ఇంటర్ కూడా మొదటి తరగతిలోనే కృతార్థుడయ్యాడు బి ఎ. కు బదులుగా యే డాక్టర్ కోర్సో లేక యింజనీరింగో చదవాలని మనసారా వాంఛించాడు. కాని ఇంటివద్ద పరిస్థితులన్నీ అతనికి కరతలామలకం. అందుకనే ఆ వాంఛను వాంఛగానే హృదయంలో వుంచుకున్నాడు. తలిదండ్రులు ముందు వెలువరించలేదు కూడాను! వెంకటరమణ యిప్పుడు ఫయినల్ ఇయర్, మరో రెండు మాసాల్లో పట్టభద్రు డౌతాడు!

హెడ్మాష్టర్ సుందరరామయ్య చెప్పినటుల వెంకటరమణకు ఏదో కాలర్ షిప్పు వచ్చింది. కానీ అతని ట్యూషను ఫీజుకు కూడా సరిపోదు. ప్రతినెలా హాస్టల్ ఫీజు, పుస్తకాలు, బట్టలు బాధ్యత లేగిన కుర్రాడు యెంత పొదుపరే అయినా తడిసి మోపెడంత బరువు అవుతూనేవుంది ఆ పేద సంసారానికి.

నాలుగేళ్ళకు మూడు వేల రూపాయలు అప్పయింది. పొలం తాకట్టులోకి వెళ్ళిపోయింది. రాజేశ్వరి పెళ్ళి కెదిగింది.

దంపతు లిద్దరికీ బిడ్డ వివాహం తక్షణ సమస్యగా మారి భీతావహుల్ని చేసింది. మిగిలిన మగపిల్ల లిద్దరూ ఒకడు స్కూలుఫయినల్ మరొకడు థర్డ్ ఫారం చదువుతున్నారు.

రెంతు మాసాల్లో కొడుకు భట్టభద్రుడవుతాడు. పెద్ద ఉద్యోగం వస్తుంది. తమ కష్టాలన్నీ గడిచి గట్టెక్కుతవి. అప్పులన్నీ తీరిపోతవి. తమ శేషజీవితం హాయిగా, ఆనం దంగా గడిచిపోతుంది. రామచంద్రయ్య దంపతు లిద్దరూ ఎవ రంతకు వారు తమలో తామే ఊరటచెందేవారు.

అన్నయ్య చాల గొప్పవాడు. అతని జీతం వందలలో వుంటుంది. మంచి సంబంధాన్ని చూచి తనంతటివాడినే బావ మరదిగా పొందుతాడు. తన కలలన్నీ ఫలిస్తాయి. రాజేశ్వరి కన్నె హృదయంలో కలలు రేగినవి.

అంత పెద్ద చదువులు చదివిన అన్నయ్య తమ చదు వులకు అడ్డు చెప్పడు. నాన్న వద్దన్నా వూరుకోడు. సోదరు లిద్దరూ ఒకడు డాక్టరీ చదువుతానని, మరొకడు ప్లీడర్ని అవు తానని తమలో తామే వూహించుకొని మురిసిపోయేవారు.

చంద్రుని రాకకు చకోరాల్లా ఆ కుటుంబ సభ్యు లంతా పట్టభద్రుడు కాబోయే వెంకటరమణమీద ఆశలన్నీ కేంద్రీకరించుకొని కూర్చున్నారు

# 2

వెంకటరమణ పరీక్షలిచ్చి యింటికి వచ్చాడు. అతని రాకతో రామచంద్రయ్య కుటుంబమంతా బలిచక్రవర్తి తలపై పాదం మోపిన వామనుడిలా పెరిగిపోయింది. అందరి మనసుల్లోను ఆనందపరవశం అలుముకుంది. చుట్టూవున్న తమ తోటివారందరికంటే ఉన్నతుల మనుకున్నారు ఆ కుటుంబంలోని సభ్యులందరూ.

కళ్ళకి, కాళ్ళకి జోళ్ళు, ఫుల్ పాంట్ దోపివున్న తెల్లని చొక్కా - పచ్చని శరీరకాంతి, నూనూగు మీసాలతో నూత్న యౌవనం తొణికిసలాడే వెంకటరమణకి 'ఆఫీసర్ కళ' అప్పుడే వచ్చిందనుకున్నారు దంపతులు.

వెంకటరమణ యింటికొచ్చినదాది యింటి ఖర్చుకూడ రెండింతలు పెరిగిపోయింది. రెండుమూడు కూరలూ, రెండు పూటలా కాఫీ టిఫినులు, అందరి శరీరాలు కొద్దిగా నునుపు తేలినవి. నాయుడుగారి దగ్గర మరో నాలుగు వందలు చిల్లర చిల్లరగానే అప్పు మొత్తమయి కూర్చుంది.

వెంకటరమణ లయతప్పిన కాలేజీ విద్యార్థిగాడు, బుద్ధిమంతుడు. వివేకమూ, విజ్ఞానమూ సంతరించుకున్నవాడు. ఆ వయసులో ఊహాలను విహంగాలుగా వదలకుండా తన మనస్సును అదుపులో పుంచుకోటం అలవరచుకున్నాడు.

మొత్తం కుటుంబమంతా తనకోసం తలకు మించిన త్యాగం చేసింది. ఉన్న కొద్దిపాటి ఆస్తిని తాకట్టు పెట్టింది. పెళ్ళి కెదిగిన ఆడబిడ్డ - అలనాడు కాలేజీలో చేరేరోజు తన మనస్తత్వంలాటి మనసు; విద్యాపేక్షవున్న తమ్ముళ్ళు - అంతా తనమీదనే ఆశ పెట్టుక కూర్చున్నారు.

తన వారందరికి తెలియదుగాని నేటిరోజుల్లో బి. ఏ. డిగ్రీ ఏపాటిది? తనలాంటివా రెందరో నిరుద్యోగులుగా వీధులు తిరుగుతున్నారు. అథవా ఉద్యోగ మొచ్చినా ఆ వచ్చే జీతంలో తను వీరందరినీ పోషించగలుగుతాడా? అప్పులు తీర్చగలుగుతాడా? మరి తన భవిష్యత్తు మాటే మిటి? వెంకటరమణ తన భవిష్యత్తు నూహించుకోలేక పోయేవాడు.

పరీక్షాఫలితాలు వచ్చాయి, ఆశించినట్టే వెంకటరమణ పాసయ్యాడు. కుటుంబంలోని వారంతా సంతోషపడి పోయారు. పండుగ చేసుకొన్నారు. వాస్తవిక పరిజ్ఞానము, బాధ్యత, ఎరిగిన వెంకటరమణ ఆనాడు ఆనందప్లావితుడు కాలేదు. పద్మవ్యూహంలోకి విసరివేయబడ్డ అభిమన్యుడిలా భావించాడు.

ఆ మరునాడే ఒక సంఘటన - ఆశ్చర్యకరమైందీ, యెవరూ ఊహించనదీ జరిగిపోయింది. నిగనిగలాడే నల్లటి సరికొత్త కారు రామచంద్రయ్య యింటిముందు ఆగింది. సుబ్బరామయ్య అతని సతీమణి కారులోంచి దిగారు. సుబ్బ రామయ్య పేరుపొందిన కంట్రాక్టరు. గొప్ప పేరు ప్రఖ్యా తులు గలవాడు. నూతనాగంతుకులు వచ్చేసరికల్లా వెంకట

రమణ, రామచంద్రయ్య, రాజేశ్వరీలు యింట్లో వున్నారు. వారిని చూస్తూనే రామచంద్రయ్య కాలుగాలిన పిల్లిలా తొక్కిసలాడాడు వెంకటరమణ చాప తెచ్చి పరిచాడు. రాజేశ్వరి కాఫీకి నీళ్ళు పొయిమీద వుంచింది.

కళ్ళు కిందికి వంచి వినయంగా కూర్చున్న వెంకటరమణ వొకసారి తృప్తిగా పరికించాడు. సుబ్బరామయ్య గారు కళవళపాటు పడుతున్న రామచంద్రయ్యను చిరునవ్వుతో సరసన కూర్చోమని చెప్పి సూటిగా యిలా అన్నాడు:

"మీ వెంకటరమణను మా అల్లుడిగా చేసుకోవాలని అభిలషిస్తున్నాం బావగారూ!"

రామచంద్రయ్య "ఆ..." నోరు తెరిచాడు. కంట్రాక్టరు సుబ్బరామయ్య యెక్కడ, తనెక్కడ? తనతో వియ్యమందాలని అభిలషిస్తున్నాడా? తన చెవులను తనే నమ్మలేక పోయాడు.

ప్రక్కనే కూర్చున్న వెంకటరమణ షాక్ తిన్నవాడిలా ఫీలయి వెంటనే తేరుకున్నాడు.

"ఏమిటి బావా! ఆలోచిస్తున్నారా? మనది దూరపు బంధుత్వం కూడాను. అమ్మాయి కాలేజీలో అబ్బాయిని చూచింది. పిల్లల కోర్కెను మనమెలా కాదంటాము చెప్పు! ఏదో దేవుని దయవల్ల అంతో యింతో పలుకుబడి వుంది మనకు. అల్లునికి మంచి ఉద్యోగం చూచే పూచీ నాది. కట్న మెంతకావాలో చెప్పు నీ మాటకు తిరుగుండదు."

రామచంద్రయ్య జవాబు చెప్పలేదు. ఏమని చెబుతాడు? ఆనంద విహ్వాలత అతన్ని ఊపిరాడనీయడంలేదు.

'నాన్నా...' వెంకటరమణ మెల్లగా యేదో చెప్పబోయాడు.

కాని... ఇంతలోనే సుబ్బరామయ్య "తొందరేంలేదు బావగారూ! బాగా ఆలోచించుకోండి, మీ కిష్టమైతే కబురు పెట్టండి. వచ్చే దశమినాడు తాంబూలం పుచ్చుకుందాం... రావే" వంటయింటిలోకి వెళ్ళి జానకమ్మతో మాటాడుతున్న భార్యను కేకవేసి లేచాడు.

ఇరుకు సందులో పెద్దకారు మూలిగి మూలిగి మరీ కదలిపోయింది. కారు దృష్టిపథంలోనుంచి మరుగుపడినంత వరకు ఎవ-నోటమ్మటా పలుకు పెకిలి రాలేదు!

బేరసారాలలో ఆరితేరిన కంట్రాక్టరుగారు ప్రశాంతమైన ఆ కుటుంబంలో కలవరపాటును సృష్టించి మరీ వెళ్ళిపోయాడు.

లోనికి వచ్చిన రామచంద్రయ్య అటూ యిటూ తిరుగుతూ చేతులు నలుపుకుంటున్నాడు. జానకమ్మ భర్తవేపే కన్నార్పకుండా చూస్తోంది. వెంకటరమణ మనసులోనే బాధగా నవ్వుకున్నాడు.

"అబ్బాయ్! అవును, ఆయన మనకు దూరపుబంధువే. నీవు చూచావా వారి అమ్మాయిని? ఏమంటావ్, అయినా మనవారి కింతకంటే మంచి సంబంధం మరెక్కడ దొరుకుతుంది?" రామచంద్రయ్య వెంకటరమణ నుద్దేశించినట్టు నట్లుగొడుతూ మాట్లాడాడు.

జానకమ్మ కొడుకు జవాబు కోసం చెవులు రిక్కించుకొని వింటోంది.

ఆలోచిస్తున్న వెంకటరమణ హఠాత్తుగా ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా "నాన్నా! కనీసం మరి నాలుగేళ్ళ వరకైనా వివాహ ప్రసక్తి రానీయవద్దు!"

"ఆ..." నోరు తెరిచారు దంపతులిద్దరూ ఒకేసారి!

"అవున్నాన్నా! నేనేం చిన్న పిల్లాడినిగాను. కుటుంబ పరిస్థితులు నాకు తెలుసు! చుట్టూ అప్పులు. నా చదువుకైన అప్పులైనా తీర్చి, చెల్లి పెళ్ళిచేసిగాని నేను వివాహ మాడను. పెళ్ళయినాక కుటుంబ మంటూ ఒకటి యేర్పడిన తరువాత మన కుటుంబానికి నే నే విధంగా సహాయం చేయగలనో నాకు అర్థంకాని సంగతి! అసలది సాధ్యమవుతుందని నేను విశ్వసించలేను. ఆనక బాధపడీ ప్రయోజనం లేదు. నా మొదటి కర్తవ్యమేదో దాన్ని నేను నెరవేర్చుకోనీయండి..." ఏనాడు తండ్రి యెదుట అంతలా మాట్లాడని వెంకటరమణ తన వాగ్ధోరణిని చూచి తనలో తానే సిగ్గుపడి మధ్యలోనే ఆపాడు.

మానవ మనస్తత్వం చాల విచిత్రమైంది! ఒక్కొక్కప్పుడు సరిగ్గా మనమేది మనసులో భావించుకుంటూ వుంటామో; అదే యెదుటివారినుండి బయల్వెడలితే కస్సుమంటాము. అర్థంలేని ప్రతిష్ట, మనసులో దాగియుండే అహం మనల్ని అలా ప్రవర్తింపజేస్తవేమోనని అనిపిస్తుంది.

రామచంద్రయ్య విషయంలో సరిగ్గా అదే జరిగింది.

అతని అంతరంగంలో కొడుకు సంపాదనతో మొట్ట మొదట అప్పులు తీర్చుకోవటం - కూతురి వివాహము ప్రథమ స్థానంలో వున్నా సరిగ్గా అదే మాటలు కొడుకు నోటంట విని సంతోషించేందుకు బదులు కోపంతో తారాజువ్వలా లేచాడు.

"నీవు నాకంటే పెద్దచదువులు చదివి వుండవచ్చు నోయ్! నాకంటే బాగా ఆలోచించగలవని కూడా భావిస్తు న్నావేమో! కాని ఏది మంచో, ఏది చెడ్డో నాకు తెలును! అమ్మాయి వివాహము, అప్పులు నా దృష్టిలో లేవను కున్నావా! కాని పెద్దమనిషి గుమ్మంలో కొచ్చినప్పుడు నిరా కరిస్తే తిరిగి అలాంటి అవకాశం లభిస్తుందా? సుబ్బరామయ్య బోలెడంత పలుకుబడిగల మనిషి. తలచుకుంటే మూడు రోజులలో నీకు తగిన ఉద్యోగం వేయించగల పోమతుగల వాడు. మనంతకు మనమే ప్రయత్నించితే ఏలాంటి ఉద్యో గం వస్తుందో, యెప్పుడు వస్తుందో యెవరికేం తెలుసు? నీకు పెళ్ళయి నీకు సంసారమంటూ ఒకటి యేర్పడితే ఈ సంసా రాన్ని ఉద్ధరించకూడదని యెక్కడుంది? మనసనేది వుండాలి గాని మార్గాలు కనిపించకపోవు. అథవా వీలుకాలేదే అను కుందాం! పుట్టించినవాడు పూరి మేపకపోడు. ఏదీ, యెవరి కోసమూ ఆగదు. నా కండల్లో బలమున్నంతవరకు, గొంతులో కొనవూపిరి వున్నంతవరకు, నా కుటుంబంకోసం నా చేతనైంది చేయకుండా వూరుకుంటానా? నీ యిష్టం. నీకు రెక్కలు వచ్చినాయనుకుంటే నీ కిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించు, నేను

కాదనను," మెల్లగానే నైనా తీవ్రంగా అన్నాడు రామ చంద్రయ్య.

జానకమ్మ కళ్ళతోనే కొడుకును బ్రతిమిలాడింది.

వెంకటరమణ రెండు నిముషాలు మౌనంగా నిలుచున్న వాడల్లా "సరే నాన్నా, మీ యిష్టం! మీ కెలా తోస్తే అలా చేయండి. నేనింకా ఎదురుమాట్లాడను. సుబ్బరామయ్య గారికి కబురుపంపండి" అంటూ మెల్లగా అక్కడనుంచి జారుకున్నాడు.

* *

కస్తూరి, వెంకటరమణల వివాహం వైభవంగా జరిగి పోయింది. సుబ్బరామయ్య, అడుగకుండానే అల్లుడికి పదివేల రూపాయల కట్నం యిచ్చాడు- పరువు, ప్రతిష్ఠల్లో తనేమీ తక్కువ తిన్నవాడుగాదన్నట్టు. రామచంద్రయ్య ఆ పదివేలు వెచ్చించి కోడలికి తమ నగలుగా చేయించాడు. వివాహంవల్ల చిల్లర ఖర్చులకు, బట్టలకు కలిసి మరో అయిదు వందలు నాయుడు దగ్గర అప్పుచేసి, యింటికి కూడా తాకట్టు పెట్టేడు!

వెంకటరమణకు యివన్నీ యే మాత్రమూ ఇష్టంలేదు కాని తాను తండ్రిని ఎదిరించదలుచుకోలేదు. అందుచేతనే నిమిత్త మాత్రుడుగా చూస్తూ మిన్నక ఊరుకున్నాడు!

వివాహమై సరిగ్గా నెల తిరుగకముందే హైద్రాబాద్ సెక్రటేరియట్‌లో వెంకటరమణకు ఉద్యోగం వచ్చింది. అభి వృద్ధికి వచ్చేందుకు బోలెడన్ని అవకాశాలున్న ఉద్యోగం! జీతం మొదట రెండువందలే అయినా బాధపడనవసరం లేదని

వెంకట్రమణ కూడా తృప్తి పడ్డాడు. సుబ్బరామయ్య అల్లుని ముందు తన గొప్పతనాన్ని ప్రదర్శిస్తూ "ఇది మొదటి మెట్టు మాత్రమే! చూడవోయ్, అంచెలంచెలుగా నీవే ఎలాంటి అభివృద్ధి సాధిస్తావో! పదేళ్ళలోనే నీవు కలెక్టరవుతావు" తృప్తిగా మీసాలు సవరించుకుంటూ మరీ అన్నాడు.

కస్తూరి బి.ఎ. పూర్తి చేసేందుకు మరి నాలుగు మాసాలుంది. ఆ నాలుగు నెలలు వెంకట్రమణ హైద్రాబాద్‌లో వున్నాడు. ప్రతి మూడవ తేదీన రామచంద్రయ్య వంద రూపాయల మనియార్డర్ అందుకుంటున్నాడు.

గొప్పయింటి అల్లుడు కావటం, బి. ఎ. చదివే భార్య, మంచి ఉద్యోగము - ఇవేవీ వెంకట్రమణను తృప్తి పరచ లేదు. భవిష్యత్తును గురించిన ఆలోచనలే అతన్ని అనుక్షణం కలవరపెడుతూ వుండేవి. కన్ను మూసినా తెరచినా ఇంట్లో తల్లిదండ్రులూ, సోదరులు - పెళ్ళి కెదిగిన చెల్లెలు - ఇంటి మీదా, భూమిమీదా అప్పులు - ఇవీ మెదలాడుతూ వుండేవి. తన వ్యక్తిత్వానికి, ఉన్నతికి కారణ భూతులై సర్వస్వమూ త్యాగంచేసినవారి యెడల తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోగలడా? ఏం చేయాలి! ఎలా చేయాలి! జీవితంలో వాస్తవికత తర్జనితో బెదరిస్తూవుంటే పరిష్కార మార్గాల కోసం విస్ఫారిత నయనాలతో ఆలోచించడం తప్ప మరేం చేయలేక పోయాడు పాపం అతడు!

నాలుగు నెలలు యిట్టే తిరిగిపోయినయి. హైద్రాబాద్ నగరంలో స్వంత కాపురం పెట్టాడు వెంకరమణ.

# 3

కస్తూరి కలవారి బిడ్డ. చిన్ననాటినుంచి పేదతనమంటే యేమిటో యెరుగదు. తనకిచ్ఛవచ్చినవన్నీ సాధించుకోవటం, విచ్చలవిడిగా ఖర్చు పెట్టటం ఆమెకి అలవాటైన విషయం. దయాదాక్షిణ్యాలు, పరోపకార గుణములు ఆమెలో సహజం గానే వున్నా సంపద తెచ్చిపెట్టిన అహం ముందు అవి స్వాత స్సిద్ధమైన రూపంలో బయటపడేవి. తనలాగ, తన భర్త కూడా వేషభాషల్లోను, ప్రవర్తనలోను, ఆడంబరంగా హోదాకు తగినట్లుగా వుండాలని భావించేది. కాని...వెంక ట్రమణ ధోరణి అందుకు పూర్తిగా వ్యతిరేకమైంది. అతను తను సామాన్యుడనని బాగా యెరిగి వున్నాడు. అందు కను గుణంగానే అతని ప్రవర్తన గూడ వుండేది. ఆడంబరాలు గిట్టేవి కావు. దంపతు లిద్దరూ ఆనందాను రాగాలలో వున్నా, ఆర్థిక విషయాల్లో ఉత్తర దక్షిణ ధృవాల్లో వుండే వారు.

రెండు గదులు, ఒక హాలు, పెరడు - అద్దె నెలకు అరవై రూపాయలు. తనకు తెలిసినవాండ్లు లేకపోయినా, మరీ చౌకగా యిల్లు సంపాయించాడు వెంకట్రమణ! నజరా నాలు చెల్లించకుండా అంత యింటిని సంపాదించుకోవటం హైద్రాబాదులో నిజంగా గొప్ప సంగతి! వెంకట్రమణ

తన కది ఘనవిజయంగా మురిసిపోయాడు. కస్తూరి కూడ చూచి సంతోషిస్తూందని ఆశించాడు. కాని రెండు లారీల సామానుతో గృహప్రవేశం చేసిన కస్తూరి యింటిని చూచీ చూడటంతోనే చిన్నబుచ్చుకుంది! తెచ్చిన ఫర్నిచర్‌లో సగంకూడా ఆ హాలు పట్టిందికాదు. కస్తూరి వెంట వచ్చిన బావమరది అమెరికన్ ప్రాంతాల్లో 'కౌబోయ్' లాంటి డ్రెస్‌లో "వ్వాట్!...నాన్సెన్స్! ఎలుక బొరక్ లా వుంది, బాత్ రూంలా! ఎంత బావుందో చూడవే!" అనటం చెవులారా విన్నాడు వెంకట్రమణ. అందుకు జవాబుగా భార్యేమీ అనకపోవటం ఖిన్నుణ్ణి చేసింది పాపం ఆ మానవుణ్ణి!

మరు రోజుకల్లా పని కుర్రాడు, వంటమనిషి తయారయ్యారు. 'కౌబోయ్' ఇల్లంతా అలంకరించేశాడు! డోర్సుకు కర్టెనులు - ఫ్లవర్ వేజులు కూడ తెచ్చి అలంకరించాడు. మూడో రోజున వెళ్తూ "వస్తానండీ బావగారూ! నాన్నగారు చెప్పారు, నగరంలో మీ జీతం జేబు ఖర్చుకు కూడా చాలదని. ఏమీ బిడియపడకుండా కావలసినంత డబ్బుకు వ్రాస్తూండండేం!" అన్నాడు.

ఆ మాటలు విన్న వెంకట్రమణ తన హృదయాన్ని పిడికిలితో కెలికినట్లు బాధపడుతూనే "ఊ"అని ఊకొట్టాడు.

బావమరది వెళ్ళిన తర్వాత తేలికగా ఊపిరి వదిలాడు వెంకట్రమణ. తన భార్య కస్తూరి అభిమానవతి. ఆమెది కోమల హృదయం. కష్ట సుఖాలన్నీ ఆమెకు వివరించి

ఆమెలో పరివర్తన తేవాలని నిశ్చయించుకున్నాడు! ఆమె సహాయ సహకారాలు పొందడం మానుకొని పొదుపుగా సంసారాన్ని నిర్వహించుకొంటూ వీలయినంత తన తల్లి దండ్రులకు సహాయంచేస్తూ వుండాలనేది అతని ధ్యేయం. ఆత్మగౌరవం నిలుపుకొని బ్రతుకుతూనే, తనని యీ స్థితికి తెచ్చిన వారి ఋణం వీలయినంత తీర్చుకోవటం తన కనీస బాధ్యతగా అతని కుండాలి - అందుకుగాను అవసరమైతే తను మరికొంత సంపాయించటానికి సిద్ధపడ్డాడు. కాని ముందు భార్యలో మార్పు రావాలి!

వెంకట్రమణ తన ప్రయత్నాన్ని ప్రారంభించాడు.

మెల్లమెల్లగా సుతిమెత్తని మాటలలో అతడు తన హృదయాన్ని ఆమె ముందు వెలువరించాడు. ఆమె మెల్లగానే అన్నది: "అబ్బే! వంటచేయడం నా కెప్పుడూ అలవాటు లేదండీ!"

"పోనీండి! మామయ్య కుటుంబాన్ని ఇక్కడే తెచ్చి వుంచుకుంటేనో! వారూ మనతోపాటు వుంటారు."

"దానిదేముందీ వారికీ సహాయం చేయండి!" అంది. కస్తూరి మాటలకు బాధగా నవ్వుకున్నాడు వెంకట్రమణ. ఆమె ఆ సమస్యనుకూడా వెంకట్రమణలా సీరియస్‌గా తీసుకోలేదు. తేలికభావం ఆమె వినడంలోను, చెప్పడంలోను కూడ స్పష్టంగా అవుపించింది.

"అదికాదు కస్తూరి! నా బాధ నీవు అర్థంచేసుకున్నట్లు లేదు."

"ఏమిటి? మీ రనేది. నాకు అనవసరం, ఇవన్నీ నాకు నచ్చవు. నేనేం మీ వాళ్ళకు సహాయం చేయవద్దన్లేదే, ఎందుకింత బాధపడుతున్నారో నాకు అర్థంకావటంలేదు."

పోనీ వాళ్ళని రమ్మంటే ఏం బాగుంటుంది చెప్పు. కస్తూరి వాళ్ళకి నచ్చుతుందో లేదో యిక్కడికి రావటానికి. పోనీ మనం డబ్బుపంపి సహాయంచేస్తే ఎట్లా వుందంటావు?"

"నే కాదన్లేదే. మీ ఇష్టం వచ్చినట్లుగా చేసుకోండి. నాకు యివేం చెప్పక్కర్లేదు. మీరు మీరూ ఏమైనా అవండి, నా కనవసరం."

"అది కాదు కస్తూరి."

"ఏది కాదు."

"మా వాళ్ళకి ఎలా సహాయంచేస్తే బాగుంటుందో చెప్పమని. యెలా చేస్తే నీకు నచ్చుతుందో చెప్పు. అలా చేస్తాను. నీ మాట నీదేకాని నా మాట కనీసం పట్టించుకోవు కదా!"

"నచ్చటాలు, నచ్చకపోవటాలు యేమిటో నా కర్థంగావటంలేదు పోతే మీ వారికి సహాయం చేయాలనే బాధ మీ కుంటే మీ జీతమంతా ప్రతి నెలా వారికే పంపండి! నాకు ఆక్షేపణేమీ లేదు. కలిగీ ఖర్మగా నేను పేదరికం అనుభవించాలని యెక్కడాలేదు!" కస్తూరి తీవ్ర స్వరంలో జవాబిచ్చింది.

పాపం! వెంకట్రమణ భార్య జవాబు విని దిగ్భ్రాం తనతో నిర్ఘాంతపోవడం తప్ప మరేమి చేయగలడు? తన జీతం రెండు వందలు తన తల్లిదండ్రులకు పంపేందుకు అతడు

సిగ్గుపూలిన వాడేంగాదు! ఆత్మగౌరవమూ, ప్రతిష్ట - పరువు- ఇవి అనూచానంగా అతనికి సంక్రమించినవి. రక్తంలో జీర్ణించుకుపోయిన ఆ భావాల పలుకుబడినుండి సులభంగా విడిపడలేదు!

వెంకట్రమణ కిప్పుడు తన యెదుట రెండే రెండు మార్గాలు కనుపిస్తున్నవి. ఒకటి - కని, పెంచి, పెద్దజేసి తన కీ వ్యక్తిత్వం ప్రసాదించిన వారియెడ తన బాధ్యతా నిర్వహణకోసం కట్టుకున్న యిల్లాలితో ఘర్షణ పెట్టుకొని తన కుటుంబ జీవితాన్ని నరకప్రాయం చేసుకోవటం - తద్వారా యెన్నో చిక్కులు, మనస్సుకు శాంతిలేకపోవటం, మరొకటి- గతాన్నంతా మరచిపోయి, తన తల్లిదండ్రుల ఊసే యెత్తుకోకుండా ఆనందప్రదంగా వ్యక్తిత్వం లేకపోతేనేం జీవించటం, పలుకుబడిగల మామగారి ద్వారా జీవితంలో వున్నతి సాధించటం!—నవలల్లోను, కథల్లోను, తెలుగుసినిమాల్లోను కథానాయకులు వాస్తవానికి అమడదూరంలోవుండి ఆదర్శాలతో జీవిస్తారు. కాని వెంకట్రమణ వాస్తవికమైన ఆలోచనా ధోరణినుండి, ఆ ధోరణిలో పరిస్థితులు ఆకళింపుచేసుకోవడం నుండి. భవిష్యత్తును ఊహించుకోవడంనుండి, దూరం కాలేదు.

ఫలితంగా వెంకట్రమణ పరిస్థితులతో రాజీపడి పోయాడు. హృదయంలో అప్పుడప్పుడు బాధ కెలుకుతున్నా లెక్కజేయక ఆనందంగా గడపడం అలవరచుకున్నాడు. తన కుటుంబానికి సహాయం చేయాలనే ధ్యాసనుండి దూరమయ్యాడు. అంతవరకు తన బాధ్యత అనుకున్నప్పుడు పరిస్థితుల ప్రభావంగా మారిపోయింది.

# ౧౦

సంవత్సరం తిరిగే సరికల్లా—

రామచంద్రయ్య పొలము, ఇల్లు సుబ్బారాయుడు కోర్టు వేలంలో తనే పాడి తన బాకి క్రింద స్వంతం చేసుకున్నాడు. కోర్టునుంచి నమ్మను వచ్చిన రోజే మంచంపట్టిన రామచంద్రయ్య నెల తిరిగేసరికల్లా గుటుక్కు మన్నాడు. తండ్రి మరణవార్త విని హైద్రాబాద్‌నుండి టాక్సీలో భార్యతో సహా వచ్చాడు వెంకట్రమణ. కర్మకాండలుచేసి, అందరినీ తన వెంటరమ్మని యథాలాపంగా పిలిచాడు. కాని ఆ ఆహ్వానంలో ఆప్యాయతగాని, అనురాగంకాని కనుపించలేదు. అందుచేతనే జానకమ్మ నిరాకరించింది. వెంకట్రమణ దీర్ఘంగా నిట్టూర్చి భార్యవెంట వెళ్ళిపోయాడు.

వెంకట్రమణ పెద్ద తమ్ముడు శ్రీకృష్ణుడు కోమటి కొట్టులో గుమాస్తాగా చేరాడు. నెలకు జీతం యాభై రూపాయలు. అదే కుటుంబానికి ఆధారం! చిన్నవాడు ఉమాపతి చదువుమానేసి రౌడీల జతలో తిరుగుతున్నాడు! ఎప్పుడో యింటికి రావటము, అందరిమీద తిరగబడటం, చిల్లరడబ్బుల కోసం తల్లిని ఏడిపించడం వాడికి మామూలు విషయమైంది!

మరినాలుగేళ్ళు గడిచిపోయినవి—

ఈ లోగా రామచంద్రయ్య సంసారంలో మరికొన్ని సంఘటనలు జరిగిపోయినవి. ఉమాపతి ఒక దొంగతనం చేసి జైలుకు వెళ్ళిపోయాడు. రాజేశ్వరి, సినిమా హాల్లోని ఆపరేటర్‌తో కలిసి యెక్కడకో పారిపోయింది. వారిద్దరి మధ్య అక్రమ సంబంధం చూచాయగా యెరిగిన అందరూ

దేన్నైనా రాజేశ్వరి అంతగా తెగిస్తుందని యెవరూ అనుకో లేదు. జానకమ్మ యిప్పుడు యెందుకోగాని కన్నీరు గార్చటం లేదు. ఆమె కళ్ళలో నీరు యింకిపోయింది. పిచ్చిదానిలా నిర్లిప్తంగా కన్నార్పకుండా చూస్తూ కూర్చొని వుంటుంది. ఆమె జవసత్వాలుడిగిపోయాయి.

"అమ్మా! అన్నయ్య కలెక్టర్ అయినాడటనే—" శ్రీకృష్ణుడు ఒకరోజు ఇంటికి వస్తూనేఆనందంగా తల్లితో అన్నాడు.

'ఆ. " జానకమ్మ కళ్ళు విస్ఫారితాలయ్యాయి. ఆ ఆనంద విహ్వలతనుండి ఆమె ప్రాణ వాయువులు అనంత వాయువుల్లో లీనమయినవి.

# మూడు పూవులు ఆరు కాయలు

నాన్నగారి అంత్యక్రియలకు డబ్బు తీద్దామని యినప్పెట్టె తెరిస్తే, ఖాళీ బోషాణం బావురుమని కనిపించింది. నాలుగు విక్టోరియా రూపాయలు, రెండు నడిమికి రెండుగా చిరిగిన అయిదు రూపాయల కాగితాలు, అంతే! విశ్వనాథం విస్తుపోయాడు. తల్లిని పిలిచి అడుగుతే, 'ఆ ఇనప్పెట్టె ముఖం యేనాడైనా నేను చూశానా బాబు! ఏం లావాదేవీలో ఏం ఖర్మో, బ్రతికుండగా జేబులనిండుగా నోట్లు తురుముకుని మరీ తిరిగేవాడు. నిన్ను దిక్కులేని పక్షినిచేసి పోయాడిప్పుడు' ధారాప్రవాహంగా స్రవించే కన్నీటిని పమిట కొంగుతో తుడుచుకుంటూ అంది సుందరమ్మ.

దుఃఖార్తురాలైన తల్లి !ంచబడుతుందనే దృష్టితో విశ్వనాథం తండ్రిగారి దివసాన్ని భారీయెత్తులోనే జరిపించాడు. పెద్దదివసంనాడు రెండువందల బంధువర్గానికే

గాకుండా అయిదువందల పేదలకు కూడా అన్నదానం చేశాడు. వీటన్నింటికి డబ్బెలా తెస్తున్నావని సుందరమ్మ అడుగుతే జవాబు చెప్పకుండా మ్లానంగా నవ్వి ఊరుకున్నాడు విశ్వనాథం.

బ్రతికినంతవరకు శ్రీనివాసరావు జమీందారి ఫాయిదాలోనే బ్రతికాడు. ఇంటినుండి బయట కడుగు వేశాడంటే చుట్టూ పది పదిహేనుగురికి తక్కువ గాకుండా అనుచరులుండేవారు. మాసానికి కనీసం ఏ రెండు సార్లయినా మద్రాసుకో, బెంగుళూరుకో వెళ్ళి పది, పదిహేను రోజులుండి మరీ తిరిగి వచ్చేవాడు. గుర్రప్పందాల సీజన్‌లో మద్రాసులోనే మకాం! ఐదారు వందలమంది కార్మికులు పనిచేసే బట్టల ఫ్యాక్టరీవున్నా, మేనేజర్, యితర హాంగుదార్లే దాని వ్యవహారాన్నంతా చూచేవారు. శ్రీనివాసరావు షికారు వెళ్ళి వచ్చినట్లుగా అటువైపు వెళ్ళేవాడు. రోజూ అయిదారు బ్రాందీబుడ్లు పగులుతూ వుంటవని, పట్టణంలో 'పెద్దసైజు' ఉంపుడుకత్తెలున్నారని, గుర్రప్పందాల్లో డబ్బు దోసిళ్ళతో విరజిమ్ముతూ వుంటాడని గ్రామస్థులంతా శ్రీనివాసరావును గురించి విపరీతంగా చెప్పుకునేవారు

సుందరమ్మ శ్రీనివాసరావుకు భార్యయైనా, 'కార్యేషు దాసి...క్షమయా ధరిత్రి' వరకే! శ్రీనివాసరావంటే ఆమెకు సింహస్వప్నం! భర్త చర్యలకు లోలోన కుమిలేదే కాని నోరెత్తి పలికేది గాదు

విశ్వనాథం ఆ దంపతులకు ఏకైక పుత్రుడు. తండ్రి

చ ర్యల్ని గురించి యుక్తాయుక్తంగా ఆలోచించే వయసు రాకముందే ఊరిలోని హైస్కూల్లో స్కూల్ ఫయినల్ పూర్తిచేశాడు. తర్వాత కాలేజీ చదువుకి మద్రాసు చేరుకున్నాడు. మొదటి సంవత్సరం మద్రాసునుండి వేసవుకాలపు శలవులు వొచ్చినప్పుడు తండ్రి కేదో చెప్పాలని నశిగాడు. 'పోరా పిల్లకాకి' శ్రీనివాసరావు గర్జించాడు. అంతే! ఆనాటి నుంచి తండ్రీ కొడుకులమధ్య సంబంధాలు సక్రొత్త ధోరణిలో నడిచాయి. ఎప్పుడో ఏడాదికి రెండుసార్లు వచ్చి తల్లిని చూచి, నాలు గయిదురోజు లుండిపోవటం తప్ప శలవులకు యింటికి వచ్చేవాడు కాదు విశ్వనాథం! ప్రతి నెలా కొడుకు చదువుకు డబ్బు పంపడం శ్రీనివాసరావు వంతు. అయితే మనియార్డర్ రసీదులో సంతకం చేయటం విశ్వనాథం వంతు! వారిద్దరిమధ్యా ప్రత్యుత్తరప్రత్యుత్తరాలు అంతవరకే పరిమితమై పోయినవి!

ఎమ్. ఎ. పరీక్షకు దీక్షగా చదువుకుంటున్న విశ్వనాథానికి ఒక అర్ధరాత్రివేళ ఇంటివద్దనుంచి టెలిగ్రాం వచ్చింది. తండ్రి హృద్రోగంతో అకస్మాత్తుగా మరణించాడంటే నమ్మలేకపోయాడు విశ్వనాథం. కళ్లు నులుముకొని మరీ చూశాడు. కల కాదు యథార్థమే! నాటివరకు తండ్రిపై గల ద్వేషం, ఒక్కపెట్టున తుడుచుకు పోయిందతని హృదయంలో. చిన్న పిల్లాడిలా బావురుమని యేడ్చాడు.

కర్మల తర్వాత ఒక్కరొక్కరే అప్పులవాళ్ళు రా ప్రారంభించారు. సానుభూతి వచనాలు పలుకుతూ మెల్లగా

తమ కివ్వవలసిన మొత్తాల్ని గుర్తుచేసేవారు. అందులో కొన్ని బాండు పత్రాలు, మరికొన్ని చేబదుళ్ళు, రావాల్సిన బాకీలంటూ ఏమీ ఏర్పడలేదుగాని ఇవ్వ తేలిన ఋణాలు యాభై వేలకు పైగా తేలింది.

విశ్వనాథం చిన్ననాటినుంచి ఆదర్శవాది. పైగా మద్రాసులో అతను తిరిగిన పరిసరాలు, చేసిన స్నేహాలు, రూపులేకుండా అస్పష్టంగా మిణుకు మిణుకుమనే అతని ఆశయాలకు ఆదర్శాలకు ఉత్తేజాన్ని కలుగజేశాయి.

ఏ చీకూ చింతా లేకుండా పుస్తకాలతో జీవితంగడిపే విశ్వనాథం పైన ఒక్కసారి సంసారభారం పడింది. అందులోనూ లెక్కలేనన్ని. వాళ్ళు - తల్లి ఆ క్రిందవారు - మిల్లు సరిగా నడపకుండటం - పైకి లోకులందరి దృష్టికి గొప్పగా అవుపిస్తున్నా తల్లి వంటిమీద నగలుతప్ప చేతిలో డబ్బేమీ లేకపోవటం - అన్నీ సమస్యలే! విశ్వనాథం రెండు మూడు రోజులు తీవ్రంగా ఆలోచించాడు. మెదడు వేడెక్కిపోయేలా యోచనలు సాగించాడు. తల్లితో సంప్రతిస్తామంటే ఆమె, 'నే నాడముండను, నాకేం తెలుసు నాయనా! చదువుకున్న వాడివి. బుద్ధి తెలిసినవాడివి. నీ కెలా యిష్టమయితే అలా చేయి! నీ యిష్టమే నా యిష్టం!' అంది. తల్లిని చూచి

విశ్వనాథం జాలిపడ్డాడు. ఆమె బాబాపు ఒక యంత్రం! అంతే! ఏనాడో స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంది. అధికారం చెలాయిద్దాం అనే వూహ కాదు కదా కనీసం, హాయిందాగా వుండాలనైనా ప్రవర్తించదు. ఆమె భారత స్త్రీ! అను కున్నాడు మనసులోనే తల్లి నిగూర్చి విశ్వనాథం!

విశ్వనాథం మేడను అమ్మకానికి పెట్టి అప్పులన్నీ తీర్చేశాడు. నాలుగు గదులుండే సామాన్యమైన యింటికి తరలింది ఆ సంసారం!

మొట్ట మొదటిసారిగా మిల్లు కెళ్ళాడు. మేనేజర్ సుబ్బారాయుడు చిరునవ్వుతో స్వాగతమిచ్చి ఆఫీసుగది లోకి తీసుకెళ్ళాడు. నలుగురు గుమాస్తాలు, ఒక టైపిస్టు, కుషన్ ఛేర్లు - ఎలక్ట్రిక్ పంకాలు ఆఫీసుగది దివ్యంగావుంది.

మిల్లు పరిస్థితినిగురించి తనడగాలనుకుంటుండగానే సుబ్బారాయుడు చెప్పాడు కూలీలంతా రోజురోజుకీ కార్మిక సంఘాలంటూ సోమరిపోతుల్లా తయారవుతూన్నారని, గట్టిగా దండించేందుకు ఆ సంఘాల పెడద అడ్డం వస్తోందని, యంత్రాల్లో కూడా కొన్ని భాగాలు పూర్తిగా పాతపై పోయాయని, అయినా మొత్తంమీద మిల్లు లాభదాయ కంగానే నడుస్తూందని చెప్పాడు. "సిల్వు మాత్రం వుం టుందండి?" విశ్వం ప్రశ్నించాడు. సుబ్బారాయుడు గుటకలు మ్రింగుతూ "అయ్యా! ఏముందండి! ఏదో రెండు వంద లుంది. అంతే! పెద్దబాబుగారు రోజూ..."

తర్వాత సుబ్బారాయుడు యేంచెబుతాడో తెలుసు విశ్వానికి. అందుకే అతని ప్రసంగాన్ని ఆపుచేస్తూ 'సరే! పోన్లెండి. సాయంకాలం ఒక గంట ముందుగా మిల్లు నాపు చేసి పనివారందర్ని ఆవరణలో సమావేశపరచండి.' అన్నాడు విశ్వం.

"పనివారినా? సమావేశమా!" విస్తుపోయాడు సుబ్బారాయుడు. కాని వెంటనే తేరుకొని 'నాపేరు చిన్న బాబుగారు కాదు. విశ్వం అని పిలవండి చాలు' విశ్వం అన్నాడు.

విశ్వం ధోరణి సుబ్బారాయుడ్ని తికమకపెట్టింది చేతులు నలుపుకుంటూ మెల్లగా అన్నాడు. 'మీరు చిన్న వారు. అనుభవం లేదు. పనివారి నెంతలో వుంచాలో అంతలోనే పెట్టేయాలి. హద్దులు దాటనిచ్చామా... ఇక మన పని ఆఖరే! సమావేశ మెందుకు చెప్పండి! మీ రేం చెబుతారో నాతో చెప్పండి. అంతా సక్రమంగా నిర్వహింపబడకపోతే అప్పుడు నన్నడగండి.'

సుబ్బారాయుడు ధోరణికి విశ్వానికి కోపం, అసహ్యం కూడా జనించాయి. అయినా తమాయించుకొంటూ 'పంతులుగారూ! నేను చెప్పినట్లు చేస్తారా లేదా?' ప్రశ్నించాడు. ఎంత మెత్తగా అనాలన్నా కర్కశత్వం, అసహిష్ణుత విశ్వం పలుకుల్లో మారుమ్రోగాయి. సుబ్బారాయుడు చేతులు జోడించి 'సరే' నంటూ మిల్లులోకి జారుకున్నాడు.

# 3

విశాలమైన మిల్లు ఆవరణలో అయిదు వందల మంది కార్మికులు సమావేశమయ్యారు. వారిందరి ముఖాల్లో దిగులు-గడ్డకట్టుకున్న దిగులు తాండవిస్తోంది. ఏ కొందరో తప్ప మిగిలిన వారంతా బిక్కచిక్కి కళారహితంగా అవుపిస్తున్నారు. యాజమాన్యం చేతులు మారుతోంది. క్రొత్త బాబు యెలాంటివాడో! రిట్రుచిమెంటు జరగదు కదా! లేకపోతే లాభాలు సరిగా రావడంలేదని, మిల్లునే మూత వేయిస్తారా? ఇలా కార్మికులందరు యెవరంతకు వారే మౌనంగా యోచనలు సాగిస్తున్నారు. ఏళ్ళతరబడి యెద్దుల్లా శ్రమించిన వారి జీవితాల్లో యజమాని యెదుట బడటమంటే అదేదో అపకారమే తటస్థించుతుందనిమాత్రం వారు బాగా యెఱుగుదురు.

"చూడండి! ఇది నా ఇల్లు కాదు. మన ఇల్లు! దీనికి యాజమాన్యం వహించవలసింది నేటినుంచి మీరే! నేను కూడా మీలో ఒకడ్ని మాత్రమే. నే డిక్కడ మనమంతా, సమావేశమయి భావిని సుఖప్రదంగానే గాదు ఆదర్శవంతంగా చేసుకోవాలి." విశ్వం సహజంగానే మాట్లాడాలన్నా వుపన్యాస ధోరణి రానేవచ్చింది.

"ఎలక్షన్లు ఏమైనా జరుగుతున్నాయేరా!" గుంపులో నెవరో మరొకర్ని అడిగారు,

"ఇదేదో కొత్తరకం గూండపురాణీగా వుందిరా" ఒక కార్మికుడు మరొకని చెవులు కొరికాడు.

"ఇదంతా యెందుకుబాబూ! మమ్మల్నేం చెయమం టారో చెప్పండి- కూలిముండావాళ్ళం." ఎవడో ధైర్య స్థుడు బిగ్గరిగా అడిగేశాడు.

సుబ్బారాయుడు అలా అడిగినవాడిపై ఎర్రగాచూచి విశ్వంమీది కోపంకూడా అతడిమీదే చూపుతూ 'నోరు మూసుకొని వినరా తొత్తు...'

"సుబ్బారాయుడుగారూ!" విశ్వం గర్జించాడు.

"ఇదే వరసబాబూ! నోరు తెరిస్తే యీాయన నోటంట బూతులు వస్తాయి. అదయివన వాళ్ళమీద చేయికూడ చేసుకుంటాడు" ఒక యువకుడు ధైర్యంగా లేచి ఫిర్యాదు చేశాడు. సుబ్బారాయుడు లోలోన మండిపడ్డాడు.

సమావేశంలా గాకుండా రెండు మూడు గంటల సేపు కార్మికులతో మాట్లాడుతూ వారి కష్టసుఖాల్ని తెలుసుకున్నాడు విశ్వనాథం. సుబ్బారాయుడు తనకేదో పని వున్నట్లు ఆఫీసుగదిలోకి జారుకున్నాడు. మిల్లులోని యంత్రాలు కొన్ని పూర్తిగా ఏక్షణాన్నైనా ప్రమాదం కల్గించవచ్చుననీ సుబ్బారాయుడు ఆదాయాన్నంతా దుర్వి నియోగం చేయటమే కాకుండా, స్వంతంగా పెద్దమేడ కూడా కట్టుకున్నాడని కార్మికులద్వారా తెలుసుకున్నాడు విశ్వనాథం. పరిస్థితులన్నీ అవగతం చేసుకొన్న విశ్వనాథం యిలా అన్నాడు వారితో- "నా హృదయంలో రూపుతేని

కొన్ని ఊహలు మెదులుతున్నాయి మీ సహకారంతో ఆ ఊహల్ని వాస్తవం చేయాలనుకుంటున్నాను. మా తండ్రిగారు ఈ మిల్లునుకూడా పరాధీనం చేసి మరణించారనే నేను భావిస్తాను. కాబట్టి మనమంతా కలసి ఒక ఆదర్శాన్ని యెందుకని నెలకొల్పరాదు?చూడండి—మీరందరూ కలిసి ఐదుమందిని ఎన్నుకోండి! కాని, వారంతో యింతో విద్యావంతులు, నిపుణులైన కార్మికులూ అయ్యేలా చూడండి. వారి చేతికి మిల్లు యాజమాన్యాన్నిస్తాను. నేనూ మీలో ఒకణ్ని. అంతే!నాకు ప్రత్యేకతేంలేదు. కమిటీ అప్పగించిన పని చేసేందుకు నేను సంసిద్ధుణ్ని" విశ్వనాథం యిలా చెబుతూంటే ముందు కార్మికులు నమ్మలేకపోయారు. కొందరు జాలిపడ్డారు కూడా. కానీ ఎలాగైతేనేం విశ్వనాథం వారందరి హృదయాల్లోనూ నమ్మకాన్ని కల్గించాడు.

మరునాడే తమ కార్యక్రమానికి పూనుకోవాలని వారందరూ ఒక నిర్ణయానికి వచ్చి రాత్రి 8 గంటలకల్లా ఆనందోత్సాహాలతో సమావేశాన్ని ముగించారు. కార్మికులందరి ముఖాలూ కళకళ లాడాయి. విశ్వనాథంలో కూడ ఒక వింత ఆవేశం ఆవహించి మనిషి ఉద్రేకంతో వూగిపోయాడు.

జీవితంలో యేనాడు బయటి వ్యవహారాల్లో జోక్యం కల్పించుకోని సుందరమ్మ, ఆ రాత్రి విశ్వనాథాన్ని 'ఏమిటి నాయనా! ఈ వెర్రి' అడిగింది. విశ్వనాథం తన భావాలన్నీ తల్లికి చెప్పాలని ప్రయత్నించాడు. కాని సుందరమ్మ అర్థం

చేసుకోకుండానే స్వతస్సిద్ధమైన మాతృప్రేమతో "నీ యిష్ట మబ్బాయ్! అయినా నేను చెప్పేదేముంది! ఈ వంశంలో ప్రతి ఒకరికి యేదో ఒకటి యిలాంటి జబ్బు మామూలే! ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు" వేదాంతాన్ని వల్లించి తృప్తిపడింది. తల్లి వచనానికి విశ్వనాథం సంతోషపడ్డాడు, మరోవైపు జాలిపడ్డాడు కూడ.

సుందరమ్మను ప్రోత్సహించిన సుబ్బారాయుడు తన యుక్తి విఫలంకాగా తనేవచ్చి విశ్వాని కంతో చెప్పాడు. కాని విశ్వం తన శిక్షకు తిరుగులేదనటమేగాకుండా సుబ్బారాయునికి మూడుమాసాల వేతనమిచ్చిమరి పనిలోకిరానవసరం లేదనికూడా చెప్పాడు.

ఆ రాత్రంతా విశ్వనాథానికి కంటిమీద కునుకు పట్టితే ఒట్టు. కళ్ళు తెరుచుకొని విస్ఫారిత నయనాలతో ఆకాశానికేసి చూస్తూనే పడుకున్నాడు. భవిష్యత్తు యెంతో కమనీయంగా తెరలు తెరలుగా అతని కళ్ళముందు కన్పించింది.

ఒకే ఒక్కరోజులో విశ్వనాథం, చనిపోయిన శ్రీనివాసరాకవుంటె పూర్తిగా చేసిపోయినట్టు భావించారేమో, పెద్దలు చాలమంది పనిగట్టుకొని వచ్చి నీతిబోధలు చేశారు! ఆ దేపట్టణంలో మరో మిల్లును నడిపించే వర్మగారు కూడ యేనాడు శ్రీనివాసరావు గడప త్రొక్కని వాడు వచ్చి రెండు గంటల సేపు విశ్వనాథానికి హితబోధ చేశాడు.

వారందరి మాటలు చిరునవ్వులతో విన్న విశ్వనాథం నెమ్మదిగానే తన కార్యక్రమంలో మార్పు వుండదని తెలిపాడు. 'కనరాని కష్టాలపాలవుతావు సుమా' అని హెచ్చరించినవారికి వ్యంగ్యంగా తన కృతజ్ఞతను తెలియజేశాడు.

మరునాడు తన పైతృకమైన శ్రీ ధనలక్ష్మి మిల్లును కార్మిక సభాసికి సర్వాధికారాలతో యిచ్చాడు విశ్వనాథ. కూలీలంతా వద్దన్నా రిజిష్టరీకూడా చేయించాడు! కూలీలు యజమానులయ్యారు. కలలోకూడ ఊహించని విషయం జరిగిపోయింది! వ్రేళ్ళమీద లెక్కించతగ్గ సంశయాత్ములు తప్ప మిల్లుకు సంబంధించినవారందరి ముఖాలు ఆనందోద్వేగంతో వింతగా కనుపించాయి.

కార్మికులందరు తిరిగి సమావేశమయ్యారు. విశ్వంతో కలిసి తమ ప్రతినిధులుగా యెన్నుకున్నారు. మిల్లు యాజమాన్యం ఆరయిదుగురితోను సమిష్టిగా జరుగుతుంది.

కమిటి సభ్యుల్లో ఒకరైన మెకానిక్ యాకూబ్ అత్యవసరంగా జరపవలసిన మిల్లు మరామత్తుల్నిగురించి తెల్పాడు. కనీసం రెండువేల రూపాయలైతేనేగాని అవి జరగవు. కాని డబ్బు? అయిదు నిమిషాలు అందరూ మౌనంగా కూర్చున్నారు అందరూ దీర్ఘంగా ఆలోచనలు కొనసాగించారు. విశ్వం మెల్లగా అన్నాడు, 'నావద్ద అయిదువందల రూపాయలున్నాయి. నేను విరాళంగా యిస్తాను.'

కమిటీలో మరో సభ్యుడయిన రంగనాయకులు కాగి

తాలు తీసుకొని విశ్వంపేరు, మొత్తం వ్రాసి తనుకూడ యాభై రూపాయ లిస్తానని ప్రకటించాడు.

"రంజాన్‌కు బట్టలకోసం చేర్చి పెట్టింది నావద్ద యాభై రూపాయ లుంది. బట్ట లెప్పుడైనా చూసుకోవచ్చు. ఆ యాభై నే నిస్తాను, వ్రాసుకో రంగన్నా" యాకూబ్ సాహెబ్ అన్నాడు.

"నాది యిరవై రూపాయలు"

"నాది పది రూపాయలు"

"అయిదు రూపాయలు"

"మూడు"

"ఒకటి"

"ఎనిమిదణాలు"

"నాల్గణాలు"

"నేను రెండణాలు యిస్తాను" కంఠాలన్నీ ఒకదాని వెంట ఒకటి పలికాయి.

"ఆగండి! ఒక్కొక్కరే చెప్పండి! నారాయణా నీ వెంత?..." రంగనాయకులు లిష్టు వ్రాశాడు.

ఆశ్చర్యం! విరాళాలన్నీ కూడితే రెండువేల రూపాలకు మించిపోయితది.

"మన మిల్లు కుదాటబడినంతవరకు రోజూ మరో గంట మనమంతా పనిచేస్తే బావుంటుంది" ఫిట్టర్ యూసాఫు చిరుకు చిరుకుగా అన్నాడు.

"ఓ" అంతా ఏకగ్రీవంగా అంగీకారాన్ని తెల్పారు. ఈసాకు తృప్తిగా నవ్వుకున్నాడు.

"అరేయ్! ఎవరినో కాదు, మనమింక చేసేది మన పనే! వళ్ళు వంచి మరీ చేయాలి" ఒక వృద్ధుడు హెచ్చరించాడు.

అంతా ఆనందం, సంతోషం మిల్లు ఆవరణంతా విస్తరించుకొని పోయింది. కోలాహలం - కేకలు మిన్నుముట్టాయి.

ఇదంతా ప్రేక్షక మాత్రుడుగా కూర్చుని గమనిస్తున్న విశ్వనాథం కళ్ళవెంట ఆనంద బాష్పాలు రాలాయి.

రోజులు గడుస్తున్నవి.

మిల్లు మరమ్మత్తయింది.

పని చురుకుగా జరిగిపోతోంది.

విశ్వనాథం మిల్లు కరస్పాండెన్సు చూడటం, లెక్కలు వ్రాయటం చేస్తున్నాడు. కమిటీ నెలకు రెండువందలిచ్చేందు కంగీకరిస్తే, రెండు ప్రాణాల కెం దెందుకని వంద రూపాయలు జీతం మాత్రమే తీసుకుంటున్నాడు.

కష్టజీవుల మిల్లులోనుంచి వెలువడే బట్టలు కొనవద్దని పోటీమిల్లు యజమాని వర్గం, మరికొందరు ఖాతాదార్లకు

వ్రతాలమీద ఉత్తరాలు వ్రాయటమే గాకుండా పనిగట్టు
పట్టణాలన్నీ తిరిగి మరీ ప్రచారం చేసివచ్చారు
కొందరు ఖాతాదార్లు తమ ఖాతాల్ని వసూలుకున్నారు
కూడా. ఉత్పత్తి అవుతున్న తమ బట్ట ఏనాటికానాడు ఖర్చు
గాకుండా నిల్వలోకి రావటం చూచి కొందరు కార్మికులు
మొదట నిరుత్సాహ పడ్డారు. కమిటీ సమావేశం జరిగింది.
మిగిలిన మిల్లులకంటే గజానికి ఒక అణా వంతున ధర తగ్గిం
చాలని, మిల్లు తరఫున నలుగురు ఏజంట్లను పట్టణాలకు పంపా
లని నిర్ణయం జరగటమే గాకుండా అమలు జరిపారు. వ్యాపా
రస్థులకు కావలసింది లాభాలు! కాబట్టి అనతికాలంలోనే
ఖాతాలన్నీ తిరిగి యేర్పడినవి.

రోజురోజుకి ఉత్పత్తిలో అభివృద్ధి ఎక్కువవుతుంది.
ఉత్పత్తితోపాటే నాణ్యం కూడా బాగా పెరిగింది.

'కష్టజీవుల మిల్లు' బట్టకు మార్కెట్టులో గిరాకీ
హెచ్చిపోయింది. ఎవరి నోటంట చూచిన ఆ మిల్లును గురించి,
మన్నికైన వారి తయారీ బట్టను గురించి పొగడ్తలు వినిపి
స్తున్నాయి.

నాలు గేళ్ళు గిర్రున తిరిగింది.

కష్టజీవుల మిల్లులో నరికొత్త యంత్రాలొచ్చాయి.
రెట్టింపు కార్మికులకు పని లభించింది.

మిల్లులోని లాభాలు యేటా కార్మికులందరికి పంచి
పెట్టబడుతున్నాయి. కార్మికులకు స్వంత యిళ్లు యేర్పడినవి.
కష్టజీవుల మాధ్యమిక పాఠశాల ప్రత్యేకంగా వెలసి ప్రభు

త్వంతో సహాయంకూడ పొందింది. కార్మికులకు వేతనాలు హెచ్చింప బడినవి. పనిగంటలు తక్కువైనవి. పెద్ద పార్కు- లైబ్రరీ - అదో పెద్ద సరిక్రొత్త రీతిగా నిర్మింపబడ్డ కాలనీగా పరివర్తన చెందింది. విశ్వం తన కృషి జయప్రదమైనందుకు పులకించిపోయాడు. తన వూహాలకు మించిన అభివృద్ధిని గాంచి విస్తుపోతూ 'మూడు పూవులు - ఆరు కాయలు' అనే తెలుగు నానుడి అర్థమిదేనేమో అనుకునేవాడు.

# లంచగొండి

ఉన్న రెండెకరాల వరిపొలమూ నా బి. ఎ. పట్టాకు అర్పితమైంది. తాతలనాటినుంచి అనుశ్రుతంగా వస్తున్న బంగారంలాంటి పొలం విలువ మందపాటి అరటావు కాగితం! అంతే! లేదు, కాదు అంటే పేరుకు తర్వాత రెండక్షరాల తోదా ఒకటి లభ్యమైంది. ఆ రెండక్షరాలు అజాగళస్తనంలా అందమైందీ కావచ్చునేమో! కానీ నా విషయంలో ప్రయోజన కరమైందేమీ కాదు. ఉద్యోగపు వేటలో అసంఖ్యాకులయిన తోటి నిరుద్యోగుల సరసన భీకర సంగ్రామంలో సామూహికంగా పోరాడే సైనికుల్లో ఒక్కడిగా పోరాడాను! కానీ, ప్రయోజనం కనుపించింది గాదు. నాన్న ప్రాథమికోపాధ్యాయుడు. మరి రెండేళ్ళలో రిటైరవుతాడు.

పెళ్ళి కెదిగిన చెల్లి, అమ్మా, నాన్నలు నా ఉద్యోగంకోసం అహర్నిశలు లెక్కలేనంతమంది దేముళ్ళకు మొక్కుకోవడం పరిపాటయింది!

పట్టా తీసుకున్న తరువాత, ఒక్కొక్క క్యాలెండరు ముగిసే సరికల్లా, 'అర్హతకు తగ్గ ఉద్యోగం' అనే మెట్టు పైనుంచి క్రిందికి దిగజారాను. ఉద్యోగం, అది ఎలాంటి దయినా అత్యవసరం - రెండేళ్ళనాడు కాలేజీలో చదువుతూ ఆషామాషీగా సర్వీసుకమిషన్ పరీక్షకు కూర్చొని వున్న నాకు ఆ సంగతే గుర్తులేదు. అవును! ఎలా ఉంటుంది. రెండేళ్ళు గడిచినా ఫలితం తెలియనప్పుడు. అది స్మృతి పథంలోనుంచి మరుగున పడడం అత్యంత సహజమేకదూ! కానీ...ఆశించినట్టు అనుకోకుండా ఒక సుప్రభాతాన దాని ధర్మమా అని రెవిన్యూ డిపార్టుమెంటులో నేనొక లోయర్ డివిజన్ గుమాస్తానై కూర్చున్నాను. ఎడారిలో పయనిస్తూ నాలుక పిడచగట్టుకపోయిన పాంథునికి ఒయాసిస్సు కనుపించి నట్టుంది! అదే ఉద్యోగమే గత ఏడాది లభించివుంటే కాల దన్నే వాణ్ణి!

ఉద్యోగంలో ప్రవేశించాను. తాలూకాఫీసు ఒక అరణ్యంలా వుంది. జీవకళ ఏకోశాన కనుపించకుండా ఆఫీసు ఫయిళ్ళమధ్య నిస్సత్తువగా కూర్చున్న గుమాస్తాలు వింత మృగాల్లా అవుపించారు. మరికొద్ది రోజులకు యీ మరలో పడి నేనూ యిలానే తయారవుతానా అనే భావన హృదిలోకి వచ్చి ఒక్క క్షణంపాటు మేను కంపించినా, పాతరచేసిన వాడిలా కుంచించుకపోయేట్టు చేసే నిరుద్యోగ బాధా,

అమ్మా నాన్నల విచారవదనాలు, పెళ్ళి కెదిగిన చెల్లాయి దీనదృక్కులూ గుర్తులో కొచ్చి ఆ భావనను త్రోసి రాజన్నాయి.

అలవాట్లకు మారుపేరు జీవితం! విశాలమైన పచ్చిక బయళ్ళలో విచ్చలవిడిగా విహరించే యెద్దును తెచ్చి గానుగకు కడితే అది మొదటి రెండురోజులు వుక్కిరి బిక్కిరవుతుంది. కానీ మూడోనాటినుంచి ఆ జీవితానికి అలవడిపోతుంది. నేనూ అంతే! చీవాట్లు లేకుండా పనిని సక్రమంగా నిర్వర్తించటం, తక్కాపీ ఋణాలకో, బావుల పబ్సిడీలకో వచ్చి పనిని ముగించుకొనిపోయే పెద్దరైతులు చేయి విదిలిస్తే ఆ నాలుగయిదు రూపాయల మొత్తాన్ని మహదానందంతో స్వీకరించటం అలవర్చుకున్నాను. వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడన్నట్టు, గొర్రెతోకలాంటి జీతానికే మడిగట్టుకుంటే మన పని అయినట్టే అనే తోటి సోదరుల మాటలకు వత్తాసు యిస్తుండేవాణ్ణి కూడాను. తాసిల్దారుగారి మొదలు ప్యూనులవరకు వారి వారి విలువల్ని బట్టి మామూళ్ళు ముడుతూండేవి. సూర్యోదయం, సూర్యాస్తమయాలెంత సహజమో - ఇది అంతే అని మేమందరం భావిస్తూ వుండేవాళ్ళం! కానీ...అంత ఆఫీసులోనూ ఒక్కరు, అవును ఒక్కరంటే ఒక్కరే అందుకు భిన్నంగా వుండేవారు. వారంతట వారెవరయినా యివ్వబోయినా చిరునవ్వుతో నిరాకరించేవాడు సూర్యనారాయణ. కనీసం కాఫీయైనా వుచితంగా పుచ్చుకునేవారు గాదు. సూర్యనారాయణ నా యెదురుగుండానే కూర్చునేవాడు. పెద్దవయస్సైన వాడేం

గాదు, నా కంటే రెండు మూడేళ్ళు పెద్దవాడై వుండొచ్చు. ఎలా చూచినా ముప్ఫయ్ యేళ్ళకు మించింది అతని వయస్సు. సన్నగా పొడుగ్గా-చామనఛాయే నైనా కొన దేరిన నాశికాగ్రముతో, చురుకైన కళ్ళతో ఆకర్షణీయంగా అవుపించేవాడు. చాల మితభాషి! అనవసరంగా పల్లెత్తి మాటాడడు. పనిన త్రిడి మునిచిపోయి కృత్రిమానందాన్ని కౌగలించుకొనేందుకు మేమప్పుడప్పుడు ఛలోక్తులు విసురు కుంటుంటే అతడు మౌనంగా చిరునవ్వులు చిందించేవాడు. సూర్యనారాయణ లేనప్పుడు స్టాఫ్‌లోని మిగతా వారమంతా అతన్నిగురించి ఎగతాళిగా మాట్లాడుకుంటూ బ్రతకనేర్వని వాడని జాలితలచేవాళ్ళం కూడానూ.

ఒకటి, రెండు మాసాలు గడచిపోయినవి. ఇరుకు గదిలో ఆగకుండా పచార్లు చేస్తున్నట్లు జీవితం ఉత్సాహ రహితంగా కొనసాగిపోతూంది.

అదొక శలవురోజు. ఆఫీసులో తరగని పనివున్నా మనసేమో బాగోలేక అటువైపుకు కూడ పోలేదు. సాయం కాలం ఒంటరిగా నది గట్టుకేసి వ్యాహ్యాళి కెళ్ళాను. వర్షా కాలం కాబట్టి నదినిండా నీరు వురకలు వేస్తూ ప్రవ హిస్తోంది. సాయంత్ర వేళయొక్క అస్తంగత అరుణకిరణాలు ప్రవాహ జలాల మీదపడి వింతగా మెరిసిపోతున్నవి. నీటిరొద, పక్షుల కూజితాలు, మందంగా వినిపించే పట్టణ కలకలము అన్నీకలసి వింతగా వినిపిస్తోంటే ఇసుక గట్టున కూర్చుని ప్రకృతిలో లీనమైపోయాను. ఇహలోకానికి సంబం

ధించిన అన్ని బాధలనుంచి మైమరపింపజేసి, ప్రకృతిమాత నన్ను తన ఒడిలోకి లాక్కొని చిచ్చికొట్టినట్లు, స్ఫురించింది.

"గుడ్ ఈవెనింగ్!"

హఠాత్తుగా తలెత్తి చూశాను. నా యెదురుగా సూర్యనారాయణ నిలుచుని వున్నాడు. అతని ముఖంలో చిరునవ్వు వింతగా మెరసిపోతూంది. పరామర్శల అనంతరం యిద్దరం చాలసేపు మౌనంగా కూర్చున్నాం. ఛాయానాథుడు తన ప్రేయసీ ఒడిలోకి చేరుకున్నాడు. చీకటి తెర కప్పుతోంది.

"మీరు గుమాస్తాగిరిలోనే వుండదలుచుకున్నారా!"

ఉన్నట్టుండి హఠాత్తుగా ప్రశ్నించిన సూర్యనారాయణ ప్రశ్న నన్ను కొద్దిగా ఆశ్చర్యపరచింది. తలెత్తి అతనివైపు పరిశీలనగా చూచి యేదో అనబోయేలోగా అతనే అన్నాడు—

"చూడండి! మేము స్కూల్ ఫయినల్ గాళ్ళం! అందులోను పెళ్ళి, పెటాకులు అన్నీ ముగిసినాయి. మాకు ఖర్మలో గత్యంతరం లేదు. డిగ్రీ వుండీ మీరు యీ నికృష్టమైన ఉద్యోగాన్ని అంటి పెట్టుకోవటంలో అర్థంలేదు."

సూర్యనారాయణ మాటలు నాకు వింతగా వినిపించినవి. నిరుద్యోగ పిశాచి విద్యావంతులయిన యువకుల్ని పీడిస్తున్న యీ రోజుల్లో గగనకుసుమంలా చేతికి దొరికిన వుద్యోగం వదులుకోమంటున్నాడా ఈ ప్రబుద్ధుడని మనసుకుతోచి 'అయితే! రాజీనామా యిమ్మంటారా!' నెమ్మది

గానే ప్రశ్నించినా నామాటలు నాకే కటువుగా విన్పించినవి.

సూర్యనారాయణ చిన్నగా నవ్వాడు. అతని నవ్వు నా భావాల్ని గ్రహించినట్లుగా ధ్వనించింది. 'ఉద్యోగాన్ని వెనువెంటనే వదిలేయమని కాదు నేను మిమ్మల్ని కోరేది. డిగ్రీ చేతిలోవుంది. ప్రైవేటుగా ఎల్. ఎల్. బి. చదవండి. లా పట్టా చేతబట్టి ప్రాక్టీసు పెడితే నెలకు ఏ నాల్గు కేసులొచ్చినా ఈ జీవితానికి రెండుమూడు రెట్లు గిట్టుతుంది. కావాలంటే మొన్ననే పాసయిన మిత్రుడొకరున్నారు. బుక్స్ కూడ మీరు కొనవలసిన అవసరంలేదు. నేను తెప్పించి యివ్వగలను' తాపీగా చెప్పాడు సూర్యనారాయణ. తొందరపడి వేరుగా అర్థంచేసుకున్నందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను. అందుకోసమే పాప పక్షాళనం కోసం అతన్ని క్షమించమనికూడ కోరాను. సూర్యనారాయణ మరోసారి చిరునవ్వు చిందించింది. 'చీకటి పడింది! పోదాం పదండి!' అన్నాడు.

ఇద్దరమూ నడుస్తున్నాము. దారిలో సూర్యనారాయణే తిరిగి అన్నాడు. 'మరొక చిన్న విషయం! మీ వ్యక్తిగత విషయాల్లో జోక్యం కల్గించుకుంటున్నానని భావించకండి. మీలాంటివారికి ప్రయత్నిస్తే ఉజ్జ్వల భవిష్యత్తు చేతికందే దూరంలో వుంది. అలాంటప్పుడు మామూలుగా అందరిలాగా చిన్నచిన్న మామూళ్ళకు ఆశపడకండి. దాన్ని మనం యే పేరుపెట్టి పిలిచినా అది పచ్చి లంచగొండితనమే! మద్యపానంలా అలవడితే మరి

మానుట కష్టం. రైతులు మనకిచ్చే ఆ కొద్ది ముత్యాలవెనుక యెన్ని విషాదాశ్రువు లుంటవో ఆలోచించండి!' చాలా సున్నితంగా చెప్పాడు సూర్యనారాయణ.

అది బహిరంగ సమావేశమేమైనా సూర్యనారాయణ అలా చెబుతుంటే యెవరికీ తెలియని నా దొంగతనం బయట పడ్డట్టుగాను, నేనే దొంగయినట్టు ఫీలయ్యాను. ఊకొట్టడానికంటే మరేం చేయలేకపోయాను. రెండురోడ్ల కూడలిలో సూర్యంతో సెలవు పుచ్చుకొని బరువుగా యింటికేసి వెళ్ళాను.

ఆ రాత్రంతా నా కెందుకో నిద్రపట్టిందికాదు. జీవితంలో ఏ ఒక్క చిన్న సంఘటనో, లేక ఏ ఒక్క వ్యక్తో ఇట్టే మన జీవితగతిని మార్చటం తరచు జరుగుతూ వుంటుంది. కూపస్థ మండూకానికి ప్రపంచమంటే నలుచదరమైన ఆ నాలుగు చదరపు గజాలమేరే కాదని, మరెంతో వుందనీ జీవిత సత్యాన్ని చెప్పినట్లు నాలుగు పొడిమాటలతో బోధించాడు సూర్యనారాయణ. నా కళ్ళు తెరిపించాడు. కృతజ్ఞతతో నా నయనాలు సజలములయ్యాయి. రేపటినుంచి లంచానికి చేయి చాచక, శ్రద్ధగా చదివి వీలయినంత త్వరలో ఈ బానిసత్వంలోంచి పైదొలగి పోవాలని కృతనిశ్చయుడనయ్యాను.

ఆనాటినుంచే నా జీవితగతే మారిపోయింది. పొరపాట్లు చేయటం, తప్పటడుగులు వేయటం మానవత్వంలో

సహజమైన విషయం. కానీ.. పొరపాటుని గుర్తించి తర్వాత తప్పటడుగని దృఢంగా విశ్వసించిన పిమ్మట తిరిగి వాటినే పునరావృత్తం చేయటం ఘోరమైన విషయం! అది మానవత్వానికే మాయని మచ్చ, ఒక్కసారిగా మారిపోయిన నా ప్రవర్తనను చూచి నా సహచరులు విస్తుపోయారు. పాపమన్నట్లు జాలిగా కూడ చూశారు. పరిస్థితులు, తాత్కాలికపు ఆర్థిక బాధలు ఒక్కొక్కప్పుడు తన్ను పెడదారులకు త్రిప్పినమ్మిన విశ్వాసాల్ని వమ్ముచేయాలని చూచినా చివరకు నేనే జయించాను. సూర్యనారాయణ అన్నట్టే మూడు రోజులకల్లా 'లా' పుస్తకాలు తెచ్చి నాముందుంచాడు. అతనికి కృతజ్ఞత చెప్పేందుకు నా నోరు పెకిలి రాకున్నా కళ్ళుమాత్రం తమ విద్యుక్త ధర్మాన్ని చక్కగా నిర్వర్తించినవి.

అప్పుడప్పుడూ యిద్దరమూ నది గట్టు కేసి, పంట పొలాల కేసి వ్యాహ్యాళికి వెళ్ళేవాళ్ళ! నేను శ్రోతను మాత్రమే. మాట్లాడేదంతా సూర్యనారాయణ! అతని కెంత విజ్ఞాన ముంది? చిన్న వయస్సులోనే యెంత లోకానుభవాన్ని సంపాదించుకున్నాడు! నేను విస్మయ చకితుడ్నయేవాణ్ణి. సూర్యనారాయణ, పౌరాణిక గాథల్లోని శాపగ్రస్తుడయిన దేవతామూర్తిగా, వూహాలో మెదిలేవాడు.

రెండేళ్ళిట్టే గడచిపోయింది. రెండు సంవత్సరాల లోను యెన్నో సంఘటనలు జరిగిపోయినవి. నేను 'లా' డిగ్రీ తీసుకున్నాను. 'లా' పట్టాతో పాటు పలుకుబడిగల

ధనవంతుడయిన మామయ్యకూడ లభించాడు. ఉన్న ఊరు ఉద్యోగమూ విడిచేసి పట్టణానికి తరలివెళ్ళి ప్రాక్టీసు పెట్టాను. ఊరు వదిలేనాడు సూర్యనారాయణతో పీడ్కోలు పుచ్చుకుంటున్న నాకు కన్నీరు గిర్రున తిరిగింది. గొంతునిండుగ కన్నీళ్ళుండీ నోరు తెరిస్తే బోరుమని యేడ్వగల నాయని అనిపించింది. నా వున్నతికింతగా ఆధారభూతుడయిన ఆ మానవుడు నాలుగేళ్ళ వర్వీసు కలిసి కనీసం ఒక ఇంక్రిమెంటయినా సంపాదించలేదు. ముక్కుకు సూటిగా నడచే వాళ్ళను గవర్నమెంటు ఉద్యోగాల్లోని యింక్రిమెంట్లకు చుక్కెదురుగా బోలు. సూర్యనారాయణ అన్నలా ఆప్యాయంగా నన్ను కౌగలించుకొని ఆనందభాష్పాలు రాల్చాడు. జీవితంలో సోదరుడులేని లోటు నాకు తీరిపోయిందనిపించింది.

అయిదు సంవత్సరాలు గడిచిపోయినవి. మొదట ఒకటి రెండేళ్ళలోను నాకూ సత్యనారాణకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినా తర్వాత హఠాత్తుగా ఆగి పోయినవి. దానికి కారణమంటూ ఒకటిలేదు. కానీ. కాలం తన కడుపులో కొన్ని అమూల్యమైన విషయాల్ని కూడా దాచుకొనగలదనేందుకిది నిదర్శనము మాత్రమే.

మామగారి పలుకుబడో, లేక నా వ్యక్తిత్వమో-యేదో యిదమిత్థంగా నేను చెప్పలేను. నేనిప్పుడు మునసబ్ మేజిస్ట్రేటును. న్యాయాధికారిగా నా విధుల్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నానంటే అందుకు కారణం ఒక రకంగా

సూర్యనారాయణే! ఆనాటి సాయంకాలం, ఒడ్డులు ఒరసి పారే నది గట్టున, నిద్రపోతున్న నాలోని చైతన్యాన్ని తట్టి లేపాడు సూర్యనారాయణ అశరీర వాక్కులా అతని పలుకులెప్పుడూ నా హృదిలో మారుమోగుతుండేవి. నా ఉద్యోగధర్మ నిర్వహణలో, సక్రమంగా నవ్వుతూ ఎదురొచ్చి నన్ను బుట్టలో వేయాలనే బంధుత్వము, కులమనే మమకారాలు, లంచాలు వీటన్నిటిని జయించ గలిగానంటే అందుకు కారణం సూర్యనారాయణే! రోజు కొకసారయినా అతడు నా హృదిలో మెదలుతూండేవాడు. అతని దరహాస వదనము నాకళ్ళెదురుగుండా కనిపించినట్టే వుండేది. మేజస్ట్రేటుగా ఏ నేరాలయినా దయార్ద్రదృష్టితో చూడగలిగే వాణ్ని కానీ లంచగొండితనానికి సంబంధించిన నేరాలను సహించగలిగేవాడిని కాను. న్యాయాధికారిగా చట్టం అంగీకరించే అతి కఠినశిక్షను నిర్దాక్షిణ్యంగా విధించేవాణ్ని. అందుచే నా జూరీస్ డిక్షన్‌లో నేను చండశాసనుడ్నని పేరు గాంచాను ప్రజల మెప్పులు నే నాశించను. నా మనసే నాకు అంతస్సాక్షి. యెవరికైనా నే నెందుకు భయపడాలి?

ఆ దినం కోర్టు కిటకిటలాడుతోంది. క్రిమినల్ కేసులు సివిల్ వ్యాజ్యాలు హియరింగ్ బుక్కునిండుగా వున్నాయి. గతరాత్రే తనింటివద్ద ముఖ్యమైన ఫైళ్ళను చూచివున్నాడు. అందులో ముఖ్యంగా తన్నాకర్షించింది, ఒక లంచగొండితనపు నేరము, రెవెన్యూ డిపార్టుమెంటులోని గుమస్తా

వెనుక యాభై రూపాయలిస్తేగాని, తక్కావీ ఋణంకోసం తట్టిన దరఖాస్తును పై అధికారికి పంపనని మొండికేసి కూచున్నాడు. దరఖాస్తుదారు ఒక మధ్యతరగతి రైతు, విద్యావంతుడు. పోలీసులకీ విషయం తెల్పాడు. సర్కిల్ ఇన్స్పెక్టర్ కరెన్సీనోట్లమీద గుర్తులుపెట్టి ఆ రైతుతో పంపాడు. వల సరిగా పారింది-- పిట్ట దొరికింది! నేరస్థుణ్ని కష్టడీలోకి తీసుకున్నారు. అపరాది నేరాన్ని అంగీకరించాడు కూడా కేసుఫైలు చూచి నేను మండిపడ్డాను, 'వెధవలు' గట్టిగా విసుక్కున్నాను.

ఇదో అంటు జాడ్యంలా తయారయింది. దేశాన్ని పురోగమనంవైపు నడిపించ వలసిన విద్యావంతులే యిలా తయారవుతే దేశానికి పట్టేగతేమిటంటూ తీవ్రంగా బాధపడ్డాను. సంఘ వినాశకుల జోలికి చెందిన యితగాణ్ణి గట్టిగా శిక్షించాలని నిశ్చయించుకున్నాను, బెంచిక్లర్కు కేసు నెంబరు చదివాడు. ఇద్దరు పోలీసులమధ్య అపరాధి కోర్టులోకి వచ్చాడు. అతనివైపుకు చూచేందుకు మనస్కరించ లేదు నాకు. ముద్దాయి వాఙ్మూలము తీసుకునేందుకు ప్రారంభించాను. తలెత్తి అపరాధివంక చూడకుండానే.

"నీ పేరు!" ప్రశ్నించాను.

"సూర్యనారాయణ!" నెమ్మదిగా, గంభీరంగా జవాబు విన్పించింది సరిగ్గానెత్తిమీదపిడుగుపడ్డట్టువిహ్వలుడ్నయాను. అవును. ఆ పేరు గలవారెందరైన వుండవచ్చు! కానీ కంఠస్వరం అదే! గాఢసుషుప్తిలో నున్నప్పుడు

తట్టిలేపినా నేనాకంఠస్వరాన్ని గుర్తించగలను. తల దించు కున్న నేను ధైర్యంగా తలెత్తలేకపోయాను. శిరసెత్తి ఎదురు గుండా చూస్తే... ఆ దృశ్యం ఊహలోనే భయంకరంగా వున్నట్టుంది.

కోర్టంతా నిశ్శబ్దంగా వుంది.

గడియారం చేసే టకటక ధ్వనులు మాత్రం లయ పూర్వకంగా వినిపిస్తున్నాయి.

నా మౌనాన్ని గమనించిన బెంచి గుమస్తా ఆశ్చ ర్యంగా నా వైపు చూస్తూ నిలుచున్నాడు.

నా తల నా కెదురు తిరుగుతోంది. అతి ప్రయ త్నంతో మనసులోనే ఏదో గొణుక్కుంటూ శిరస్సెత్తి ముద్దాయివైపు చూచాను, ఇది కల కాదుకదా! సందేహ పడ్డాను. కళ్ళు నులుముకొని మరీ చూచాను. కాదు. కల కాదు. పచ్చి యథార్థము, నా కళ్ళెదురుగుండా నిలుచు న్నది సూర్యనారాయణే! అతనిలో వయసు పెరిగిన చిహ్నాలుతప్ప మరేమీ మార్పు కనిపించలేదు. ముఖాన అదే చిరుదరహాసము. పిలిస్తే పలికేలా వుంది. భయంకర మైన వన్యమృగాలమధ్య లోకజ్ఞానంలేని అమాయక బాల కునిలా నిలుచున్నాడు. నా తల తిరిగిపోయినట్టుంది. బాధ నా నరాల్ని తోడేస్తున్నట్లుంది. భోరుమని యేడుస్తేను, 'సూర్యం' అంటూ అతన్ని బిగియార కౌగలించుకొంటేను, నా ఉపశమనం కలుగవచ్చు. కానీ...కానీ... నే నందుకు అనర్హుడ్ని! న్యాయపీఠం మీద కూర్చుని పాత మిత్ర త్వాన్ని మనవంలోకి తెచ్చుకోవటం క్షంతవ్యంకాని నేరం!

నేను న్యాయాధికారిని! నా దృష్టిలో అందరూ సమానులే నేరాన్ని కొలిచేందుకు నా దగ్గర న్యాయశాస్త్ర గ్రంథాలున్నవి. కాని హృదయంమాత్రం కాదు. అతికష్టంమీద నా ముఖ కవళికల్ని మార్చుకున్నాను. శిలావిగ్రహంలా ఏ భావాలు కన్పించకుండా నిర్లిప్తంగా కూర్చుని ఆనవాయితీగా అడిగే ప్రశ్నల్ని అడుగుతూ జవాబులు కాగితం మీద వ్రాస్తున్నాను. నేను సూర్యనారాయణకూడ నా వైపే నిశ్చలంగా చూస్తున్నట్టున్నా, నన్నెనాడు ఎరుగని వాడిలా ప్రవర్తిస్తూ యాంత్రికంగా జవాబులిస్తున్నాడు

నేను నేరాన్ని చదివి 'ఏమిటీ నేరం చేశావా! అని ప్రశ్నించాను. జవాబెలా వస్తుందో నాలో తహ తహ యెక్కువయింది. సూర్యనారాయణ కంఠం ఖంగుమంది. 'అవును! నేరం చేశాను. పోలీసులకు దొరికింది యీ ఒక్కసారే! కానీ... నేను రెండేళ్ళనుండి వీలయినప్పుడల్లా లంచాలు తీస్తూనే యున్నాను. ఇది నేరం! అవును! ఇది నేరమని నాకు తెలుసు! కానీ... కానీ...' సూర్యనారాయణ కంఠం రుద్ధమైంది. గొంతునిండుగా కన్నీళ్ళున్నట్లున్నవి.

నా పరిస్థితే సరిగ్గా అలాగేవుంది. ఐనా యాంత్రికంగానే 'కానీ... చెప్పండి' అన్నాను.

"కానీ... పరిస్థితుల్ని యెదుర్కోలేకపోయాను. నాలో త్యాగం లోపించింది. అందుకు కారణాలు నేను

యేకరువు పెట్టనవసరం లేదు. నన్ను క్షమించండి!” సూర్య నారాయణ కంఠం అచంచలంగా విన్పించింది.

నేరస్తుడు నేరాన్ని అంగీకరించినపుడు ఇంకా విచారణేముంది.

నా కొక్కసారిగా కళ్ళు తెరుచుకున్నట్లయింది. అలాంటి సూర్యనారాయణ యిలా మారాడంటే కారణ మేమిటి. ఇన్ని రోజులూ ఒబ లంచగొండితనాన్ని నేను ద్వేషిస్తున్నాను. కానీ అందుకు కారణా లేమిటని ఆలోచించిన పాపానపోలేదు. సమస్య నొకవైపే చూచే నేనెంత బుద్ధిహీనుణ్ని! ఊహలు... నే నాలోచిస్తూ కూర్చుని ప్రయోజనం లేదు.

“నేరస్థుడు నేరాన్ని అంగీకరించాడు కాబట్టి మూడు మాసాలు శిక్ష!” తీర్పు చెప్పి రెండుచేతులతోటి ముఖం కప్పుకొని గబగబా ఛేంబరు గదిలోకి వెళ్ళిపోయాను నేను.

మానవుల్లా బ్రతకటానికి కనీసం వూహించేందుకు కూడ వీలుగాని జీత బత్తాలతో జీవించే చిన్న ఉద్యోగస్తులు-పాపం! అనుకున్నాను నేను!

ఛేంబర్ లోనికి వచ్చిన నేను ఒక్కసారిగా కుర్చీలో కూలబడి రెండు...చేతులతోను తల పట్టుకొని మెల్లగా విలపించటం చూచి విస్తుపోయాడు ప్యూన్.

‘సూర్యం ... లంచగొండి!’

‘ప్రపంచం ... లంచగొండి!’

‘లంచగొండ్లు ... అంతా లంచగొండ్లే’

‘లంచగొండ్లుగా తయారుచేసే పాడువ్యవస్థ!’ నా పెదాలు నాకు తెలియకుండానే గొణుక్కున్నవి.

# నవ్విన నాపచేనం

సౌఖ్యం నేను ఒకే యీడువాళ్ళమే గాకుండా యిరుగు పొరుగువారం కూడ. మధురమైన బాల్యస్మృతులను గురించి తలుచుకుంటే మనసు పులకరిస్తుంది. జీవితాన్ని యెడతెగని యెడారి ప్రయాణానికి పోలిస్తే బాల్యాన్ని ఒయాసిస్సుకు పోల్చవచ్చు. కలమెత్తి ఆనాటి జ్ఞాపకాలను గురించి వ్రాయబోతే హృదయాన్నంతా ఆవరించుకున్న మధురిమ వుక్కిరి బిక్కిరి చేస్తోంటే యెలా వ్రాయను! మే చీకూచింతా లేకుండా విశృంఖలంగా విహరించిన జీవితంలోని ఆ ప్రథమ దశ కలలా కనిపిస్తోంది. కలలో గాంచిన సౌందర్యానికి రూపమివ్వటం బహు కష్టమైన పని. ప్రఖ్యాత చిత్రకారుడుకూడ అస్పష్టంగా కనుపించే ఆ దృశ్యాలకు రూపు రేఖలు కల్పించాలంటే యెంతో శ్రమపడక తప్పదు. అయినా శ్రమ అనుకుంటే...కష్టమని

భావించిన విషయాల్ని విసర్జించేది గనుక అలవర్చుకొని వుంటే మానవత యింతగా వికసించేది గాదు. నాగరికత తలయెత్తేది గాదు. కాబట్టి నా మిత్రుడు సూర్యాన్ని కథానాయకుడిగా తీసుకొని వ్రాయాలని నిశ్చయించుకొన. నా కథని ఏమైనా సరే కొనసాగిస్తాను.

ఎద్దుల కొండమీద ఎర్రగా పూచి విరగబడుతున్న ఎర్రగన్నేరు పూలను కోయాలని మైలు దూరం మండు టెండలో పాపాఘ్ని నది యిసుకలో పరుగెత్తి పాదాలన్నీ ఎర్రగన్నేరుల్లానే కందిపోవడాన్ని కూడ లక్ష్యం చేయ కుండా వుండటం, ఇంట్లో వాళ్ళకు తెలుస్తే చీవాట్లువేస్తా రని ఆ రాత్రాంతా ఆ బాధ నరాల్ని తోడేసినట్లు బాధి స్తూంటే మౌనంగానే మనసులో, కుమిలి కుమిలి యేడ్వ టం యెలా మరచిపోను? గోరంటాకు తెచ్చి వీరులవలె ఆడపిల్లలకు పంచాలనే వుబలాటంతో నదిఒడ్డున రాజు కాల్వలో ప్రక్కన వుండే ఆంజనేయస్వామి గుడిలోకి నిలువెత్తు గోడల్ని దూకి తలను బొప్పి కట్టించుకోవటం మర వాలన్నా మరుపుకు రాదు. పూజారివాళ్ళ పెరడులో విరగ కాచిన దానిమ్మ కాయలకోసం అర్ధరాత్రిలో సాహసం చేసి పెరటిగోడ లంఘిస్తూంటే, తాతలనాటి ఆ గోడ కూలి పోవటం, వెంట్రుక వాసిలో ప్రమాదం తప్పి బయటపడటం జీవితంలో ఒక వింత ఘట్టం! వర్షాకాలంలో తెల్లని నురు గుల్ని గ్రక్కుతూ తూలి పరుగెత్తే పాపాఘ్నివలోడి గట్టుపై రాళ్ళ కుప్పలపైనుంచి కుప్పిగంతులు వేయటం యెలా మరిచిపోను?

నే నీనాడు మానవుడిలా సమాజంలో తలయెత్తుకు తిరుగుతున్నానంటే అందుకు కారణం నాలోని సాహసం! సాహసమే లేకపోతే యేనాడో ఆత్మహత్యపాలయిపోయో లేక అనాదగా వూరూ పేరూ లేకుండా బ్రతకటమే చేస్తూండేవాడ్ని!! జీవితంలో ఉత్సాహం; బ్రతుకులో సాహసం నాకు స్వతహాగా అలవడినవి కావని చెప్పు కొనేందుకు నేనేమీ సిగ్గుపడను! చిన్న వయస్సున నేను చాలా పిరికివాణ్ని. నేనేమిటి, మా వంశమే అంతని తలనెరిసిన పెద్దలు చెబుతూవుంటారు. సూర్యం నేస్తం నన్ను పూర్తిగా మార్చేసింది. ఊహ తెలిసిననాటినుంచి పద్దెనిమిదో యేటి వరకు అంటే దాదాపు పంద్రాడేండ్లకుపైగా సూర్యంతో నా నేస్తం నన్ను మానవుణ్నిగా మార్చింది. ఆ రోజుల్లో యెక్కడచూచినా మేమే! యెవరి నోటంట విన్నా మా పేరే!

ఆ రోజుల్లో నాకు సర్వమూ సూర్యమే!

నేను లేచేసరికి ఒకరోజు భళ్ళున తెల్లవారింది. తొలి కోడి కూతతో లేచి మా యింటికి వచ్చి నా చెవులుపిండి నిద్రలేపి పోతురెడ్డి కాల్వకు స్నానానికి తీసుక వెళ్ళే నా నేస్తం రాలేదేమా యని విస్తుపోయాను. సూర్యం సూర్యుడే! తన అనుదిన కార్యక్రమ నిర్వహణలో యేనాడు వేమరుపాటు చూపనివాడు.

ఆశ్చర్యపోతూ నేనే అతని యింటికి వెళ్ళాను

సూర్యం మంచం ఖాళీగా వుంది. 'వాడేడి బాబూ!' సుందరమ్మ పిన్ని గొంతులో నాకు గాద్గదత్వం వినిపించింది.

"ఒక్కడే వెళ్ళాడేమో!" అంటూ నేను ఏటి కేసి నడిచాను.

త్వరగా రండి బాబూ!" పిన్ని గొంతు నా వెనుక వినిపించింది.

మా స్నానాలఘట్టంలో సూర్యం అవుపించలేదు. ఎడారిలా విస్తరించుకొనివున్న పాపఘ్నినది యిసుకతిన్నెల పైన కళ్ళు కాయలు కాచేలా రెండు గంటలపాటు నిలుచుని చుట్టూ పరకాయించి చూచాను. సూర్యం జాడే లేదు. వంటి మీద స్పృహే గనుక వుంటే స్వర్గానికైనా నన్ను విడచి వెళ్ళేవాడు గాదు సూర్యం! ఈ నా విశ్వాసానికి తిరుగులేదు. అందుకే అమిత ఆశ్చర్యం పొంది కాళ్ళీడ్చుకుంటూ యింటికి వెళ్ళాను.

పంచన నిలుచుండి తనయుని రాకకెదురు చూస్తున్న సుందరమ్మ పిన్ని ఒంటరిగా వచ్చే నన్ను చూచి భోరుమంది. ఆమెచుట్టూ జనాలు గుమిగూడారు. పిన్ని నెత్తి, నోరు బాదుకుంటూ 'ఇంకెక్కడి పిల్లాడు! చేతులారా మా తండ్రిని దూరం చేసుకున్నాను. నాకు చావైనా రాకపోయింది...' ఆమె తల గోడకేసి కొట్టుకుంది. పెద్దలందరూ బలవంతాన పిన్నిని దుఃఖావేశంనుంచి మరలించి కారణ మేమిటని అడిగారు.

స్కూల్ ఫైనల్ సెలెక్షన్ పరీక్షల్లో ఒక్క సబ్జక్టులో నయినా సరైన మార్కులు రాలేదని, అహర్నిశలు కష్టపడి చదువుతేగాని పబ్లిక్‌లో పాసవడని, సెలెక్షనైనా పిన్ని ముఖం చూచి చేశానని శేషయ్య మాస్టారు గత రాత్రి పిన్నితో చెప్పాడట. సుందరమ్మ పిన్ని ఉక్రోషాన్ని పట్టలేక బాగా చీవాట్లేసిందట సూర్యాన్ని. మొదట సూర్యం నవ్వి 'నేను పాస్ గాకపోతే హోటల్ స్కూలే'...అని అనబోతే సుందరమ్మ పిన్ని వుగ్రస్వరూపిణాయి నోటికొచ్చినట్లల్లా సూర్యాన్ని తిట్టి తల బాదుకుందట. సూర్యం అలాగే నిశ్చేష్టితుడై తల్లివైపు కొద్దిసేపు నిశ్చలంగా చూచి వెళ్ళి తన మంచంమీద పడుకున్నాడట. అంతే! తెల్లారి మరి సూర్యం అవుపించలేదు.

ఊరిచుట్టూ వుండే మోటతోలే బావులతో సహా నూతులన్నీ గాలించారు కొందరు. కాని నేనుమాత్రం సూర్యం బావిలో పడి...అలా వూహించేందుకే సిగ్గనిపించి మిన్నకున్నాను. ఒకటి రెండు రోజుల్లో సూర్యం తిరిగి వస్తాడని నా దృఢవిశ్వాసం. కాని సుందరమ్మ పిన్ని తన వాళ్ళను చుట్టుప్రక్కల గ్రామాలకి, పట్టణానికి సూర్యాన్ని వెతికేందుకు పంపింది. వెళ్ళిన వారంతా వెనుదిరిగి వచ్చారు. కాని...సూర్యం రాలేదు.

సూర్యం కనుపించని మూడోరోజు సాయంకాలం వూరిబయట ఒంటరిగా కూర్చున్న నేను భోరుమని యేడ్చాను.

కాలం ఒక అనంతప్రవాహం! కొనసాగిపోవటమే దాని ధ్యేయం. సుఖదుఃఖాలు, కలిమిలేములు, ఆనందోద్వేగాలు, యేదీ కాలానికి కళ్ళెం వేయలేవు. సూర్యం అదృశ్యమై యిరవై యేళ్ళు జరిగింది. మానవజీవితాల్లో యిరవై వసంతాలు దీర్ఘకాలమైనా, అనంతకాలవాహినికదో కరటం మాత్రమే కదూ! సుందరమ్మ పిన్ని ఏడేళ్ళపాటే సుందరాన్నే తలుచుకుంటూ శుష్కించి శుష్కించి మరీ మరణించింది. మా వూరిలోనివారంతా సూర్యం మరణించినట్టే లెక్కకట్టేశారు. కాని నా అంతర్వాణి అందుకు సుతరామూ అంగీకరించేది గాదు సూర్యం సరసన లేకుంటే క్షణాలు యుగాలుగా భావించే నేను సూర్యం లేకపోడానికి అలవాటు పడిపోయాను నా చదువులు కొనసాగిపోయాయి. జీవితంలో ఆటుపోట్లు వచ్చాయి. ధీరుడిలా రొమ్మిచ్చి జీవనపోరాటంతో తలపడ్డాను. ముందడుగు వేసేందుకు పూనుకొనే ప్రతి సంఘటనలోను, ప్రతి సమయంలోను సూర్యం దృష్టిపథానికి గోచరించి; నన్ను ప్రోత్సాహితుడ్నిగా చేస్తున్నట్టు భావన నా హృదయంలో మెదిలేది. పిరికి మనిషిని సాహసిగా మార్చిన నా సాహసమిత్రుడు తనెందుకు పారిపోయాడు! ఈ ప్రశ్న నన్నేకసార్లు కలవరపరచింది. కాని ప్రశ్న ప్రశ్నరూపంలోనే నిలిచింది గాని జవాబు లభ్యం కాలేదు.

"ఒరేయ్! న్నినే! లేవరా!"

బాలభానుని కిరణాలు కిటికీలోనుంచే సూటివచ్చగా

సోకుతూ వున్నట్టుంటే ముసుగు తన్ని మూడంకె వేసుకొని మత్తుగా పడుకున్న నేను ఆ పిలుపుకు విభ్రాంతుణ్నయి దిమ్మరపోయి లేచి కూర్చున్నాను. నా యెదురుగా ఆజాను బాహుడైనా నిలువెత్తు వ్యక్తి నిలుచుని వున్నాడు. బాహ్య దృష్టికి నాగరికుడిలా అవుపిస్తూ, యింట్లోకి దూరి మొరటుగా ప్రవర్తిస్తున్న ఆ మనిషి యెవరా యని కాబోలు మా శ్రీమతి తలుపు చాటునుంచి మిర్రి మిర్రి చూస్తోంది. నేను వెంటనే గుర్తించలేకపోయాను. మెదడు మడతలు వెనుకటి జ్ఞాపకాల మననం కోసం కుంచించుకుంటున్నవి. అంతలోనే అతడు నా వీపుమీద చరచి గట్టిగా 'పిన్ని కొడుకునే మరచిపోయావటరా! నేను...' యేదో అవబోయాడు. అవును! అతడు సూర్యం! ఒక్కసారిగా నా స్మృతిపథం విచ్చుకుంది. లేచి ఆప్యాయంగా కౌగిలించుకొంటూ 'రా...కూర్చో' అంతకంటె నా నోటినుంచి మాటలు పెకిలి రాలేదు. 'చెల్లమ్మా! కాఫీ యివ్వు తల్లీ! తర్వాత నింపాదిగా పరిచయాలు చేసుకుందాం!' అన్న సూర్యం మాటలకు మా ఆవిడ ముసిముసినవ్వులు నవ్వుతూ వంట యింటిలోకి వెళ్ళింది.

# వెతర ఆవలి గట్టున...

ఏమిటీ? ఓ కథ చెప్పమంటున్నారా? చెబుతాను. నిశితమైన పరిశీలనా దృష్టి యేమాత్రం కలిగివున్నా కథలకు మరికొరత వుండదు. మనజీవితాల్లో అనుదినం—, అనుదిన మేమిటి? ఖర్మ. అనుదినం యెన్నో సంఘటనలు, సన్నివేశాలు దృష్టి పథానపడుతూ వుంటవి. ఆ సంఘటనల వెనకాల, ఆ సన్నివేశాల కాధారభూతమయి ఎన్ని కమనీయ కథాకథనములు యిమిడీవుంటవో మీరేనాడయినా వూహించారా? మీరేకాదు చాలమంది ఊహించబోవడ మటుంచి ఖాతరుచేసే పాపానైనా పోరు! కాని... కళాహృదయం గల వాడు వూరుకోడు. అతగా డూరుకొని నిర్లక్ష్యం చేసినట్టు భావించాలని అనుకున్నా, వాడి హృదయమూరుకోదు. అది ఏకళయినా కావచ్చు. కళకు హృదయానికిగల సాన్నిహిత్యం ప్రేయసీ ప్రియులకంటె, తమలపాకు తీగ అవిశెమొక్కకంటె

మరి ప్రబంధ యుక్తంగా చెప్పాలంటే తామరలు ప్రభాక రుడు, కలువలు — సుధాకరుడు. ప్రపంచంలో ఏ జంటకూ లేని సాన్నిహిత్యం వుంది! అందుకే కథలకు కొరవేముంది, కొల్లలు.

నా జీవితంలో ఆ ఆరుమాసాల్ని ఏనాటికీ మరువ లేను. ఆ ఆరుమాసాల్లోను నా కత్యంత ప్రియతమమైన గ్రంథ పఠనం పట్టుమని పదినిముషాలయినా సాగకున్నా, యెన్నో పుస్తకాలు చదివితేగాని కలుగలేనంత విజ్ఞానం, మానవ త్వం యెడగల మమకారం నా కబ్బినవి. ఆ ఆరుమాసాల్లో జరిగిన యథార్థసంఘటనలు తోరణంగా గుచ్చి మీా ముం దుంచుతున్నాను. అంతే! ఇది కథనుకుంటారా అనుకోండి. లేదా పోనీండి.

తీరని వాంఛలకీ, జీవితాలకి దగ్గరి చుట్టరికం. సాహితీ రంగానికే యీా జీవితాన్ని అర్పించాలని కలలుగన్నాను. సాహిత్య సముద్రంలోని ఒక నీటిబొట్టుగా నలుగురితో పరిగణింపబడ్డానుకూడ. వెనుకా ముందూ ఏ ఆధా రమూాలేని నాబోటి నిర్ధనుడు జీవిత మనుగడకి సాహిత్యా న్నాధారం చేసుకోవటం యెంత సాహసకార్యమో తర్వాత తర్వాత అర్థమైంది. 'దిగిరాను దిగిరాను దివి నుండి భువికి' అని దృఢనిశ్చయుడనైయున్న నేను అనుదిన జీవిత సమస్యలతోను ఆర్థిక కష్టాలతోను చిత్తుగా ఓడి పోయాను. బావమరదుల దృష్టిలోనే కాదు, మొత్తం ప్రపంచదృష్టిలోనే నేనో అసమర్థుణ్ణి. చేతగాని వాజమ్మను. బ్రతుకు తెరువెరుగని అప్రయోజకుణ్ణి. ఓడిపోయిన నేను

పేదాలు కోరుకున్నాను. నేనూ నలుగురిలో ప్రయోజకణ్ణని అనిపించుకోవాలని ఆరాటపడి ఒక ప్రభుత్వ కార్యాలయానికి గుమస్తా గిరికి అప్లయిచేశాను కాని, ఆశ్చర్యం! వెంటనే నాకు ఉద్యోగం దొరికింది. నాలుగురోజుల్లో వచ్చి జాయినవ్వమని ఆదేశించారు కూడ, ఊరి పేరెందుకుగాని, ఆంధ్రదేశంలోని ఒక మధ్య తరగతి పట్టణమది. జిల్లా కేంద్రం కూడాను. సరే, భార్యను పుట్టింట దిగవిడిచి వంటరిగా బయలుదేరాను. నా నూతన జీవిత ప్రారంభోత్సవానికి! ఆ పట్టణం నాకు చిరపరిచితమైందేగాకున్నా కొత్తదేంకాదు. ఇద్దరు ముగ్గురు మిత్రులున్నారుకూడ! ఉద్యోగంలో చేరాను. నాలుగయిదురోజు లొకమిత్రునింట్లో గడిపి తర్వాత గది చూచుకోవాలని ప్రయత్నించాను! ఆరు మాసాలపాటు శ్రీమతికి ఆటవిడుపు. పురుడు పోసుకునిగాని తిరిగిరాదు. పదిరూపాయల్లో యేదయినా ఒకగది దొరికితే చాలని, ఉద్యోగం చేస్తూనే విరామ సమయాల్లో నా జీవితాశయమయిన సాహిత్యవ్యాసంగంలో కాలం గడపాలని నా ఆశ. పదిరోజులు పట్టణమంతా గాలించినా అనుకూలమైన ఒక్క గదీ దొరకలేదు.

ఆరోజు ఆరుగంటలకల్లా ఆఫీసు పైళ్ళలోనుంచి బయటపడి నేను, మా మిత్రుడు మణీకేఫ్‌లో కాఫీత్రాగి సందుగొందులు తిరుగుతూ ఊరిబయటి పొలాలవైపుకు వెళుతున్నాం వాహ్యాళికి. మునిసిపాలిటీలోని రాజమార్గాలు కుబుసం విడిచిన నాగుల్లా సిమెంట్ రోడ్లతో తళతళ

లావుతోంటే గొందుల్లోని చిన్న వీధులు మిట్టపల్లాలతో ధూళిధూసరితమై మొనదేలిన కంకరరాళ్లు పాదాల్ని ఢీకొంటూ వుంటవి, అలాంటి ఒక సందులో ఒక పెద్ద 'ఇంటిముందు 'ఇక్కడ తక్కువ అద్దెకు మంచి గదులు దొరుకును' - చీనారేకుపై సీమసున్నముతో కలిగిన అక్షరాలు కల్పించాయి. పెద్ద ధననిక్షేపము దొరికిన వాడిలా నేను సంబరపడి ముందుకుపోతున్న మిత్రుణ్ణి కేకబెట్టాను. మిత్రుడు వెనుదిరిగి నన్ను సమీపించాడు. నా దృష్టి చీనారేకుపై పడటంగూడ గమనించాడు. నేనానందంగా యేమో అనబోయేంతలోనే అతడు నిర్లక్ష్యంగా ఒక చిన్ననవ్వు నవ్వి 'రండి పోదాం!' అన్నాడు.

"మీ రంటున్నదేమిటి? విస్తుపోయి ప్రశ్నించాను.

"ఈ గదుల్లో మీరు నివసించగలుగుతారా? మురికికూపాలు. అలగా జనానికి ఆటపట్టులు! పేదరికం, బాధలు- కుట్రలు, కుచ్ఛితాలు, ఆక్రోశనా వేదాలు; అబ్బ! విన్ననాకే వళ్ళు జలదరించింది. మీ రిక్కడ..."

మిత్రుని ప్రసంగ మధ్యంలోనే నేను జోక్యం కల్గించుకొని 'మీ మాటలు చూస్తుంటే నా కుత్సాహం కలుగుతోంది. జీవితంలో అన్నిరకాల అనుభవాల్ని పొందటం అసంభవం! కాబట్టి, స్వంత అనుభూతులేకాక యితరుల అనుభవాల్ని కూడ సన్నిహితంగా వుండి గమనించగలగటం అదృష్టం! మీ మాటలు వింటోంటే మురికికూపా

లనే యీా గదుల్లోనే ఒకదాన్ని వరించాలని నాకు మనసవు
తోంది' అన్నాను.

"జీవితపు సన్నని సందులకే
ఆకర్షణ మాకు
మా దృష్టిది వర్తులమార్గం
ఆద్యంత రహితం.

సాహిత్యప్రియుడైన నా మిత్రుడు చిన్నగా నవ్వి
మహాకవి శ్రీశ్రీ మాట నుటంకిస్తే నేనుకూడా నవ్వనాపుకో
లేకపోయాను! ఇద్దరమూ చిన్నగా నవ్వుతూ ఆ పెద్ద యింటి
సింహద్వారం వైపు అడుగులు వేశాం.

తమిళనాడులోని పుణ్యక్షేత్రాల్లో పెద్దపెద్ద సత్రా
లుంటవి. యాత్రికుల సౌకర్యార్థమై పూర్వపు రాజులు
మొదలు నేటి ధనికులవరకు కట్టించిన సత్రాలివి. ఆ సత్రాల్లో
కొన్ని వందలమంది బాగా నివసించవచ్చు. నేను ప్రవేశించిన
ఇల్లు చూస్తూనే మధురలో రెండురోజులు నివసించిన ఒక
సత్రం నాకు గుర్తుకొచ్చింది. పదిగజాల వెడల్పు, వంద
గజాలు పొడవుగల ఆ యిల్లు మూడు భాగాలుగా విభజింప
బడివుంది. ఆ మూడుభాగాల్లోను మధ్యవర్తులాకారంగా
ఆరుబయలు చుట్టూ గదులు మొత్తం నలభై గదులున్నవి.
ఒక్కగది వైశాల్యం ఎంతనుకున్నారు? ఆరుగజాలుమాత్రమే
మొదటి వాటాలో పదిహేను గదులు. మిగిలిన రెండింటిల్లో

పం(డెండేసి గదులున్నవి. ఒక్కొక్క వాటాకు రెండేసీ స్నానాలగదులు. ఒకటి పురుషులకు, మరొకటి స్త్రీలకూను. మొత్తం నలభై గదులు వారికి కలసి లెట్రిన్‌లు రెండు! నీటి పంపు ఒకటే! ఇదీ క్లుప్తంగా ఆ యింటిని గురించిన బాహ్య వర్ణన. ఆ యింటిని కట్టించిన కామందు పనివాడితనానికి, మేధస్సుకి, నేను మనసులోనే జోహార్లర్పించుకున్నాను.

చిన్నపిల్లాడొకడు గుక్కపట్టి యేడుస్తున్నాడొక గదిలో. మరో గదిలో ఒక ముసలమ్మ ఆపసోపానలు పడు తున్నది. ఇంకో గదిలోంచి 'చూచెదవేలనో (ప్రణయ సుం దరీ' అనుకరించేందుకు వ్యర్థ (ప్రయత్నం చేస్తున్నాడొకడు. ఒక పిల్లాడు ఇంగ్లీషు స్పెల్లింగులు వల్లించడం,- ఒక కుక్క కుయ్యో కుయ్యోమని అరవటం- గొల్లున నవ్వే నలుగు రైదుగురు స్త్రీల కంఠస్వరం- యివన్నీ మాకు స్వాగత వచనాలుగ భావించుకుంటూ ముందుకు నడిచాం.

ఒక గదిముందు చిరుగుల యీతచాప ముందొకడు కూర్చుని వున్నాడు. పాతికేళ్ళకు మించని వాడేనైనా నలభై యేళ్ళ వాడిలా అవుపిస్తున్నాడు. అతడో పెద్దకాగి తం ముందుంచుకొని ఏకా(గంగా ఏవేవో అంకెలు వేస్తు న్నాడు పెరిగిన గెడ్డం అప్పుడప్పుడు రాసుకోవటం తప్ప అతని దృష్టంతా ఆ అంకెలమీదే వుంది. అబ్బ! ఎన్ని అంకెలు! ఎన్ని సంఖ్యలు! అవును! నేను విన్నాను. సైంటి స్టులు, గణిత శాస్త్రజ్ఞులు యిమపట్టుగలవారని. నిద్రాహా రాలు, ఆకలిదప్పులు— అన్నీ తృణప్రాయంగా చూస్తారట!

ఇతడు కూడ భవిష్యత్తులో విశ్వవిఖ్యాతుడయ్యే ఓ గణిత శాస్త్రవేత్త అయివుంటాడని భావిస్తూ, ఈలాంటివారు పాపం ఈ గదిలో— దరిద్రంతో బాధ పడుతున్నారని నిట్టూర్పువిడిచి నసనస నడుస్తున్న మిత్రుడ్ని 'చూచావా అతడ్ని' అంటూ కళ్ళతోనే ప్రశ్నించాను. నా మిత్రుడు మరింత చులకనగా నవ్వి ముందు కడుగులు వేస్తుంటే నా కతనిమీద కోపం ముంచుకొచ్చింది.

మరోగది తలుపునానుకొని నిస్సత్తువగా నిలబడ్డ ఓ యువతి మమ్మల్ని చూస్తూనే తనగాజు కళ్ళలోకి వుత్సాహాన్ని పూరించుకొని కనురెప్ప ఒల్లారుస్తూ విలాసంగా చూచింది! బక్కచిక్కిన దేహం, పాత నేతచీర, చిరుగులు పడేందుకు సిద్ధంగా వున్నట్టున్న జాకెట్టు— నోటినిండా ఎర్రగా వక్కాకు. ముఖానికి చౌకబారు పౌడర్! ఇదీ ఆమె ఆకారం.

ఇంకోగదిముందు యిద్దరు కూర్చొని పులిజూదం ఆడుతున్నారు. వారిద్దరి చుట్టూ యేడెనిమిదిమంది కూర్చుని ఆటగాళ్ళకి సలహాలిస్తున్నట్టుంది. ఆట మంచి రసంకదాయంలో వున్నట్టుంది. ఊతపదాలుగా బూతుపదాలు విచ్చలవిడిగా విహారం చేస్తోంటే మధ్యమధ్య పకపక నవ్వుతూ అదే ప్రపంచంగా భావించుకున్నట్టున్నారు వారు.

అలాంటి సంఘటల్ని పరికిస్తూ ఆ పొడుగాటి ఇంటి చివరివరకువెళ్ళాం. ఇంటిచివర ఆ గృహ యజమానికి చెందిన ఖాళీస్థలం బోలెడంతవుంది. పిచ్చి మొక్కల

తోను, ఏపుగా పెరిగిన గడ్డితోను అదో చిన్నపంట పొలంలాగుంది. ఆ స్థలానికి మధ్యన ఒకరావిచెట్టు, వేపచెట్టు జంటగా పెరిగున్నాసి. వాటిచుట్టూ ఇటుక రాళ్ళతో ఒకతిన్నె గట్టివున్నారు. ఆ చెట్ల మొదళ్ళ కుండే పసుపు కుంకుమ బొట్లను చూచినా ఆ తిన్నెమీద మూడురాళ్ళతో చిన్నగూడుగా కనిపించే స్థలంలోని దీపపు ప్రమిదలు చూచినా ఆ వృక్షముల జంటకు అనుదినపూజలు జరుగుతున్నవని సులభంగా వూహించవచ్చు.

మిత్రుడూ, నేనూ యిద్దరం వెళ్ళి ఆ తిన్నెమీద చూచు న్నాం. నా మిత్రుడేదో బరువు దించుకున్నట్టు గట్టిగా విశ్వ సించాడు. నేను మంద్రంగా నవ్వుతూ 'కలవర పడ్డట్టున్నావ్?' అన్నాను.

నా ప్రశ్నకు జవాబివ్వకుండా 'మీరు యీ గదుల్లో చేరాలనే యింకా భావిస్తున్నారా' నన్ను ప్రశ్నించాడు.

అవునంటూ 'చూశారా! భీకరారణ్యంలో వింత మృగాలమధ్య మహాయోగిలా ఆ గణిత శాస్త్రజ్ఞుడు ఏకా గ్రతతో తన మేథమెటికల్ ప్రోబ్లమ్స్‌ను ఎట్లు సాల్వ్ చేస్తూ కూర్చున్నాడో ఏపం! అతడు మరింకే దేశంలో నైనా జన్మించివుంటే ఎంత ప్రోత్సాహం...

ఎప్పుడూ యెంతో గంభీరంగా కన్పించే నా మిత్రుడు ఒక్క పెట్టునా పకపకా నవ్వాడు. గలగలా నవ్వాడు. రెండు చేతులతోను కడుపుపట్టుకొని ఒకే ప్రవాహంగా నవ్వాడు.

అతని చర్యకు నేను విస్తుపోయాను. మాటాడట మాపి నోరు తెరచుకొని అతనివంకే విస్ఫారిత నయనాలతో చూస్తూ కూర్చున్నాను.

మరో కొన్ని క్షణాలు అలానే నవ్విన మిత్రుడు 'గణిత శాస్త్రజ్ఞుడు, భేష్! గణిత...హా...హా...హా... శాస్త్ర—జ్ఞు' తిరిగి ఆపుకోలేక పక పకా నవ్వేశాడు. ఐదు నిమిషాల అనంతరం బలవంతముగా ప్రవాహ సదృశంగా వచ్చే తన నవ్వును ఆపుకొని 'గణిత శాస్త్రములేదు. నా బొంద లేదు. అమెరికా ఖండంలో న్యూయార్కులోని కాటన్ మార్కెట్‌లో ప్రతి ధరలో డాలరు శతాంశము యెంతుంటుందా! అని బాధపడుతున్నాడు. అదో జూదము వీడో బడాచోర్ కష్టించిన నాలుగు డబ్బులు అంతులేని ఆవేశంతో ఆ వ్యసనానికి బలిపెట్టి యింట్లో పస్తులు పడుండజేసి ఉదయానికల్లా ఆశలు నిరాశ లవుతే కన్నీరు బెడతాడు. ఉదయం నిరాశ; తిరిగీ సాయంకాలం ఆశ. అంతా చక్రవత్ చరణము. క్షమించండి! నవ్వు నాపుకోలేకపోయాను' అన్నాడు. నా ఊహ అంతగా తలక్రిందులు కావటం నా మనస్సుకు ఖిన్నత కల్గించినా నేనుకూడా ఆ భావాన్ని పైకి కన్పించ చేయకుండా మిత్రుని నవ్వులో శృతి కల్పాను.

# 3

ఇప్పుడది మా యిల్లని చెప్పుకొనేందుకు నాకు హక్కుంది. రెండవ వాటాలోని మూడోగది నాది. ఆ గదిలో చేరినక్రొత్తలో అక్కడ నివసించేవారంతా నావైపు వింతగా చూసేవారు. నా పొరుగున నివసించే పంతులమ్మ 'మీలాంటివారు చూచేందుకు కూడా వీలుగాని కొంపలండీ యివి!' అంది. నేను చిన్నగా నవ్వాను. పంతులమ్మ మధ్య వయస్కురాలే అయినా స్త్రీ సహజమైన ఆకర్షణ ఆమెలో యేమాత్రం తగ్గలేదు. విశాలమైన కళ్ళు, పెద్ద కుంకుమబొట్టు,—నిజంగా చెప్పాలంటే ఆ చిన్న సామ్రాజ్యానికి ఆమె రాణి! ఆ వలపై గదుల వారందరూ గాకున్నా చాలామంది ఆమెకు గౌరవమిస్తారు. ఆలుమగల తగాదా మొదలు నీటిపంపు తగాదావరకు రోజూ యేదో ఒక పేచీ ఆమె సాయంకాలం స్కూలునుంచి వచ్చేసరికల్లా కాచుకునే వుంటుంది. ఎవరి మనస్సు నొప్పించకుండా, యుక్తి యుక్తంగా మాట్లాడటం, అవసరమైతే తల్లి, తన బిడ్డల్ని కేకలు వేసినట్లు దండించటం—మరీ శ్రుతిమించి నట్లవు పిస్తే బుంగమూతి పెట్టి అలిగినట్లు ప్రవర్తించటం—ఇవీ ఆ పేచీలను తీర్చే మార్గాలు. పంతులమ్మ కయిదేళ్ళ కొడుకు! ఎంతో కలగలపుగా యెంత క్రొత్తవారితోనైనా యిట్టే

కలిసిపోతాను. కాబట్టే నేను గదిలో చేరిన వారం రోజులకే నాకా అబ్బాయి ఆత్మీయుడై పోయాడు. ఆరు గంటలయ్యే సరికల్లా బయటి వరండాలో నేను వచ్చేదారికేసి కనురెప్ప ఉల్లారుస్తూ నిలుచుంటాడు.

నా గది కిటువైపు నివసించేది కోర్టులో జవాను ఒడ్డూ, పొడవూ——మనిషి భారీగా వుంటాడు. నే నక్కడ చేరటం అందరికంటే యెక్కువ బాధ కలిగిం దతగానికే. కారణం ఇంతవరకు ఆ రాజ్యంలో అధికార దర్పముంతా తనే గుత్తకు తీసుకున్నట్లు ప్రవర్తించేవాడు. నాలుగు నాలుగు మాటలకో ఇంగ్లీషుపదం బలవంతాన యిరికించి మాట్లాడేవాడు. తను లేకపోతే కోర్టు మరి జరగదని, మునసబ్ దొరగారు తన్నెప్పుడూ మెచ్చుకొంటూ వుంటాడని నలుగుర్ని కూచోబెట్టుకొని డప్పాలు కోసేవాడు. మావారు కోర్టుకు పోవాలంటూ అతని భార్య ముందుగా నీళ్ళు పట్టుకోవటం, ఆఫీసర్లకు కొంచెం కన్సెషన్ యివ్వాలండని అతను స్నానాల గదిలో జొరబడటం మామూలుగా వుండేది. కాని నా ఆగమనంతో అతడి జోరు తగ్గింది. ఒక రోజు నాతోనే అన్నాడు కూడ. 'మీ డిగ్నిటీకి యిక్కడుంటం పడదండీ,' అని. నా వునికిచే జనించిన అతని కళ్ళలోని అసహిష్ణుతను అప్పుడప్పుడు నేను చదువగలిగేవాణ్ని!

నా యెదురుగదిలో నివసించేది ఒక కోమటి కొట్టులోని గుమాస్తా. పాపం రివటలా కళ్ళలో ప్రాణం పెట్టుకుని రాత్రి పదిగంటల తర్వాత యిల్లు చేరుకుంటాడు! అతని

జీతం నల్భై రూపాయలు అవుతే ఆతనిపై ఆధారపడి వుంది భార్యా, నలుగురు బిడ్డలేకాక ముసలి తండ్రి కూడాను. ఆ ముసలి తండ్రికి పక్షవాతం. ఎప్పుడూ మంచంలోనే. బ్రతికి చెడ్డ అతగాడికి రోజూ నల్ల మందు వేసుకోవటం అలవాటు. ఏనాడైనా కొడుకు తేలేకపోయాడా---ఆ రాత్రంతా ఆ ముసలాడు నిద్రపోవటమటుంచి మొత్తం ఆ తలుపై గదుల్లోని వారినిగూడా నిద్రపోనీడు. నోటి కొచ్చినట్లల్లా బూతులు కూస్తూ, పెద్దపెట్టున కేకలు పెట్టడమే కాకుండా తల నేలకేసిబాదుకునేవాడు కూడాను ముసలాడంతగా బోంగామా చేస్తున్నా ఆ కొడుకూ, కోడలూ చూపే ఓర్పు వర్ణనా

కాటన్ మార్కెట్ లెక్కలు వేస్తూ కనిపించిన పెద్ద మనిషి బేకరీలో బిస్కట్లుతీసుకొని వీధులంట తిరిగి అమ్మే వాడు. ఆ మారు బేరముతో రోజూ రెండు రూపాయలకు కళ్ళుజూచినా అందులో పెద్దమొత్తం అంకెలమీద తగలే స్తాడు. తప్పకుండా వస్తుందనీ, తను విశ్వసించే సంఖ్యమీద నాలుగణాలు వేస్తాడట- సాయంకాలం డబ్బు కాచినప్పటి నుంచీ తెల్లారి 'ఫిగర్' తెలిసేవరకూ అతడి కళ్ళముందు ఎప్పుడూ తను నమ్మిన సంఖ్య కనుపిస్తూ వుంటుంది. అర్ధ రూపాయి కాచిన్నాడు మరురోజు ముప్పై రెండు రూపాయలు వస్తుందనీ ఆ మొత్తాన్నెలా ఖర్చు చేయవలసిందీ, రకరకా లైన మార్పులు చేర్పులతో లెక్కలు వ్రాస్తూ వుంటాడు. తన 'ఫిగర్' వస్తే రామాలయంలో టెంకాయ కొడతానని రోజూ శపథం చేస్తాడు. కాని నాలుగేళ్ళకూ అతని 'ఫిగర్'

ఒకటీ రాలేదు. అనుకోని అణా పేమెంట్లు, అంటే నాలుగు రూపాయలు ఏ మూడు నెల్లకో ఒకసారి వస్తూంటుంది. అంతే! ఈ జూదకారణంగా అతడి భార్యకూ అతడికీ ఎప్పుడూ గొడవే. ఆమెకూడ నోరుగల యిల్లాలు కాబట్టి ఆ కుటుంబ గొడవ రోజూ రచ్చకెక్కుతుండేది. నాలుగు రోజుల కో సారైనా అతడి పిడిగుద్దులు, ఆవిడ కేకలు, వారి పిల్లల గోల అందరికీ వినిపిస్తూ వుండేది.

మొదటిరోజు నే నీ రాజ్యంలో ప్రవేశించిన నాడు సవిలాసంగా చూచిన యువతి దొక పల్లెటూరు. ఆమె ఓ అమాయక బాలిక! పెళ్ళి చేసుకుంటానని మరో కులం వాడు ఆమెను లేవదీసుకవచ్చి నాలుగురోజులపాటు ఆమెతో సుఖించి మరీ 'ఫికర్' లేకుండా పోయాడు. దురదృష్ట వశాత్తూ ఆమె యిలాంటివారికోసమే కాచుకొని వుంది. వారిని పెట్టు బడిగా పెట్టి డబ్బు సంపాదించుకొనే వారి చేతుల్లో పడింది. జీవితమంటే ఏమిటో ఎరుగని ఆవిడ కమ్మని తిండీ, విలువైన బట్టలకే తన జీవితాన్ని బలిపెట్టుకొంది. ప్రపంచమంటే ఏమిటో ఆమె తెలుసుకొనే లోగానే ఆవిడ ఆ మార్కెట్టులో గిరాకీ పోగొట్టుకొంది! యవ్వనం హరించుకొని పోయింది. ఆమె సంపాదనల్లా భయంకరమైన రోగాలు. పగలంతా పడి నిద్రపోతూనో, లేక తీరిక వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చోవటమో-చేయటం; రాత్రులందు చౌకబారుగా అలంకరించుకొని సినిమా హాల్సు ముందూ తారాడటం-ఇదీ ఆమె పని!

పెళ్ళికెదిగిన యిద్దరు బిడ్డలకు పెళ్ళిచేయలేక ఎప్పుడూ

అదే ధ్యాసతోనే బాధపడే మార్వాడీ కొట్టు గుమాస్తా, ముగ్గురు పల్లెటూరి పిల్లలు ఒక ముసలావిడతో వంట చేయించుకొని స్కూలుఫైనలు చదివేవారూ, మార్వాడీ కొట్టు గుమాస్తా బిడ్డల్ని వల్లో వేసుకోవాలని ఆ విద్యార్థులు పడే పాట్లు - వారి పోజులు--- ఒంటరిగావుండే ఓ మంత్రసాని, ఫ్యాక్టరీలో పనిచేసే పదెనిమిది కార్మిక కుటుంబాలు, ఒక నాటువైద్యుడు, ఇంటి యజమాని ప్రతినిధిగా మొదటి వాటాలోని మొదటి గదిలో నివసించే నౌకరు... ఓహ్...! నిజంగా అదో చిన్న రాజ్యమే...సందేహ మెంత మాత్రమూ లేదు!

# 4

హఠాత్తుగా ప్రవేశించిన నాకు ఈ చిన్ని రాజ్యంలో గౌరవనీయమైన స్థానమే లభ్యమైంది. బాధామయ గాథలలో సతమతమయ్యే అందరిజీవితాల్లోకి తొంగి చూడాలని, అందుకు కారణ భూతమైన విషయాల్ని గ్రహించాలని, నాకున్న ఆత్రుతచేత అందరిలోనూ ఒక్కణ్ణిగా కలిసిపోవటం కావచ్చు. లేదా సమాజంలో వారికంటె నాకున్న స్థానం ఉన్నతమైంది. కావటంవల్ల కావచ్చు, అందరూ నన్ను గౌరవించేవారు. చాలమంది నా సలహాలకోసం ఎదురుచూసే

వారు. ఒక్క పంతులమ్మ తప్ప, ప్రతి ఒక్కరూ తమ కష్ట సుఖాల్ని నాతో చెప్పుకొని ఊరటపొందాలని ప్రయత్నించారు. ఆఫీఆసుగంటల్లో ఫీసులోను, మిగిలిన సమయమంతా నా నూతనమిత్రుల సాహచర్యంతోను నాకు కాలగమన మే తెలిసేది కాదు. నే నా గదిలోచేరి మూడు మాసాలైనా ఒక్కగా నొక్క కథగూడా వ్రాసిన పాపాన పోలేదు. ఒక్కర్ని చూస్తోంటే నాలో భావలహరి పొంగేది. ఉద్రేకం ఉరకలు వేసేది. కలమెత్తి నా భావాల్ని భాషలో పెట్టేందుకు నాకు విరాము మెక్కడిది?

ఒకనాడు అర్ధరాత్రి పడుకొన్న గంటసేపటికే ఎందుకనో హఠాత్తుగా మెలకువ వచ్చేసింది. తిరిగి పడుకొని నిద్ర పోదామని ప్రయత్నించినా నిద్దరాన ని మారాము చేస్తోంది. నిద్రతో కుస్తీ పట్టవలసిన అవసరం నాకేముంది, ఏమైనా వ్రాద్దామని లేచి కూర్చున్నాను. కథా వస్తువుకూడా హఠాత్తుగా తట్టింది. ఆ ముడి వస్తువును కథలో ఏ రీతిగా మలచటమా అని ఆలోచిస్తున్నాను. నేను ఏనాడు చూడనంత ప్రశాంతంగా వుంది ఆ యిల్లు. నల్లమందు మునలాడితో సహా అందరూ గాఢ సుషుప్తిలో వున్నట్టున్నారు. నా కథా ప్రారంభాన్ని గూర్చి నేను ఆలోచిస్తున్నంతలోనే నా ప్రక్కనే ఏదో శబ్దం అయినట్టయింది. చెవులు రిక్కరించి మరీ విన్నాను. అవును! నా ప్రక్కగది లోంచే శబ్దం! దుఃఖాన్ని బలవంతాన ఆపుకుంటూ వెక్కి వెక్కి ఏడ్చే శబ్దం! నే నెరిగినంతలో ఈ చిన్న రాజ్యంలో ఎప్పుడూ, ఎవరూ అలా ఏడ్వలేదు. దుఃఖమొస్తే యింటి కప్పు ఎగిరేలా ఏడ్వటం ఈ మూడు మాసాల్లో నేను చాలా

మార్లు విన్నాను. విలాసిని ఏడ్పుగూడా నాలుగైదు గదుల వరకు స్పష్టంగా వినిపిస్తూండేది. నేను విభ్రాంతుణ్నయ్యాను. కారణం దుఃఖస్వరం హృదయవిదారకంగా వినిపించీ విన పించనట్లు వచ్చేది పంతులమ్మగదిలోంచి. అనవరతరం ముఖాన చిరుదరహాసం నడయాడే పంతులమ్మలోకూడా అగ్నిపర్వ తాలే బ్రద్దలవుతున్నవా? ఈ నల్లభైగడుల్లో ప్రశాంత జీవి తం గడిపి దీమె ఒకతేనని, సుఖశాంతులామెను, ఈ అభాగ్యులందర్నీ విసర్జించి, వరించాయని నే ననుకోవటం పొరబాటేనా?

ప్రాయాలనుకున్న నా కథ ఆగిపోయింది. దూరంగా వుండే సెంట్రల్ బ్యాంకులోంచి రెండుగంటలు విన్న తరు వాత మారెప్పుడు కన్ను మూశానో తెలియదు.

ఆ తర్వాతకూడా ఎన్నోసార్లు పంతులమ్మ అలా బలవంతాన దుఃఖాన్ని ఆపుకుంటూ వెక్కివెక్కి ఏడవటం విన్నాను. కానీ తెల్లవారిచూస్తే ఈమేనా రాత్రల్లా ఏడ్చి నావిడ! అని విస్తుబోక తప్పదు ఆ ముఖంలో దరహాసం మెరిసిపోతూనే వుంటే, మొదటి రెండుమూడు రోజులు నేను కలగనటం లేదుకదా అనికూడా అనుకొన్నాను. కాదు! కల కాదు!! యథార్థమే! అయినా ఆమె నేమని అడగటం! సభ్య తేనా? నాలో నేనెన్నిసార్లో ప్రశ్నించుకున్నాను.

ఒకరోజు మాచ్వాడీకొట్టు గుమస్తాద్వారా పంతు లమ్మ కథని వినటం తటస్థించింది.

ఓ యువతీ, యువకుడూ పెద్దల్ని ధిక్కరించి ప్రేమించి వివాహమాడారు. యావనోత్సాహం వారినలా పురి కొల్పింది. ఇద్దరూ వేరువేరు కులాలవారు. అందుచేత

సంఘంలో వెలివేయబడ్డారు. ఐనా వారు భయపడలేదు. మెట్రిక్ ప్యాస్ అయిన ఆ అబ్బాయి ఉద్యోగంకోసం ఎన్నో పాట్లుపడ్డాడు. కాని దొరికిందికాదు. సంఘంతోపాటు దరిద్ర దేవతకూడా వికటాట్టహాసం చేసి ఆ యువ దంపతులపైకి తన పంజా విసిరింది. వారు బెంబేలుపడ్డారు. రోజులు తరబడి పస్తులు పడుకొని ఒకరికళ్ళలో కొకరు చూచుకొని ఒకర్నొకరు ఓదార్చుకొనేవారు. కాని... ఆకలి ఓదార్పులకు లొంగుతుందా? నిండుగర్భవతియైన తన ఇల్లాలిని అలా పస్తులు పెడుతున్నందుకు రోజులతరబడి కుమిలిపోయిన యువకుడొకరోజు ఉద్యోగాన్వేషణకు ప్రతి దినము పోతున్నట్లే బయటకు వెళ్ళి మరి తిరిగిరాలేదు. ఏమైనాడో ఎవరికీ తెలీదు. యువతి ఆత్మహత్యకు పాల్పడబోయి ఒక నర్సుచే రక్షింపబడింది. గర్భస్రావం పానయింది. కాబట్టి ఆ యువతిని నర్సు హైయ్యర్ గ్రేడ్ ట్రెయినింగ్ లో చేర్పించి, ధైర్యసాహసాలు నూరిపోసి, జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోవటం నేర్పించింది... ఆ యువతే పంతులమ్మ. ఆమె నేటికీ తన భర్తకోసం ఎదురుచూస్తూ వుంటుంది. ముద్దుముద్దుగా మాట్లాడే పిల్లాడు గర్భంలో వుండగా వెళ్ళిన ఆ యువకుడు సజీవుడోకాదో ఎవరికి తెలుసు.

పంతులమ్మను గురించిన గాథను విన్న నా హృదయం కలచినట్లయింది. పంతులమ్మ ఎంత గంభీరురాలు.

ఆమె హృదయ మెంత అగాధమైంది! గుండెలు కుమిలి పోతూంటె చిరునవ్వులు చిందించటం ఎంత నేర్పుగల పని!

# 5

పూర్తిగా ఆగదిలో చేరిన ఆరుమాసాలకల్లా హఠాత్తుగా నాకు 'ట్రాన్సఫరు' వచ్చేసింది. హృదయం జేవినట్లు ఆ గదుల్లోని వారి జీవితాలు చూస్తుంటే దుఃఖంవచ్చినా అందులోకూడా నాకొక రకమైన ఆనందం లభ్యమాతూ వుండేది. వారందరూ నాకు ఆత్మీయులయినవారు. వారికి నేనేం సహాయం చేయలేకపోయినా ప్రతి ఒక్కరినోటినుంచి కృతజ్ఞతావచనాలు వెలువడేవి. ప్రతి ఒక్కరి చూపులు నాయెడ ఎంత సౌహార్ద్రంతో నిండివుండేవి. జీవితంలో ఎందరో మిత్రులను పొందేభాగ్యం నాకు లభించిందిగానీ ఏ మిత్రులుగూడా ఆ నాటి నా చిన్న రాజ్యంలోని సహజీవనులకు ఈడుకారు. సజలనయనాలతో నేను నా మిత్రులనుంచి సెలవు పుచ్చుకున్నాను

ఉద్యోగంలో చేరేముందు జీవితంలో నేను ఓడిపోయానని భావించుకున్నాను. పిరికితనం నాలో పిలుస్తేనే పలుకుతుందా అనేలా ఉప్పొంగుతూండేది. కాని... ఆ ఆరు మాసాలు వారి సాహచర్యంతో మానవత్వపు విలు

వలు బాగా అర్థంచేసుకోగలిగాను. మానవుడికీ, జీవితానికీ అనుక్షణం జరిగే పోరాటంలో ఎలా మసలుకోవాలో నాకు పంతులమ్మ నేర్పింది. బజారు వ్యభిచారిణిగా పరిగణింప బడే 'ఫిలాసిని', తమశ్రమశక్తి ఫలితంగా లభ్యమైన డబ్బు కాటను మార్కెట్టుకు ధారాదత్తం చేసే విజారు వ్యాపారస్థుడు మార్వాడీకొట్టు గుమస్తా, అతని భార్య... వీరందర్నించీకూడా నేను నేర్చుకుంది ఎంతో ఎక్కువే!

ఏమిటి వారినిలా పొగుడుతారు! వారిలో మీరు కాంచిన విశేషమేముంది? అని ప్రశ్నిస్తున్నారా?

అందుకు నా జవాబిదిగో! మీరే ఆత్మ పరీక్ష చేసు కోండి. వారిలో లోపాలున్నాయి. వారిలోనూ మానసిక బలహీనత లున్నాయ్. కానీ... అవి మీలో మాదిరి మఖమల్ తొడుగులు ధరించ లేదు. అలగాజనం, నీచులు అని మీచే పిలువబడే గోముఖ వ్యాఘ్రాలు ఒక్కరూ లేరు. తేనె పూసిన కత్తులసలే కాదు. వారు నిజమైన మానవులు. చీము, నెత్తురులతో, వైతరణీ నదిని సృష్టించి ఆవలిగట్టున వారిని మీ రుంచారు గదూ? ఆ వైతరణిస్థానే పాలసంద్రం పొంగడం మీ కళ్ళతోనే చూస్తూ వుంటారు మరి కొన్ని రోజుల్లో!

# కరి మ్రింగిన వెలగపండు

| | |
|---|---|
| సుమతీ | మంచి బుద్ధిగలవాడా |
| కరి | ఏనుగు |
| మ్రింగిన | మ్రింగినటువంటి |
| వెలగపండు | వెలగపండు |
| గదరా | అవునుగదా! |

రెండు దశాబ్దాల క్రిందట నేను మూడోతరగతి చదువుతున్నప్పుడు మా మాష్టారుగారు నల్లబల్లమీద వ్రాసిన పద్యంలోని ప్రతి పదార్థాలు నా బుర్రలో అలాగే హత్తుకుపోయినవి. బాల్యం వెళ్ళి యవ్వనం వచ్చింది. అమాయకత్వం స్థానే అంతో యింతో విజ్ఞానం స్థానంలో ఏర్పరచుకొంది. సాహిత్య మహాసముద్రంలో ఒక నీటి బిందువుగా నలుగురితో పరిగణింపబడుతున్నాను. అయినా గత సంవత్సరం క్రిందటివరకు 'కరి మ్రింగిన వెలగపండు

లోని 'కరి' కర్థం తెలుసుకోలేకపోయాను! కరి, అంటే ఏనుగు కాదని, నల్లటి పురుగుల సముదాయమని, కరిమ్రింగిన వెలగపండు— అంటే నల్లటి సూక్ష్మజీవులైన ఆ కీటకాలు వెలగపువ్వు కాయరూపుగా పరివర్తన చెందేముందే అందుండి ఆ గుజ్జును హరింపచేసి వృత్తి డొల్లని దిగవిడచటమనీ నేను తెలుసుకున్ననాడు యెంతగానో సంతోషించాను! అవును! జీవితమంతా మనం విద్యార్థులమే గదా!

చిన్నసైజు గుండ్రటి టెంకాయ పరిమాణంలో నిగనిగలాడుతూ మన నోరూరించి, తీరా పగులగొట్టిచూస్తే మధురపదార్థముండవలసిన స్థలంలో శూన్యత్వం ఆవరించుకునివుంటే మనమెంతగా నిరుత్సాహపడతాం! నిజంగా బాధ కూడ వేస్తుంది. మానవుల్లోకూడ యీ 'కరిమ్రింగిన వెలగపండు' సామ్యము ఎంతగానో వర్తిస్తుంది. మానవత్వమెప్పుడూ నిర్మలమైన నిష్కళంకమైన ఉత్తమ గుణాలతో అలరారుతూంటుంది. వెలగపండులోని తీపి, పులుపురుచుల మిశ్రమమైన మధురపదార్థంలాగే జీవితంలో కష్టసుఖాలుంటవి. ప్రవాహ సదృశమైన జీవితంతో ఒడిదుడుకులుండటం అతి సహజమైన విషయమైనా, వాటికి బెంబేలుపడి మానవత్వానికి సహజగుణమైన ఉన్నతిని పోగొట్టుకోవటం, సర్వే సర్వత్రా జరుగుతున్నది. అదే అవాంఛనీయమైన విషయం! వినాశకారమైన 'కరి' కీటకాలలాగానే సమాజాన్ని ఆవరించుకున్న దుష్టశక్తులు మానవులలోని మానవత్వాన్ని కొల్లగొట్టివేస్తున్నాయి. అనుదినము, అనుక్షణ

తంగా మన చుట్టూ జరుగుతున్న అతిసామాన్యమైన సంఘటనలైనవి. వాటిలో మచ్చుకొకటే ఈ కథా వస్తువు. ఇం కెంతసేపీ ఉపోద్ఘాతం;' అని విసుగుపడకండి. ఇదిగో కథలో ప్రవేశిస్తున్నాం.

గోపాల్‌కి నాకు పరిచయం విచిత్రంగా జరిగింది. పరిచయమంటే అతనూ నేనూ ఒకరినొకరు తెలుసుకున్నామని గాదు ఇద్దరికి మిత్రత్వమైందనికూడా గాదు. మొట్ట మొదటిసారిగా ఒక చిన్న సంఘటనతో అతని రూపు నా హృదయంలో హత్తుకపోయిందని మాత్రమే! మౌంటు రోడ్డులో బస్సుయెక్కి ట్రిప్లికేన్ బీచికి పోతున్నా నొక రోజు. బస్ నిండా జనమున్నారు. బస్ స్టాపింగ్‌లో అందమైన అమ్మాయొకర్తె యెక్కింది. షిఫాన్ చీర, నీలిరంగు శాటిన్ బ్లౌజు, రెండు జడలు, ఎత్తుమడమల బూట్లు, కాలేజిగర్ల్ లాగుంది. నా చుట్టూ కూచున్న నలుగు రైదుగురు యువకులు ఒక్కసారిగా లేచి నిలుచుని చిరునవ్వులతో ఆమెకి సీటు నాఫర్ చేశారు. ఆమె మందహాసాన్ని పెదిమల క్రింద దాచుకొంటూ 'థ్యాంక్సు' కూడ చెప్పకుండా ఒక సీట్లో కూర్చుంది. వర్తమానకాలంలో యిది సహజమైన విషయమే కాబట్టి యెవరూ ఆ సంఘటను శ్రద్ధగా పరిశీలించ లేదు. కాని నా యెదురుగా కూర్చున్న యువకు డొకడు 'కస్' మని నవ్వాడు. అతని హఠాత్ హాసనానికి అందరితో బాటు నేనూ విస్తుబోయాను. బస్సు ముందుకు సాగింది. మరో ఫర్లాంగు దూరంలో యింకో స్టాపింగ్ వద్ద మోటారు ఆపటం,

అరవై యేళ్ళ వృద్ధురాలొకతె బస్‌లో ప్రవేశించటం జరిగింది. మాసిన రవికె చిరుగులు పడుతున్న చీర, ముగ్గుబుట్టలాంటి తల, వంగిపోయిన నడుము—— ఆ అవ్వ బిచ్చగత్తెలా అవుపిస్తున్నా టికెట్టుకొని సీటుకోసం దిక్కులు చూచింది. అందమైన అమ్మాయి కోసం స్వార్థ త్యాగానికి పూనుకున్న వారు ఆవిడ తమన్ను రాసుకుంటూ సీటుకోసం దిక్కులు చూస్తూ వుంటే విసుక్కున్నారు ఆమె తగిలితే తమ యిస్త్రీ బట్టలు మైలపడిపోతా వేమోనని ఒదిగొదిగి కూర్చున్నారు. కాని—— అంతలోనే నా యెదురుగుండా వున్న యువకుడు—— ఇంత క్రితం హఠాత్తుగా నవ్విన తను టక్కున లేచి నిలుచుంటూ 'రా అవ్వా! ఇలా కూర్చుందువుగాని' అంటూ ఆమె చెయ్యిచ్చుకొని తన స్థలంలో కూర్చుండబెట్టి తను నిల్చున్నాడు. 'మా నాయనే! వెయ్యేళ్ళు వర్ధిల్లు బాబూ!' అవ్వ ఆశీర్వదించింది. మిగిలినవారు అతనివైపు వింత మృగాన్ని చూచినట్లు ఎగతాళిగా చూశారు. నేను దిగవలసిన స్థలం వచ్చి దిగిపోయాను. సంఘటన చాలా చిన్నది. ఆ యువకుడెవరో క్రొత్తవాడు. అయినా నా హృదయంలో ఆ సంఘటనా, ఆ యువకుడి రూపు పూర్తిగా హత్తుకుపోయినవి.

రెండు నెలలు గడిచిపోయినవి. ఒక మధ్యాహ్నం పూట గదిలో ఒంటరిగా కూర్చుని యేదో కథ వ్రాసుకుంటున్నాను. బిలబిలమంటూ అయిదారుమంది యువకులు నా గదిలోకి ప్రవేశించారు. వారందరి చేతుల్లోనూ హుండీలున్నవి.

గోదావరి వరద బాధితుల సహాయార్థమై విరాళాలకోసం వచ్చినవారని ఆ హుండీలను బట్టి తెలుసుకున్నాను.

"ఆకస్మిక విపత్తులకు గురైన తోటి బాధిత మానవులకు మీకు తోచిన సహాయం చేయండి మాష్టారూ!" గొంతులో మధురత, ముఖంలో బాధ, రేఖ కల, మాట్లాడే యువకుడి కేసి పరకాయించి చూచాను. అతడ్ని వెంటనే గుర్తుపట్టేశాను. ఆనాడు బస్‌లో కనిపించి, తన చిన్ని చర్య ద్వారా నా హృదయంలో ఒక బలీయమైన ముద్రవేసిన యువకుడితడే! అంతలో యింతలో డబ్బు యిస్తే వారు వెళ్ళి పోయారు. అతడితో కొంతసేపు మాట్లాడాలనిపించింది నాకు. అందుకనే అన్నాను. 'ఈ విరాళాలన్నీ బాధితులకే చేరుతవని హామీ ఎక్కడుంది? నేడట్లో సమారాధన అన్నట్లుగా ఇటువంటి వాటిని అడ్డంపెట్టుకుని తమ పంట పండించుకుంటారు ..'

నా మాటలు విన్న అతడి ముఖం ఎర్రబడ్డది. కోపం నా మీద జాలి అతని ముఖభావాల్లో నేను చదువుకున్నాను. 'ఎంత యిదిగా మాట్లాడారండీ! మానవుల్లో అలాంటివారు కూడ వుంటారా? హృదయమున్న వాడెవడూ అలాంటి లేకి పని చేయడు చూడండి' అతడు జేబులోంచి రామకృష్ణ మిషన్ వారు ఆ గ్రూపు కిచ్చిన యోగ్యతాపత్రాన్ని తీసి చూపాడు. అతడి గొంతులో తారాడిన బాధను గమనించిన నేను అనవసరంగా నోరెందుకు జారానా - అని మనసులోనే బాధపడుతూ, జోబులోని చిల్లరను తీసి హుండీలో వేస్తూ 'మీ పేరు?' అతడ్నడిగాను.

"నా పేరు గోపాల్, ఇదిగో వీరి పేరు రామకృష్ణ, సారంగపాణి, సుబ్బారావు, నరసింహారావు మీ కింకా నమ్మకం కుదరకపోతుంది. రామకృష్ణమిషన్ వారికి వ్రాసి తెలుసుకోండి. థ్యాంక్స్! వస్తామండీ!" అతడు విసురుగా వెళ్ళిపోయాడు. ఆ యువకులు అతన్ని అనుసరించారు. నేను నిర్ఘాంతపోయి అలానే నిలుచున్నాను!

మనుష్యుల్ని, వారి ప్రవర్తనల్ని చూచి వారి మనోగత భావాల్ని గమనించాలని ఆరాటపడే మనస్తత్వం గల వాడ్ని కాబట్టి ఆ రోజు గోపాల్‌ను గురించి చాలసేపు ఆలోచన చేశాను. శక్తిలాంటి యువకుడు. సమాజంలోని యే మాలిన్యం అంటని చిగురుటాకు—ఇవి అతణ్ణిగురించి నా ఆలోచనలు చేసిన నిర్ణయాలు.

గోపాల్‌కు, నాకు స్నేహం మేర్పడే అవకాశాలు రాకున్నా అతడు చాలసార్లు నా దృష్టిపథాన పడుతుండేవాడు. నగరంలో జరిగే ప్రతి సాంఘిక కార్యక్రమంలోను అతనికి పాలుండేది! అతడి ఉత్సాహ ఆవేశాలు నాకు ఎత్తయిన పర్వత శ్రేణులనుండి గలగలా ప్రవహించే ప్రవాహాన్ని గుర్తుకు తెస్తుండేవి.

ఒక సాయంత్రం నేను మెరీనాలో షికార్లు చేస్తోంటే, ఒంటరిగా కూర్చుని కన్నార్పకుండా కడలికేసి చూస్తున్న గోపాల్ కనుపించాడు. నేను ముఖంలోకి చిరునవ్వు తెచ్చిపెట్టుకొని అతణ్ణి సమీపించాను.

"గోపాల్‌గారూ!" నా పిలుపుకు ఏమరుపాటున వున్న

అతడు వులిక్కిపడి అంతలోనే తేరుకొని నావైపు చూచి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో నాకు ఆప్యాయతకంటే మామూలు మర్యాద మాత్రమే ఎక్కువగా అవుపించింది. అతడి ప్రక్కనే తడి యిసుకలో కూర్చున్నాను.

వరద బాధితులకు మీ గ్రూప్ వారెంతమాత్రం వసూలు చేయగలిగారు?" అతడితో సంభాషణలోకి దిగాలనే వుద్దేశంతో ప్రశ్నించాను నేను. 'రెండువేలు నిర్లిప్తంగా జవాబిచ్చిన అతడు మరో క్షణాసికల్లా నావైపు సూటిగా చూచి 'మమ్మల్ని గురించి మీరు దర్యాప్తు చేశారా?' ప్రశ్నించాడు. అతడి ప్రశ్నతో నేను సిగ్గుపడిపోయాను. జవాబుగా ఒక పొడినవ్వు నవ్వి క్షమించమన్నాను! తర్వాత ఒకటి రెండు గంటలసేపు మా సంభాషణ కొనసాగింది. వివిధ రాజకీయ సాంఘిక విషయాలమీదనే మా మాటలు కొనసాగినా గోపాల్‌ను గురించి కూడ కొద్దిగా తెలుసుకున్నాను. అతడు ఒక మధ్యతరగతి వుద్యోగి కుమారుడని, కాలేజిలో థర్డు యియ్యర్ చదువుతున్నాడనీని!

ఆ రోజునుంచి అప్పుడప్పుడు మే మిద్దరం మెరీనాలో కలుసుకుంటూ వుండేవాళ్ళం. ఎప్పుడూ యెక్కువగా మాట్లాడేది నా వంతే! అతడు ముక్తసరిగా మాట్లాడేవాడు. అతని పరిచయంతో అతని హృదయపు లోతులకు నేను వెళ్ళానని భావించేవాణ్ణి! అతడిది సున్నితమైన హృదయం. పరుల కష్టాలు, బాధే బాధగాగల అశేష ప్రజానీకపు అనుదిన కష్టాలు అత డ్నెంతో బాధ కలుగచేసి ఆలోచనలు రేకె

త్తి పజేసినవి. ఆ లేత హృదయంలో ఏవేవో ఆశలు, ఆశయాలు వుద్వేగ్తుగా విజృంభించేవి. విద్యార్థి దశలో వుండి నిర్లక్ష్యంగా కులాసాతో కాలం గడపవలసిన ఆతడి ధోరణికి నేను ముగ్ధుడ్నయి పోతూవుండేవాణ్ణి దేశంలో యిలాంటి యువకులు కొన్ని వందలమందివుంటే చాలదూ? అని నాలో నేనే ప్రశ్నించుకునేవాణ్ణి.

నిజంగా గోపాల్ మానవత్వానికి దర్పణంలాంటివాడు.

రోజుగాకునా తరచు కనుపించే గోపాల్ హఠాత్తుగా కనిపించటమే మానుకున్నాడు! కారణ మేమిటాయని పలు మార్లు ఆలోచించాను కూడ! కొంపతీసి ఈ యువ్వనోద్రేకం యే ఉద్యమ ప్రవాహంలోనో పడి కొట్టుకపోలేదు కదా!

ఒకరోజు పనిగట్టుకుని కాలేజికి వెళ్ళి విచారించాను! అతని తండ్రి చనిపోయాడని టెలిగ్రాంవస్తే యింటి కెళ్ళాడని, మరింక కాలేజికి రాలేనని మిత్రులకు వుత్తరం కూడ వ్రాశాడని తెలిసింది.

ఆ తర్వాత గోపాల్ సంగతే నాకు తెలిసిందిగాదు. యువ్వనోద్వేగం చిందులు త్రొక్కుతూ వుత్సాహభరితులైన యువకుల్ని చూచినప్పుడల్లా నా హృదయంలో గోపాల్‌ను గురించిన ఆలోచనలు చెలరేగేవి. ఏనాడైనా అతన్ని గురించిన వార్తలు నేను వినగలనని - అతని భావి జీవితం వుజ్వలంగా వుండి, కనులు మిరుమిట్లు గొల్పించక తప్పదని నేను పూర్తిగా విశ్వసించేవాణ్ణి.

* * *

అయిదారేళ్ళు గడచిపోయినవి. నా జీవిత మజిలీల్లో తిరిగి నేను స్వగ్రామం చేరుకున్నాను. పల్లెటూరు శోభ పట్నవాసపు సౌకర్యాలు కలిగియున్న మా స్వగ్రామం పాత కొత్తల మేలుకలయికగా అగుపిస్తూ వుంటుంది. హైస్కూలు, పోలీసు స్టేషన్, పోస్టాఫీసు, సబ్ రిజిస్ట్రారు ఆఫీసు అన్నీ వున్నాయి. మా ఊర్లో, ప్రక్కనే ప్రవహించే పాపాఘ్ని నది, ఆకుతోటలు, ఏటికాల్వలు, నిజంగా మా వూరిని చూచి నేను గర్విస్తూంటాను.

కొన్ని రోజులకు మా ఊరిలో అలజడి ప్రారంభమైంది. తీరా విచారిస్తే సబ్ రిజిస్ట్రారును గురించి! ఎవరి నోటంటవిన్నా అతని గురించిన గాథలే! రెండుచేతులతో నూ లంచాలు లాగుతాడని, మానవత్వ మెలాంటిదో, మచ్చుకైనా అతనిలో కనిపించదని. దయ, దాక్షిణ్యాలతనికి ఏకోశానా లేవని, విపరీతమైన ప్రచారం ప్రారంభమైంది. సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో నా కెప్పుడూ పనిబడేదికాదు. అతడెవరో నేను చూడనుకూడా లేదు. కాని చుట్టూ వార్తల ప్రభావం నా హృదయంలో అతని ఊహా స్వరూపాన్ని ముద్రితం చేసింది. పొట్ట పెంచుకొని, గ్రద్దముక్కుతో లాలసపూరితమయిన ఎర్రని కళ్ళతో, చిన్నసైజు రాక్షసుడిలా వుంటాడు కాబోలు - అని నేను భావించుకున్నాను.

ఒక వెన్నెలరాత్రి భోజనం ముగించిన పిమ్మట అలా రామాలయంవైపు నడిచాను. గుడి ముందు వసారాలో మా వూరి పెద్దలు అయిదారుగురు, ఓ గుంపు యువకులు కూర్చుని

ఏదో తీవ్రంగా చర్చించుకుంటున్నారు. నా రాకను గమనించిన కరణంగారు హాదంతో కూర్చోమని ఆహ్వానించారు. నేను కూర్చుని వారి సంభాషణలన్నీ ఆలకిస్తున్నాను.

“మొన్న ఊరికొంప అమ్మితే గవర్నమెంటోరి ఫీజు పదిరూపాయలైతే ఈయన కిరవై యియ్యాలట! మూడు రోజులు తిరిగినా ఆ ముడుపు చెల్లించిన తర్వాతే పని అయింది.” ఒక రైతు యువకుడు తన అనుభవాన్ని ఆవేశంతో చెప్పాడు.

“అయినా మనిషి కంత దురాశ వుండకూడదు. పనిని పట్టి పాతికో, పరకో మనమే యివ్వమా! నా అరవై యేండ్ల సర్వీసులో యిటువంటి ఉద్యోగస్తుణ్ణి నేను చూడలేదంటే నమ్మండి!” కర్ణంగారు తాపీగా అన్నారు.

ఎప్పుడోగాని మాట్లాడని మా మునసబుగారు మీసాలు సవరించుకుని, ‘కానీండి! రేపే ఒక పిటీషన్ వ్రాసి పంపిస్తాం. ఎన్నాళ్ళని?’ తన తీర్పును నింపాదిగా ఇచ్చాడు.

మునసబుగారి తీర్పుకు అందరూ ఒక్కసారిగా తమ ఆమోదాన్ని తెలియబరిచారు.

“ఇంతమంది గ్రామస్థులు ఏకంగా మహాజర్ పంపితే అతని ఉద్యోగం ఊడిపోక తప్పదు. అతడి సంపాదనమీద ఆధారపడింది ఎందరో! ఒక కుటుంబాని కుటుంబాన్నే మన చర్యద్వారా దిక్కులేనిదానిగా చేసినవారమవుతాము. రేపొకసారి వెళ్ళి అతగాడ్ని హెచ్చరిస్తాం! సరిగా నడచుకోక

పోతే జరిగే ఫలితాన్ని కూడ వివరిస్తాం విన్నాడా సరే! లేక పోతే అలాగే చేస్తాం!" నేను చెప్పాను.

నా మాటలకు చాలామంది అంగీకారమే వెలిబుచ్చినా, కొందరు గునుసుకున్నారు.

"చేసిన తప్పులు క్షమించి మరోసారి అలా ప్రవర్తించకుండా వుండమని చెప్పటం మన కనీసధర్మం," అసంతృప్తి కనబరచినవారి నుద్దేశించి అన్నాను నేను.

"సరే మేమంతా అంగీకరిస్తున్నాం. చదువుకున్నాడివి బుద్ధిమంతుడివి, రేపు నీవే వెళ్ళి అతగాడికిచ్చే హెచ్చరికేదో యిచ్చేయి!" కరణంగారు నన్ను నిర్దేశించారు.

మరునాడు మధ్యాహ్నం సబ్ రిజిస్ట్రారు ఆఫీసు కేసి నడుస్తున్నాను. నా మనసంతా ఆ సమస్యమీదనే కేంద్రీకరింపబడి వుంది. మానవులు యెందుకిలా పశువుల్లా ప్రవర్తిస్తారు? సబ్ రిజిస్ట్రారుజీతం నూటపాతిక. అతను అడుగకున్నా అలవాటుప్రకారం యిచ్చే 'మామూలు' ఎంత తక్కువన్నా మారో యాభై వుంటుంది. ఎందుకు సంతృప్తి పడరాదు? అనుకుంటూ నడుస్తున్నాను.

"అడక్కుండానే లోపలికి వెళతారే! ఏం కావాలికి చెప్పండి మీకు?" హఠాత్తుగా కోపం వచ్చేసింది. "ఛీ! దారి అడ్డం లేవోయ్" అంటూ గదమాయించాను.

వాడు ఆశ్చర్యంలోనుంచి తేరుకోకముందే నేను లోనికి నడిచాను. ఈ రభస తన సింహాసనంమీదనుంచి తల యెత్తుత్రిప్పి నా వైపు చూచాడు సబ్ రిజిస్ట్రారు.

అప్పుడే సరిగ్గా నేనూ అతనివైపు చూచాను. హఠాత్తుగా నెత్తిన పిడుగుపడ్డట్టుఉంది నా పని! కళ్ళు నులుముకొని మరీ చూశాను. నేను కలగనటంలేదుగదా! ... కాదు ... కల కాదు...యథార్థమే. 'రండి మాస్టారూ!' సబ్ రిజిస్ట్రారు గోపాల్ నన్ను ఆప్యాయతతో ఆహ్వానించాడు. నా కక్కడ మరో క్షణమయినా నిలుచోబుద్ధి వేయలేదు. గిర్రున వెనుదిరిగి నడిచాను. నా పెదాలు అప్రయత్నంగా 'కరిమ్రింగిన వెలగపండు' అని గొణుక్కున్నవి.

# అజేయమైన పురుషార్థం (పిరికి మనుష్యులు)

పుట్టెడు దుఃఖంతో రైలులో ప్రవేశించాడు సత్యనారాయణ. జీవితంలో ఉత్సాహము, ఆత్మలో ఆనందము, శరీరంలో సత్తువ అన్నీ హరించుకు పోయినవాడిలా నిర్లిప్తంగా చెదిగిన వెంట్రుకలు, పెరిగిన గడ్డము, లోతుకు దించుకపోయిన కళ్ళు - మూడు రోజుల్లోనే ముప్పయ్ ఏళ్ళు గడిచినవాడిలాగున్నాడు. శారదను గురించిన ఆలోచనలే అతడిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. తన రాకను గమనించకుండా చెల్లెళ్ళతో కలిసి కలకల నవ్విన శారద రూపము, తనను చూచి అరుణరాగ రంజితాలుగా మారిన ఆమె చెక్కుటద్దాల మోము, పెళ్ళిపీటలమీద ఓరగా

తనవైపు చూచి, తను కాబట్టనివాడిలా నిశ్చలంగా వుండ టం గమనించి నిట్టూర్పు నిగిడించి తలదించుకున్న ఆమె ఆకారము, ఆశలన్నీ వుడిగిపోయాయని అనాసక్తయోగిలా జీవితాన్ని యాంత్రికంగా కొనసాగించే తనలో, ఉన్న దిగ్భ్రాంతి కలిగించేటంతటి మార్పు తెచ్చిన ఆమె ప్రవర్తనా - అన్నీ తెరలు తెరలుగా కళ్ళముందు కనుపిస్తూ వున్నవి. మానవత్వంమీద మమతను పెంచింది శారద. ఎడారి అనుకున్న తన జీవితంలోకి ఒయాసిస్సులా ప్రవేశించింది. శారద దేవత, తను మానవుడు- ఆమె మహాత్మురాలు- తను క్షుద్రుడు.

ఆమెతో పాటే తన కెందుకు చావురాదు? బ్రతికి తను సాధించగలిగే దేమిటి? 'భగవాన్!' గట్టిగా కళ్ళు మూసుకున్నాడు సత్యనారాయణ. అతని పెదవులు మెల్లగా అస్పష్టంగా యేదో గొణుగుతున్నవి. అతడు తన వునికినే మరచిపోయాడు. రెండవతరగతి, ఆ కంపార్టుమెంటులో అటువైపు పక్క బెంచీమీద ఒంటరిగా కూర్చున్న ఒక యువతి అతడు చేసే అస్పష్ట స్వనాలని విని తలయెత్తి చూసింది. అందమైన ఆమె ముఖంనిండా విచారం పులుము కొని వున్నట్టుంది. 'పాపం ఎవరో అభాగ్యుడు' అనుకుంది ఆమె మనసులో.

"నీవో! మహా అదృష్టశాలివా?" ఆమె గుండెలు గతుక్కుమన్నవి. ఏదో స్టేషన్ దగ్గరకొస్తోందేమో ఇంజన్ గట్టిగా కూతపెట్టింది.

రెండు చేతులతోనూ కళ్ళుమూసుకుని, తలవంచు

కొని కూర్చుని, దుఃఖోద్వేగంతో గొణుగుతున్న ఆ యువకుడిని చూసిన తర్వాత ఆమె మనస్సు కొద్దిగా శాంతించింది. అంతవరకు తనలాంటి అభాగిని మరి ప్రపంచంలో వుండదని మోడుబారిన తన జీవితం, భూమికి భారమని ఏమేమో అనుకుంటూ గుడ్లనీరు గ్రక్కుకుంది. కాని— తన ఊహా తప్పని తేలింది. అతగాడు తనకంటె మరింత బాధపడుతున్నాడు! నలిగిన అతని బట్టలు, పెరిగిన అతని గడ్డము, అతనిలోని నిరాశకి కొలబద్దలుగా వున్నాయి. పాపం! ఎవరైనా ఆప్తులు మరణించారేమో! లేకుంటే ప్రాణప్రదంగా ప్రేమించిన ప్రియురాలు కాలతన్నిందేమో! విశ్వనాథం చనిపోయిన రోజుల్లో తనెలా వుండేది? ఏ క్షణమో తన ప్రాణవాయువులు అనంతవాయువుల్లో లీనమవుతవని భావించలేదా? సర్వస్వమూ తనకతడే! ఆయన మరణించినపిదప కూడా తను బ్రతకటం యెంత అసంభవం! అని అనుకోలేదా? మూడు మాసాలు గడిచాయి. తరచుగా వచ్చే విరహం తన్ను దుఃఖార్తురాల్ని చేసినా తను మారిపోలేదా? తను జీవించడంలేదా? ఇంకా తన సుఖజీవితానికై అతని ప్రావిడెంట్ ఫండ్ కోసం రెండోసారి నగరానికి వచ్చి పని సాధించుకొని పోవటంలేదా? ఏమిటో మానవ జీవితమే ఒక వింత! అన్ని వింతలకు మించిన వింత-మనిషి మనసు! కృత్రిమ గ్రహాల నిర్మాణంలో దూరంగా వుండే గ్రహాల అంతు కనుక్కోవాలనే ఆత్రుతలో కొద్దిగానైనా మానవ మనోవిధానాన్ని పరిశీలించేందుకు యెందుకు పూనుకోరో!

"కిర్-ర్-ర్" రైలు హఠాత్తుగా ఆగటంతో పాటు బండిలోని ప్రయాణీకులందర్నీ ఒక్క కుదుపు కుదిపింది. సీటు పైకి మోకాళ్ళమీద తలబెట్టుకొని విషాదార్తిలో యేమరు పాటున నున్న సత్యనారాయణ 'దబ్' మని కూల బడ్డాడు.

ఆలోచనాతరంగాల్లో తేలియాడుతున్న లక్ష్మికూడ పడబోయిందిగాని, ఇనుపచువ్వ నాధారం చేసుకొని తప్పించు కొంది.

మెల్లగా లేస్తున్న సత్యనారాయణ, తిరిగి సర్దుకు కూర్చుంటున్న లక్ష్మి యిద్దరూ హఠాత్తుగా ఒకరి నొకరు చూసుకున్నారు. రెండు జతల కళ్ళు నిస్సారంగా అల్లల్లాడాయి. ఇద్దరి మనోనేత్రాలుకూడ దూరతీరాల్లో నిలిచి పోయిన పాత దృశ్యాల్ని చూసినట్లున్నవి. ఇద్దరి మెదడు మరలు తీవ్రంగా పనిచేశాయి.

"లక్ష్మీ!" లేచి నిలుచున్న సత్యనారాయణ ముఖ మంతా కళ్ళు చేసుకొని లక్ష్మివైపు చూశాడు.

"మీరా! సత్యం—సత్యనారాయణగారు!" ల కూడా సూటిగా అతనికేసే చూసింది.

ఒకటి—రెండు—మూడు— అయిదు నిముషాలు యిద్దరి నోటంటా మాట రాలేదు.

గతకాలపు సంఘటనలు ఒక్కసారిగా వా రిద్దరూ మననం చేసుకుంటున్నారు కాబోలు!

ఆ రేళ్ళగూట. వారిద్దరూ ప్రేమికులు. ఇద్దరి శరీరాలు వేరైనా మనసులు ఒకటేనని భావించుకున్న రోజులు. ఇద్దరూ తల్లిదండ్రులకు దూరంగా పట్టణంలో చదువు సాగించుతూ వుండేవారు. అప్పుడప్పుడే వారిలో యౌవనం అంకురించింది. దేనినీ ఖాతరు చేయని వింత తత్వం యువకశక్తిది. అందుకే వారు వెనుకముందులు చూసుకోలేదు. ఒకాళ్ళి మరొకరికి అర్పించుకున్నామని భావించుకున్నారు. బీచి వొడ్డున పొడి యిసుకలో యెన్నో సాయంకాలాలు కనుపించనంత వేగంగా గడిచిపోయాయి. ఏవేవో బాసలు, ఎన్నెన్నో గుస గుసలు... మరెంతో మధురానుభూతి ఆ సాయంకాలాల నిండా పరచుకొని వుండేవి. వేసవికాలపు శలవలిస్తే వచ్చేశాయి. మూటా ముల్లె సర్దుకొని చెరోవేపుకి పయనం సాగించాల్సి వచ్చింది.

ఎడబాటు నాటి కడపటి క్షణాల్లోకూడా ప్రమాణాలు చేసుకున్నారు. అమ్మాయి, తన తండ్రి చేస్తున్నది స్కూల్ మాస్టర్ గిరి కాబట్టి కట్నంమీద ఆశపెట్టుకోవద్దని సున్నితంగా సూచించింది. అందుకు జవాబుగా అబ్బాయి గట్టిగా నవ్వి, నెలతిరక్కముందే పెళ్ళికూతురయ్యేందుకు సిద్ధంగా వుండమని హెచ్చరించాడు. ఇద్దరి మోముల మీద ముసిముసి నవ్వులు ముచ్చటగా దీపాల్లా వెలిగాయి.

ఊరు చేరి అబ్బాయి నసుగుతూ నాన్నముందర తన కోరికను వెలిబుచ్చి తలవంచుకుని నిలుచున్నాడు. నేల

చూపులు చూస్తున్న వాడల్లా ఆయనగారి హుంకరింపులకి బెంబేలుపడి తుర్రుమని జారుకున్నాడు తన గదిలోకి.

లక్షాధికారి కొడుకైన అబ్బాయి, మరికొన్ని మాసాల్లోనే మరో లక్షాధికారి అల్లుడయ్యాడు. లక్ష్మినిగురించిన భావన మనసులో కొచ్చినప్పుడల్లా పాపమని మనసారా జాలిపడేవాడు!

సొంత గ్రామం చేరుకున్న అమ్మాయి మరునాటి నుంచే పోస్టుకోసం దారులు కాచింది. రోజులు బరువుగా సాగి పోయాయి. ఓదార్చే తోడుకూడ లభ్యంకాని వియోగంలో ఒంటరిగా రాత్రులందు తలగడను కన్నీటితో తడిపివేసేది. మాసాలు గడిచినా మనసిచ్చిన అబ్బాయి జాడకూడా కనుపించలేదు. ఎన్నెన్నో ఊహలు చేసింది. ఆచరణలో అయోగ్యాలని వెంటనే విసర్జించేదికూడా ఆ ఊహాతోరణాన్ని.

మరోసంవత్సరానికల్లా నాలుగైదు వివాహపరీక్షల్లో ఓడిపోయినా ఎట్టకేలకు ఒక లోయర్ డివిజన్ గుమాస్తా గృహరాణిగా పట్టాభిషిక్తు రాలైంది.

అబ్బాయి ఊహాపథంలోకి వచ్చినప్పుడల్లా అమ్మాయి దుఃఖావేశాలతో ఊగిపోయేది.

భూమి బ్రద్దలు కాలేదు. ఆకాశం విరిగి పడలేదు, సముద్రాలు కోపంతో ఘూర్ణిల్లుతూ చెలియలికట్టన్ని త్రోసిరాజని జనపదాలపైకి విరుచుకపడలేదు.

సత్యనారాయణా శారదలు, లక్ష్మీ విశ్వనాథులు ముచ్చటైన దంపతుల జంటగా, అనుకూల దాంపత్యాల్లా, వాళ్ళెరిగిన వారందరిచేత పరిగణింపబడ్డారు.

కాని—విధి చిత్రమైంది. విచిత్రంగా కనుపించక పోతే అసలది విధియెలా అవుతుంది?

పూర్తిగా ఐదేళ్ళయినా గడవకముందే ప్రధాన పాత్రలకి ఉపపాత్రలుగా వచ్చినవారిద్దరూ రంగంనుంచి తప్పుకున్నారు. ఆరుమాసాలుపాటు క్షయలో కొన్ని వేలు ఖర్చు పెట్టినా విఫలమయి శారద మరణిస్తే, గుమాస్తా విశ్వనాథం ఆఫీసునుంచి యింటికొస్తూ ఒక మోటారు ప్రమాదంలో కన్నుమూశాడు. భేద మింతే!

“లక్ష్మీ! నీకు మహాపరాధం చేశాను.” విచిత్ర మౌనం చేసే నిశ్శబ్ద గానాన్ని భంగంచేస్తూ అన్నాడు సత్యనారాయణ. ‘అదో పీడకల! మరచిపొండి’ లక్ష్మి మెల్లగా జవాబిచ్చింది. తిరిగి యిద్దరి మధ్యా మౌనం తిష్ఠవేసుకు కూర్చుంది.

ఒకర్నిగురించి మరొకరు పూర్తిగా తెలుసుకోవాలని వున్నా, యిద్దరూ మాట్లాడ లేకపోతున్నారు. ఇద్దరి హృదయాల్లోను ఆత్రుత వున్నా యిద్దరి గొంతుకలు మూగబోయాయి. ఒకరికొకరు మహాపరాధం చేసినవారిలా బాధపడ్డారు.

అలానే మరో పదినిమిషాలు గడిచాయి. ఇద్దరూ పూర్తిగా మారిపోయినవారిలా అవుపించారు ఆ కొద్ది

కాలంలోనే. ఆనాడే పరిచయమైన రైలుప్రయాణీకుల వారి
ద్దరి మధ్యా మాటలు సాగాయి. ఒకరి దుఃఖార్తిని మరొకరు తెలుసుకున్నారు. శారద గుణగణాల్ని గురించి సత్యనారాయణ, విశ్వనాథం మంచితనాన్ని గురించి లక్ష్మి యిద్దరూ సంకోచం లేకుండా పరస్పర సంభాషణలు సాగించారు. దాదాపు రెండుగంటలసేపలానే సాగిన సంభాషణ ఆగిపోయింది. తర్వాత కళ్ళతోనే పరస్పరం వీడ్కోలు చెప్పుకొని అటువైపు కార్నర్ సీటులో లక్ష్మి, యిటువైపు కార్నర్ సీటులో సత్యనారాయణా పడుకుని కళ్ళు మూసుకున్నారు. ఆమె నిద్రకు తలపడిందని అతడు భావించాడు. అతడు నిద్రబోతున్నాడని ఆమె అనుకొంది. కాని- యిద్దరూ కళ్ళుమూసుకున్నా నిద్రపోవటమటుంచి ఆలోచనలతో తలపట్లు పడుతున్నారు.

"పాపం! లక్ష్మి!" సత్యనారాయణమనసులోనేనిట్టూర్పు వదిలాడు. తన్నెంతగానో నమ్ముకుంది. తనానాడు ధైర్యంచేసి తండ్రిని ధిక్కరించివుంటే జీవితగతే మారిపోయి వుండేది! ఎందుకో పిరికితనం తన్నావహించిందానాడు. శారదను పెళ్ళాడినా లక్ష్మిని గురించినఆలోచనలు తన్ను ముసురుకుంటూనే వుండేవి. ఆమె తన భావనలోకి వచ్చినప్పుడల్లా జాలితో బాటు ఓ మధురానుభూతికూడా తన హృదయాన్ని నింపేది. ఆనాడలా విడటమూ ఈనాడిలా కలుసుకోవటం యెంత ఆశ్చర్యకరం! ఇద్దరిజీవితాలు సమానాంతర రేఖల్లా సాగుతున్నట్లున్నవి. హఠాత్తుగా యీ కలయిక తటస్థపడటంలో

మరో విశేషమేమైనా ఉద్భవింపచేసేందుకు విధి వ్యూహి స్తోందా?

కావచ్చు. ఇద్దరి జీవితాలూ మోడుబారిపోయి వున్నవి. ఎందుకు చిగురింపచేసుకోకూడదూ? శరీరమే శాశ్వత మని యెందు కనుకోవాలి? ధైర్యంచేస్తే వసంతం తలవాకి టనే వుంది. ధైర్యమేమిటి? ఇప్పుడు తను సర్వ స్వాతంత్రుడు. ఎవరి అదుపాజ్ఞలకి తను జడియవలసిన పని లేదు. ఆమెకూడ అంతే! జీవితం ముడివస్తువు. మనసులో సరిగా తలచుకుంటే దాన్ని స్వర్గప్రాయంగా మార్చుకో వచ్చు! ఆ నేర్పు లేకపోతే నరకమే గతి. కాని—ఆమె అందు కంగీకరించకపోతే? తను కృంగిపోవలసి వుంటుంది. అసలామె తన్ను నమ్ముతుందా? ఆమెకి తను చేసిన ద్రోహం ఇంత లోనే మరువగలిగేదేనా? పరిస్థితులు విషమించలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే ఆమె ఆ రోజుల్లోనే ఏ నూతిలో గోతిలో బలి అయియుండేది. ఆమె యెడ అలనాటి ప్రవర్తన కతడు నేడు పశ్చాత్తాప పడుతున్నాడు.

అలా ఆలోచించే అతని మనోనేత్రం ముందు శారద చిత్రం తళుక్కుమంది. ఛీ! ఏమిటి, తన ఆలోచనారీతులు! శారద మరణించి మూడురోజులైనా గాలేదు. అప్పుడే తనామెని మరచిపోతున్నాడు. స్వసుఖం కోసం బాటలు వేసుకోబోతున్నాడు. ఈ మూడునాళ్ళనుంచి తన మనో వ్యాకులత అంతా బూటకమేనా? ఏదో విద్యార్థిదశలో వింత వుత్సాహంలో చేసిన ఒక చిలిపిచేష్ట నాధారం

చేసుకొని జరిగే సంఘటన తమ అపూర్వ దాంపత్యాను భూతిని మరపించగలదా- శారదను మరవాలన్నా మరువ లేడు. అయిదేళ్ళలోనే ఏనాటికి చెరిగిపోనిముద్ర జీవితం మీద వేసిన పుణ్యాత్మురాలు. ఛీ! ఛీ! తను నీచుడు, ద్రోహి, దుర్మార్గుడు. గట్టిగా కళ్ళుమూసుకుని శారదను గూర్చి ఆలోచనలతోనే మనసు నింపుకునేందుకు ప్రయ త్నించాడు సత్యనారాయణ. ఆమె ఆలోచిస్తోంది. మాసం రోజుల్లో పెళ్ళికూతురివిగా తయారయ్యేందుకు సిద్ధంగా వుండమని ప్రారంభించిన సత్యం విధవగా మారిన తనకు విదు రుడుగా దర్శనం యివ్వటం యెంత ఆశ్చర్యంగా వుంది! రైలుపట్టాల్లాగున్నవి తమ జీవితాలు. మహాపరాధం చేశాను మన్నించమంటాడు పెద్దమనిషి. మన్నించి తను చేసేదేముంది? మన్నించకపోతే జరిగిపోయే మహా ప్రమాద మేమిటి? అతడెవరు? తనెవరు? యాదృచ్ఛికంగా తీసుకుని కొన్ని గంటలు కలిసి ప్రయాణం చేసినట్లే అలనాటి తమ ప్రణయాన్ని కూడా భావించుకునే సమర్థుడు. కాకపోతే అలా చేస్తాడా? తమప్రేమ బహిరంగ పడక పోవడంవల్ల తను బ్రతుక గల్గింది. అలా జరిగివుంటే బ్రతికినా సంఘంలో తన స్థానం యెలా వుండేది? భగ్నహృదయు డనుకున్న తన జీవితాన్ని యెలా మార్చేశాడు విశ్వం! తన్నెంతగా ప్రేమించేవాడు. అతని పంచప్రాణాలూ తనేనని పలుమా ర్లనేవాడు. అమాయకమైన నిష్కళంకమైన అతని ప్రేమ చూస్తోంటే తన కన్నులు చెమర్చివి! గత సంఘటనల్ని

తెలుచుకొని ఏదో పాపం చేసినదానిలా అతన్ని మభ్య పెట్టి ద్రోహం చేస్తున్నానాయని బాధపడేది కూడాను. సత్యం చేసిన ద్రోహంతో విషాదభరిత మనుకున్న తన జీవితానికి ఆశ రగిలించి తొండమావుల్లా కనుపించి అందే ఆనందాన్ని జుర్రుకునేటప్పుడు విసిరికొట్టినట్లయింది విశ్వం మరణించడం.

నిజాయితీగల మనిషయితే జరిగింది జరిగిపోయినా ఇప్పుడయినా అతడు... ఇద్దరి పరిస్థితులూ ఒకటిగానేవున్నవి. తన సాహచర్యాన్ని యెందుకర్థించ గూడదూ? అలా అతడర్థిస్తే, ఆ అభ్యర్థనలో నిజాయితీ పశ్చాత్తాపాలు కనుపిస్తే తన కభ్యంతరం వుండదు. తమ జీవితాల్లోంచి యీ అయిదేళ్ళ కాలాన్ని తుడిచిపెట్టుకుంటే అంతా మామూలుగా వుంటుంది. అంతా నూతనమే! అనుకుంటే యిప్పుడర్థమవుతోంది. సత్యంమీద ప్రేమ విశ్వంమీద తనకెప్పుడూ లేదు. కాని అతడంటే తన కపార గౌరవం, భక్తివుండేవి. వాటిని ప్రేమగా భావించుకుంది తను.

ఆలోచిస్తున్న లక్ష్మి వులిక్కిపడింది. ఏమిటి తన అంతరంగపు అసహ్యపుపోకడ! తను భారతస్త్రీ! ఒకసారి వేసిన తప్పటడుగు వర్దుకుందని, హద్దూపద్దూ గమనించకక్కర్లేదూ! అందులోను తన్ను పతితగా మార్చాలని ప్రయత్నించిన ఘనుడ్నాధారంగా చేసుకునా? చాలీ అయిదుసంవత్సరాల ఆనందం. ఈ ఆనందానుభూతినే

నెమరు వేసుకుంటూ అందుకు కారణభూతుడయిన ప్రేమ మూర్తి తన విశ్వాసాన్ని మనసారా స్మరించుకుంటూ శేష జీవితాన్ని గడుపుతుంది. 'భగవాన్' ఈలాంటి దుష్ట వాంఛలనుండి నన్ను తప్పించవూ!' కళ్ళు మూసుకుని పరమేశ్వరుణ్ణి ప్రార్థించింది లక్ష్మి.

చీకటితెరలు విచ్చుకోవటంతో పాటు రైలు కూడ విజయవాడ స్టేషన్ చేరుకుంది. లక్ష్మి లెదర్ బాక్సు చేత బుచ్చుకుని కారేజిలోంచి దిగుతూ 'వెళ్ళివస్తానండీ!' అంది నిలువుగుడ్లు వేసుకుని చూస్తున్న సత్యనారాయణ అప్రయత్నంగా తలూపాడు. ఆమె ప్లాట్‌ఫారంలోని జనసముద్రంలో కలిసిపోయింది. అతడు తలుపు వద్దకు వచ్చి నిలబడి గట్టిగా పెదవులు కొరుక్కున్నాడు.

# ఉస్మాన్

గళ్ళచొక్కా, చారలలుంగీ- చెయ్యెత్తు మనిషి-ముఖంమీద గంట్లు- చిత్రంగా చిరునవ్వు చిందిస్తూ బస్‌స్టాప్‌లోను, థియేటర్ల ప్రక్క, కాఫీహోటల్ బయట వరండాల్లోనూ యెప్పుడూ కనిపించేవాడు! పళ్ళ సందున బీడీ యెప్పుడూ తలుగుతూవున్నా అతని చిరునవ్వు నిండుగాను వింతగానూ లవుపిస్తూ వుండేది!

"సలాంసార్!"

"నమస్కారం బాబూ!"

"రామ్ రామ్ బయ్యా!"

"గుడ్‌మార్నింగ్ సార్!

అతడు వచ్చేపొయ్యే వాళ్ళందరినో చిరునవ్వుతో పలుకరిస్తూ పలురకాలయిన సంబోధనలతో సంభావిస్తూ వుండేవాడు. నేను కనుపించినప్పుడెల్లా అతణ్ణి విచిత్రంగా

చూస్తూండేవాణ్ణి! అతడు రౌడీనా...?... దొంగా...? సోమరిపోతా...? లేక కొద్దిగా మతి చలించినవాడా...? అని పలుమార్లు నాలో నేను తర్కించుకునేవాణ్ని. సమాజంలో యిలాంటి వ్యక్తులు తరుచుగా కనుపిస్తూ వుంటారు. వీరు పరభాగ్యోపజీవులు, వళ్ళువంచి ఆర్జించి పనిచేసిన దానితో జీవించకుండా ప్రక్కదారులు త్రొక్కిన దారి తప్పిన జీవాలు! శ్రమకు దూరంగా వైదొలగే సోమరిపోతులు! ఈలాంటివారిని ప్రోత్సహించడంగాని, వారిమీద దయాదాక్షిణ్యాలు చూపటంగాని క్షమార్హమైన విషయం కాదని నా దృఢమైన విశ్వాసం! నాకు కొన్ని నమ్మకాలున్నాయి. భూమి తలక్రిందయినా, ఆకాశం విరిగి నేలన బడినా నేను నమ్మే విశ్వాసాలు (సత్యాలు!) నా నుంచి దూరంగావని నా అభిప్రాయం! అందుకనే గళ్ళచొక్కా, చారల లాంగీ వ్యక్తిమీద నాకు సదభిప్రాయంలేదు! పైగా అతనెవరో నేను యెరుగకనేయున్నా బోలెడంత అసహ్యం నా మనసులో అతనిమీద పేరుకుపోయి వుంది.

కాని మనసు విచిత్రమైంది. మానవుమనసుకు రెండు పొరలుంటాయేమోనని కూడ అనిపిస్తుంది. మన మనసుకే విశ్వాసానికి, నమ్మకానికి భిన్నమైన విశ్వాసం, నమ్మకం మన మనసులో వుంటుందనేది విచిత్రంగా అవుపించదూ! అయినా అదినిజం!

రోజుకు కనీసం రెండుమూడుసార్లయినా కనుపించే గళ్ళచొక్కా, చారలలుంగీ వ్యక్తి ఒకరోజు కనిపించకపోతే

నా మనసు కెందుకో వెలితిగా వుండేది! అతనెవరు? నే నెవరు? అతనికి నాకు సంబంధమేమిటి? ముఖపరిచయమే తప్ప మరే పరిచయం కూడ లేని ఆ అనామకుడు అవుపించకపోతే వెలితేమిటి? తార్కికంగాను, హేతువాద దృష్టితోను ఆలోచిస్తే అలా భావించటమే అసంగతమైన విషయం! అందుకే మనసు విచిత్రమైందని ముందుగానే మనవి చేయటం!

గళ్ళచొక్కా, చారలలుంగీ అతడు వున్నట్టుండి నాలుగురోజులు కనిపించలేదు. ఒకసారి మొదటిరోజు అతనప్పుడప్పుడలా కనబడకపోవటం సహజమేలే అని సరిపెట్టుకున్నాను. కాని, రెండోరోజున కారణ మేమయి వుంటుందా అని కొద్దిసేపు ఆలోచించాను. మూడోరోజు మాత్రం నా ఆలోచనల్లో అతగాడు ప్రముఖస్థానమే ఆక్రమించుకున్నాడు. నాలుగవనాడు నా ఆలోచనలను బలవంతంగా అతనిపైనుండి మరలించుకోవాలని ప్రయత్నించి కూడ విఫలుడ్నయాను ఆ రాత్రి గదిలోకూడ అతణ్ణి గురించిన యోచనేనన్ను ఆవరించింది. సగంవ్రాసి వదలిన కథను పూర్తిచేయాలని కూర్చున్నాను. ఎదురుగా కాగితాల బొత్తాంలో గళ్ళచొక్కా, చారలుంగీ కనుపించినవి! ఏమిటది విస్తుపోయాను. ఆ రాత్రి కథ పూర్తిచేయలేదుగదా పేరు కూడ యెరుగని అనామకుణ్ణి గురించి యేదేదో ఊహించుకున్నాను! మిథ్యారూప కల్పనల్లో అతడో హీరోగాను, అప్రయోజకుడుగాను,మరి పలువిధాలుగా అవుపించాడు. అతన్ని గురించిన ఆలోచనలకు స్వస్తి చెప్పాలని మనసార్థా

వాంఛించినా నామానసిక బలహీనత నాకు యెదురు తిరిగి వెక్కిరించింది. ఆ ఆలోచనలతోనే అలాగే కన్నుమూశాను ఆ రాత్రి.

తెల్లవారింది. గళ్ళచొక్కావాడి ఆలోచనలు మనసులోకి రాలేదు. రాత్రి సరిగా నిద్రలేకపోయినా మనసుకు ఉల్లాసంగానే వుంది. లేస్తూనే, కూర్చుని సిగరెట్లు తగులబెడుతూ అసంపూర్తి కథను పూర్తిచేశాను. మునిసిపల్ సైరను ఎనిమిదయినట్టు గొంతెత్తి హెచ్చరించింది. కడుపులో ఆత్మారాముడు 'ఆకలి' 'ఆకలి' అని అనకున్నా 'కాఫీ' 'కాఫీ' అని గోలపెట్టింది.

మణీ లంచ్ హోమ్‌లో సుష్టుగా టిఫిన్‌చేసి కాఫీ త్రాగి కౌంటర్ దగ్గర బిల్లు చెల్లించి జేబులోంచి సిగరెట్ తీసి పెదాలమధ్య నుంచుకొని బయట వరండాలోనికి వస్తూ నిప్పుపెట్టెకోసం జేబులు తడుముకుంటున్నాడు. నిప్పుపెట్టె జేబులో వుంటేగా కనిపించటానికి? గదిలోనే మరచిపోయి వచ్చినట్టున్నాను. 'సరే! మరో పెట్టె తీసుకుందాం!' అనుకుంటూ పరధ్యానంగా ముందుకు అడుగులు వేస్తున్నాను.

"సాబ్ ..." బర్రుమని నిప్పుపుల్ల వెలిగిన శబ్దమయింది. తలెత్తి చూశాను. గళ్ళచొక్కా, చారలలుంగీ అతను నిప్పుపుల్ల వెలిగించి నన్నుద్దేశించే 'సాబ్!' అంటూ నా సిగరెట్‌కు దగ్గరగా వుంచాడు.

నేను మౌనంగా సిగరెట్ అంటించుకొని అతని ముఖంలోకిచూచాను. అతను చిరునవ్వు చిందించాడు!

నాలుగురోజులనుంచి అంతర్గతంగా నా హృదయంలో అతనిని గురించే ఆలోచనలు, వుత్తున్నకతా వున్నా ఆ క్షణంలో అతిడంటే స్వతహాగా నాకున్న నిరసన స్వభావం పైకి ఉప్పొంగి అతని చిరుదరహాసానికి బదులుగా నవ్వు చిందించలేకపోయాను! ఆ నిరసనభావ ఫలితమేనేమో మామూలు 'ఎటికెసీ'కి కూడా నేను దూరమయాను. అతని వునికినే గుర్తించనట్లు సిగరెట్ అంటించుకొని దూరంగా వైదొలగిపోయాను.

గళ్ళచొక్కా, చారలలుంగీ అతను నాకు రోజూ కన్పించడం, పైకి ఉత్సాహం చూపకున్నా అతన్ని నేను రోజూ అతనికి తెలియకుండానే గమనిస్తూ వుండటం మామూలయింది.

ఈలా కొన్ని మాసాలే గడిచిపోయినవి.

ఈలోగా మరో చిన్న సంఘటన జరిగింది. నా మిత్రుడొకడు మదరాసునుంచి వచ్చాడు. అతను కూడ 'కలంజీవే!' రచయితగా బతకాలనుకొని విఫలుడై మదరాసులో ఒక తెలుగు దినపత్రికలో సబ్ ఎడిటరుగా చేస్తూ గుమాస్తాలా భుక్తి గడిచుకుంటున్నాడు.

ఆ మిత్రుడూ, నేను ఒకరోజు కాఫీత్రాగి బయటికి వచ్చాం. గళ్ళచొక్కా, చారలలుంగీ మనిషి హోటల్ బైటవరండాలో బీడీకాలుస్తూ నిలుచుని వున్నాడు.మమ్మల్ని

చూస్తూనే బీడీ తీసిపారేసి వినయంగా 'నమస్కారం సార్!' అన్నాడు. అతను అలా అంటున్నప్పుడు గంట్లుపడి అసహ్యంగా, నల్లగావున్న అతని ముఖంలో నడయాడిని తీయని దరహాసం ఆ ముఖానికంతా ఒక వింత అందాన్నిచ్చింది.

"ఓహ్...ఉస్మాన్!...బాగున్నావా?" నా మిత్రుడు ప్రతి నమస్కారం చేస్తూ ఆప్యాయంగా అతన్ని పలుకరించాడు నా మిత్రుని ముఖకవళికల్ని గమనించిన నేను అతడు గళ్ళ చొక్కా మనిషిని చూచి యెంతో సంతోష పడ్డట్టుగా గమనించ గలిగాను.

"మదరాస్‌లోనేనా సార్ మకాం?" ఉస్మాన్ చేతులు గట్టుకొని సవినయంగా ప్రశ్నించాడు.

"అవును ఉస్మాన్!...ఏమైనా విశేషాలున్నాయా?" మిత్రు డడిగాడు.

"విశేషాలేం వున్నాయి! మీ దయవల్ల కష్టాలేవీ సార్!" ఉస్మాన్ జవాబు.

"నీకు కష్టాలేమిటోయ్! అందరి కష్టాలను ఆదుకొనే వాడివి నీవైతే...!" మిత్రుడు చిరుదరహాసం చిందిస్తూ అన్నాడు.

"ఆ...నాదేముంది సార్!" ఉస్మాన్ సిగ్గుపడుతున్నట్టు అవుపించాడు.

"వస్తాను ఉస్మాన్!" ఉస్మాన్ భుజాన్ని ఆప్యాయంగా

కృజసూ నా మిత్రుడు అతనిదగ్గరనుంచి వీడ్కోలు పుచ్చు కున్నాడు.

గదిలోకి వెళ్ళిన తరువాత "ఎవరోయ్ అతగాడు? వాడికీ నీకు స్నేహమేమిటి? అలగా వెధవ బజారులన్నీ బలాదూర్‌గా తిరిగే రౌడీ సజ్జు!" నా కసింతా ప్రదరిస్తూ ప్రశ్నించాను.

"ఓ...ఎవరూ? ఉస్మాన్‌ని గురించా?...అతడు చాల మంచివాడు. రౌడీ కాదు! అలగా అంటావా? అది ప్రాయం గావచ్చు!" తాపీగా మిత్రుడు జవాబిచ్చాడు.

మిత్రుని జవాబు నాలో ఉత్సుకతని రేకెత్తించింది. ఉస్మాన్‌ను గురించి వివరాలడిగాను.

అత డిలా జవాబిచ్చాచ్చాడు.

"రాజూ! మనం ఒక వింత సమాజంలో నివసిస్తు న్నాం! వ్యక్తికి, వ్యక్తిగా గాకుండా వేషభాషల్నిబట్టి నేటి సమాజంలో మనం గౌరవం యిస్తున్నాము. అందుకనే మన చుట్టూ కుహనాసంస్కారులు, ప్రజాసేవకులు, గొప్పవారు యెందరో తయారవుతున్నారు. కాని ఉస్మాన్ వృత్తి మొరటు వాడు. చదువు సంధ్యలు లేనివాడు. బాహ్యవేషాలు ఆడంబ రాలు అధికారం చలాయించే రోజుల్లో అలాంటి వాడు అలగావెధవగాను, రౌడీ సజ్జుగాను కనుపించటంలో వింతేమీ లేదు" మిత్రుడు మధ్యలోనే తన ప్రసంగాన్ని ఆపాడు. అతని గొంతుకలో బాధ ధ్వనించింది.

నేను వింతగా నా మిత్రునివైపు చూశాను. ఉత్తినే

పుణ్యానికి కనీసపోద్ది యేమీ యెరుగని మనిషిని నేనలా నిందించినందుకు కొద్దిగా సిగ్గుపడ్డాను కూడ.

"క్షమించు...రామం..." అన్నాను.

"అబ్బే!" మెల్లగా విషాదంగా నవ్వాడు మిత్రుడు రామం.

"నీవేకాదు! లోకరీతి చెప్పానంతే! మనం నివసించే సమాజ ఛ్ఛాయలు మనమీదపడక తప్పవు. అది సహజమైన విషయం. కాని కనీసం మనలాంటి వారమైనా క్రొత్త రీతుల్లో ఆలోచించడానికి అర్థంచేసుకోడానికి ప్రయత్నించక పోతే మంచీ చెడ్డలు కలగా పులగమై యేది మంచో యేది చెడో - యెవడు సన్మార్గుడో యెవడు ధూర్తుడో సులభంగా గుర్తుపట్టజాలని ఈ రోజుల్లో నెమ్మదిగా ఆలోచించకనే త్వరపడి నిర్ణయాలకు రాకూడదు. ఉస్మాన్ రూపము, అతని మతము, భాష, వేషము-ఇవన్నీ అతన్ని మరోలా నిర్ణయించడానికే దోహదమవుతవి. కాని..."

"కాని...?" నేను ఆతురతగా ప్రశ్నించాను. ఎంతో మామూలైన విషయమని మన మనుకున్నదే ఒకప్పుడు వింత విషయంగా ఆశ్చర్యకరంగా మారిపోతుంది. ఉస్మాన్ సంగతికూడ అంతే! అందుకే నాలో ఉత్కంఠ జనించింది.

"ఉస్మాన్‌కు 'నా' అనేవారు యెవ్వరూ లేరు. కాని ప్రపంచమంతా తనదేనని భావించుకుంటాడు. పరోపకారపు జీవుల్ని నే నెందర్నో యెరిగివున్నాను. కాని ఉస్మాన్‌లా పరు

లకోసమే బ్రతికేవాణ్ణి చూడలేదంటే అతిశయోక్తి కాదు. ప్రచార యుగంలో జీవిస్తూ కూడ తన పరోపకార పారీణ తను బలవంతంగా కూడ బయట పెట్టడు! ఇంతకంటే అతన్ని గురించి మరి నేనేం చెప్పలేను!" రామం ముగించాడు.

మిత్రుడిగా రామంమీద నాకెంతో ప్రేమ విశ్వాసా లున్నా ఉస్మాన్‌ని గురించిన అతని కథనం నన్నెందుకనో సంతృప్తి పరచిందిగాదు. అయినా మిత్రుడు బాధపడతా డనే సంకోచంతో మరేమీ యెదురు మాట్లాడలేదు.

రామం మరి రెండురోజులుండి వెళ్ళిపోయాడు.

ఉస్మాన్‌కు నాకు మధ్యగల పరిచయం మరో మెట్టు మాత్రం పైకి వెళ్ళి ఆగిపోయింది.

అది నేను కనుపించినప్పుడల్లా అతడు నాకు నమ స్కారంచేయటం, యాంత్రికంగా నేను దానికి ప్రతి నమ స్కారం చేయటం—అంతే!

రామం ఎంతగా చెప్పినా నేనెంతగా మనసు సరిపెట్టు కున్నా ఉస్మాన్‌మీద నాకెందుకనో నమ్మకం కలిగించలేదు. అందుకు హేతువేమిటో వివరించాలనున్నా నేను అలా చేయ లేను! కారణం, మనసులకు సంబంధించిన అనుభూతులు కొన్ని కార్య కారణాల ఊహాపరిధికి రావేమో!

మరికొన్ని రోజు లలానే గడచిపోయినవి.

ఆ దినం సాయంత్రం ఐదుగంటలయి వుంటుంది. మా పబ్లిషర్‌తో బోలెడంతసేపు బాతాఖాని వేసి ట్రంకురోడ్డు మీద మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తున్నాను. ఎదురుగా

సెంటర్‌లో, టౌన్ పోలీసు స్టేషన్ ముందు జనం గుమికూడి వున్నారు. సెంటరులో గుంపు లుండటం మామూలే నయినా అలా అసంఖ్యాకంగా మూగటం వింతగా కనుపించింది.

"గొడుగులాంటి మనిషోయ్! ఎంతమందిని యెన్ని విధాల ఆదుకునేవా డనుకున్నావ్?" యెవరో తన చుట్టూ చేరినవారితో యెంతో బాధగా చెబుతున్నాడు.

"అంత మంచి మనిషిని మరి మనం చూడలేం!" మరొకరు ప్రక్కనున్న వారితో అంటున్నాడు.

"చూచేందుకు కసాయిసాయిబులా వున్నా హృదయం వెన్నపూసకంటే సుతిమెత్తనైంది" మరొకరి ఆవేదన.

"వెలుగునిచ్చే దీపం తనే హరించుకపోయినట్లై నత్పురుషులు కూడా నండీ!" నే నెరిగిన తెలుగు పండితుడు తోటి అధ్యాపకులతో గాబోలు అంటున్నాడు.

"ఎవరండీ!... ఏమిటండీ!... ఏం జరిగింది!" నేను చాలమందినే అడిగాను. కాని యెవరూ వినిపించుకున్నట్లు లేదు. ఎవరెవరు వారివారి వ్యాఖ్యానాలలోనూ, హడావుడిలోను వున్నారు. ఏలాగైతేనేం ఓ పెద్దమనిషి యిలా చెప్పాడు.

"అయినా మాష్టారూ! ఈ లారీలవాళ్ళకు యేమి చెడుకాల మొచ్చిందో యేమో! పట్టణం మధ్యలో కూడ 'యమ' స్పీడ్‌తో వెళతారండీ! ఎవరో ముసలాడు లారీకింద

బడి 'గుటక్' మనబోయాడు. కాని...యింతలోనే దేము డిలా ఒకతను పరుగెత్తుకుంటూ వచ్చి అతన్ని ప్రక్కకు గిరాటు వేశాడు. కాని ఆ రక్షకుణ్ణే లారీ భక్షించింది" చెప్పాడు.

"ఉస్మాన్...ఉస్మాన్..."

జనంలోనుంచి ఆ మూడక్షరాలువిస్పష్టంగా నాకు విని పించాయి.

ఏవరినో కాపాడబోయి ప్రాణాన్నే బలిపెట్టినవాడు ఉస్మాన్ కాదుకదా! అలా భావన వచ్చిన ఆ క్షణంలో నా కెందుకనో శరీరమంతా జలదరించింది. మనుష్యుల్ని వత్తి గించుకుంటూ ముందుకు త్రోసుకెళ్ళాను. ఎదురుగా చూచిన దృశ్యం నన్ను విభ్రాంతిలో కొయ్యబారేలా చేసింది.

రక్తం మడుగులో వున్నాడు ఉస్మాన్.

గళ్ళచొక్కా రక్తంతో తప్పతడిసిపోయి వుంది.

చారల లుంగీ కకావికలుగా చిరిగిపోయింది.

కానిస్టేబుల్స్ యిద్దరు జనాన్ని ముందుకు రానీకుండా వెనక్కి నెట్టుతున్నారు.

ఎవరినోట విన్నా ఉస్మాన్‌ను గురించిన వింతగాధలే! అత డెందరెందర్ని యెలా రక్షించిందీ, యెవరెవర్ని ఎలా ఆదుకుందీ వింతగా చెప్పుకుంటున్నారు.

నా మనసంతా విషణ్ణమయింది. దూరంగా వెళ్ళి ఒక ప్రక్క నిలుచున్నాను అప్రయత్నంగా నా కళ్ళనుండి అశ్రు

వులు జాలువారినవి. 'ఉస్మాన్! బ్రతికి వుండగా నిన్ను సానుభూతితో అర్థంచేసుకోలేక పోయాను' నా పెదాలు గొణిగాయి.

ఉస్మాన్ ఉదంతం జరిగిపోయి కొన్ని సంవత్సరాలే అయింది. కాని తలచుకుంటే అదంతా యిప్పుడు నా కళ్ళకెదురుగుండానే జరిగినట్లుంటుంది. బాధతో నా మనసంతా సుడి తిరిగిపోయింది.

# అమృత వర్షానికి పిచ్చి మొక్కలు

నాల్గవ వార్డులోని పన్నెండవ నెంబర్ రోగిపరిస్థితి ప్రమాదకరంగా వుంది. అమృత హస్తుడుగా పేరుపొందిన డాక్టర్ మధుసూధనరావు ఒక్క గంట – కాదు, అరవయి నిముషాలు తల బ్రద్దలుకొట్టుకున్నా అతని పరిస్థితి కొద్దిగా కూడ మెరుగు కాలేదు – సరిగదా రోగమేమిటో కూడ సరయిన నిర్ణయానికి రాలేకపోతున్నాడు! డాక్టరుగారు తన పాతికేళ్ళ వైద్యానుభవంలోను ఇంతసేపు, యిలాంటి పరిస్థితికి యేనాడూ గురికాలేదు. ఇతర డాక్టర్లు డాక్టరు ట్రైనీలు రోగిచుట్టూ మూగి డాక్టరు మధుసూధనరావుగారి ప్రయత్నాలను వేయి కళ్ళతో పరీక్షిస్తున్నారు. గది నంతా గంభీర నిశ్శబ్దం తిరుగులేని రాజ్యాన్నిగా మార్చుకున్నట్లు అవుపిస్తున్నది.

మరో ముప్ఫయి నిముషాలు- కాదు- యుగాలు బరువుగా గడచిపోయినవి. రోగిలో కొద్దిగా కదలిక వచ్చింది.

పాలిపోయిన అతని ముఖం బాధగా కంపించుకుంది. డాక్టరు మధుసూధనరావు, తను అప్పుడే రోగికి యిచ్చిన యింజక్షన్ బాటిల్ వైపు మరోసారి చూచాడు అతని పెదాల పైన చిన్న దరహాసం మొక్కటి తళుక్కున మెరిసింది. పెద్ద బరువును దించుకున్నవాడిలా 'వుసు' రని దీర్ఘ నిశ్వాసాన్ని విడిచాయన. చుట్టూ మూగిన వైద్య బృందమంతా 'రిలీఫ్' ను 'ఫీ' ల్ అయింది!

"నర్సులా! నీ డ్యూటీలన్నీ సస్పెండ్ చేస్తున్నాను. ఈ క్షణంనుండి ఈ రోగినిమాత్రమే చూస్తూండు. మన వైద్యవిజ్ఞానానికే యీ రోగి ఒక సవాల్! అవసరమని భావిస్తే ఏక్షణాన్నయినా నాకు కబురుచేయి!" అంటూ మెల్లగా డాక్టర్ ఆ గదిలోనుంచి నిష్క్రమించాడు. ఇతరులు కూడా ఆయనను అనుసరించారు.

వార్డ్ బాయ్ వస్ బ్యాగ్ తో రోగి నొసలు మీద మెల్లగా తడుముతున్నాడు. మంచం ప్రక్కనే వున్న స్టూల్ మీద నిర్మల కూర్చుని వ్యాధిపీడితుని కేసి పరిశీలనగా చూస్తోంది.

రోగి యువకుడే సందేహం లేదు. వయసు పాతికేళ్ళ నుంచి ముప్ఫయ్ అయిదు యేళ్ళవరకు యెంతయినా వుండ వచ్చు! పాలిపోవటంచేత కావచ్చు. దేహచ్ఛాయ తెల్లని

విషణ్ణపంకు ఛాయలో వుంది. అరంగుళానికి పైగా గడ్డం గుబురుగా పెరిగివుంది. కోనదేన దీర్ఘనాశిక, లోతుకు పోయినకళ్ళు-- కళాకాంతులు ముఖంలోనుంచి చేత్తో తుడిచివేసినట్టు- శూన్యం ఆవరించుకున్నట్టు వుంది.

నిర్మల గట్టిగా నిట్టూర్చింది

"ఎవరో అభాగ్యుడు" ఆమె పెదాలు గొణుక్కున్నవి.

మరో పదిహేను నిమిషాలకల్లా రోగి 'అ...మ్మ' అంటూ మూలిగాడు.

కన్నార్పకుండా అతనివైపుకే చూస్తున్న నిర్మల ఆత్రంగా లేచి నిలుచుంది. అతనిముఖం వంకకు తలవాల్చి "ఏమండీ"—అంది. అతడు ప్రయత్నపూర్వకంగా కళ్ళు తెరిచాడు. తనకేసి తనవంకనే చూస్తున్న ఆమె సుందర నయనద్వయంవంక చూచాడు. అతని చూపుల్లో శూన్యం తప్ప మరేదీలేదు. అలాగే- ఆమెవంకే యేదో లోకంలో నుంచి చూచేవాడిలా పిచ్చి చూపులు చూస్తున్నాడతను. నిర్మల ముఖంలోకి చిరునవ్వు తెచ్చుకుంది! ఆమె విశాల నయనాలు చిరుదరహాసంతో పరిపూర్ణములై అమృతమే వర్షించింది. నిర్మల సైగను గమనించిన 'బోయ్' గ్లుకోజు కలిపిన నీళ్ళగ్లాసును ఆమెకు అందించాడు. స్పూన్ నిండుగా ఆ నీటినితీసి సున్నితంగా అతని పెదాల కందించింది నిర్మల అంతవరకు ఆమెకేసే చూస్తున్న అతడు హఠాత్తుగా కళ్ళు

మూసుకొని తన కేమీ అవసరం లేనట్లు తలూపాడు!
'చూడండి! కొద్దిగా తీసుకోండి! చాలా నీరసంగా వున్నారు-
తీసుకోరూ!' అంది ఆమె. ఆమె కంఠంలో నారీ సహజమైన
ప్రేమా, సౌహార్ద్రాలు వెల్లి విరిశాయి. అతడు మెల్లగా తిరిగి
కళ్ళు తెచారిడు! ఆమెవంక కృతజ్ఞతా దృష్టులు హరిస్తూ
'నా కేమీవద్దు! నన్ను చావనీయండి! నన్నెందుకని రక్షిం
చారు' అతని కంఠంలోకి కరకుదనం వచ్చింది. ఆ రెండు
మాటలకే ఆయాసపడిపోయాడు. తిరిగి కళ్ళుమూసుకొని
ప్రక్కకు తిరిగి పడుకున్నాడు. నిర్మల అతనివైపే అలాగే
కనురెప్పలయినా ఆర్పకుండా చూస్తూ ఆలోచిస్తూంది.
ఎవరో- చదువుకున్నవాడిలా, సంస్కార వంతుడిగానే
అవుపిస్తున్నాడు. జీవితంలో యేదో హటాత్కారమైన
విషాద సంఘటనతో తలక్రిందులయినవాడిలా వున్నాడు.
లేకపోతే-- చావనీయకుండా ఎందుకు రక్షించారు. అని
అడుగుతున్నాడు. ఏమిటో? లోకము వింతయింది. అంతకంటె
వింతయినది మానవదృష్టి మానవుడిలో నీడలా ఆశ నిరాశ
లెల్లప్పుడూ అతణ్ణి అంటిపెట్టుకునే వుంటవి. విజేయుడైన
ప్పుడు తనతో సమానులులేరని, అదంతా తన వ్యక్తిత్వ
ప్రభావమేనని తెగ నీలుగుతాడు. విజయగర్వంతో ఉబ్బూత
లూగిపోతాడు- కానీ, తన వాంఛితాలు తలక్రిందులైతే,
తన భావనలు గాలిమేడలుమాత్రమేనని గుర్తిస్తే పాతాళ
లోకంలోకి క్రుంగిపోతాడు. ఏ దురదృష్ట దేవతో తన
అదృశ్య హస్తంతో తన్ను అణగదొక్కుతున్నదని, తన
వ్యక్తిత్వం కొరగాకుండా పోయేందుకు శక్తి మూలకారణం

గాని, తనలోపమేమీ గాదని, ఆత్మవంచన చేసుకొని విల విల్లాడిపోతాడు. నిరాశ జీవితాన్ని ఆవరించుకొంటే ఆత్మ హత్యలపాలు కావటమో, లేక అధోగతిలోకి దిగజారటమో, జరుగుతుంది. నిల ద్రొక్కుకోవాలని, ఆవంతయినా ప్రయ త్నించడు. గుండె నిబ్బరం తెచ్చుకోడు.

రోగి తిరిగి బాధగా మూల్గడంతో నిర్మల తన ఆలో చనల సుడిలోనుంచి బయటపడింది. 'ఏమండీ! కొద్దిగానైనా పుచ్చుకుంటారా? లేక డాక్టరుకు కబురెట్టమంటారా?' ఆమె అతని మంచంమీదకు లాలన, చిరుకోపమూ ప్రదర్శిం చింది.

అతడు తిరిగి కళ్ళు తెరచాడు. ఆమెవంకే నిశ్చ లంగా చూస్తూ పడుకున్నాడు.

నిర్మల స్పూన్‌తో కొద్దికొద్దిగా గ్లూకోజ్ నీరు అతని నోటిలో వేసింది.

మారాంమానుకున్న చిన్నపిల్లవాడిలా అతడు మారు మాట్లాడకుండా పానీయాన్ని త్రాగాడు.

"బుద్ధిమంతుడిలా ప్రవర్తించారు. థాంక్స్" అం దామె అతడివైపు చిరునవ్వు చిందిస్తూ.

"సిస్టర్... మీ పేరేమిటి?... కృతజ్ఞత... చూప వలసింది నేనుగాని... మీరుకాదు. అయినా నేనేమని మీకు కృతజ్ఞత వెలువరించను? నా అంతఃకరణం మిమ్మల్ని ...శపి స్తోంటే ఫార్మాలిటీకోసం మిమ్మల్ని నేను అభినందించలేను

సిష్టర్!... నన్ను క్షమించరూ! రోగి మంద్రస్వరంతో మాటలకోసం వెదుక్కుంటూన్నట్టు ఆయాసంగా అన్నాడు.

నిర్మల అతని మాటల్ని విభ్రాంతితో వింటూన్నదలా ఒక్కసారిగా మేల్కొన్నట్టు వులిక్కిపడి 'ఈ రోజు మరేం మాట్లాడకండి! పూర్తిగా విశ్రాంతికి మీరు భంగం కలిగించారు! ఎందుకోసమని నేను బ్రతకటం...'

నిర్మల ముఖంనిండా కోపం వులుముకొంది. తర్జనితో బెదిరిస్తూ 'మీరు ఇలానే మాట్లాడుతూ వుంటారా?... ఈ మారు నోరు తెరిచారా నేను వెళ్ళిపోతాను. తర్వాత మీ ఇష్టం.!' బెదిరించింది.

"నా ప్రశ్నకు జవాబివ్వనేలేదు సిష్టర్!" రోగి తిరిగి ఫిర్యాదుచేస్తున్నవాడిలా అన్నాడు. ఏమిటన్నట్లు నిర్మల కళ్ళతోనే ప్రశ్నించింది.

"మీ పేరేమిటి? మీది అలకాపురమా లేక కైలాసమా సిష్టర్! మానవుల్లో ఈలాంటి ..." ఆయాసంతో ఆగాడు.

అంతజబ్బు నిరాశలో వుండినా అతని మాటల చమత్కృతికి నవ్వొచ్చిన నిర్మల క్రింది పెదవి పై పంటితో కొరుకుతూ బలవంతంగా నవ్వునాపుకొని— "నా పేరు నిర్మల! మాది అలకాపురమూ కాదు, కైలాసమూ గాదు. వెలుగు- చీకటి, కష్టము- సుఖము, ఆశ- నిరాశ యీ భూప్రపంచంలోనే నేను జీవిస్తున్నాను. చాలా! మరి పెదవి కదిలించకుండా యికపడుకోండి!" తెచ్చుకున్న కోపంతో అంది.

రోగి పెదాలు మెల్లగా కదులాడాయి. ఏదో మననం చేసుకుంటున్న వాడిలా కళ్ళు మూసుకొని వత్తిగిల తిరిగి పడుకున్నాడు.

నాలుగురోజులు గడిచినవి.

రోగి పరిస్థితి రోజురోజుకు మెరుగవుతోంది. ఆస్పత్రిలో ప్రవేశించినప్పటిలా మాటిమాటికీ స్పృహతప్పి పడిపోవటం ఇప్పుడు జరగటంలేదు. అయినా రోజూ ఒకటి రెండు సార్లయినా స్మృతి గోల్పోవడం, అలాంటి సమయాల్లో యేదేదో ప్రలాపించటం యిప్పుడూ జరుగుతోంది.

రోగిపేరు రామారావు. ప్రక్క జిల్లాలోని ధనిక కుటుంబానికి చెందనవాడు. పట్టభద్రుడు. కాలేజీ రోజుల్లోనే తన సహాధ్యాయియైన శిరీష అనే అమ్మాయిని ప్రేమించాడు. శిరీష కూడా రామారావు మనసులో మనసు గలిపింది. రామారావులో అందమూ, ఐశ్వర్యముతోపాటే ఆవేశం కూడా హెచ్చు. శిరీష సాహచర్యంతో రామారావులోని ఆవేశానికి క్రమబద్ధత చేకూరింది. అతడు రచయితగా మంచిపేరుకూడా సంపాదించాడు. ఎలాంటి అడ్డంకులు లేకుండా శిరీషా రామారావుల వివాహం జరిగి

పోయింది. జీవితం వారికొక నందనవనం. పూలబాటలమీద పాటలు పాడుకుంటూ, ఆనందపుటంచులమీద హృదయ సీమల విహరిస్తూంటే నిత్యోల్లాసమైన నవ వసంతంలావున్న ఆ జీవితాన్ని శాశ్వతమని కలలుగంటూ కాలం గడుపు తూండేవాడు.

కాని... కల కరిగిపోయింది. అమృతపాత్రగా భావించుకున్న మధుభాండంలో ఏ అదృశ్య శక్తో విషాన్ని చిలకరించింది 'అది ప్రాణం బిడి దేహం. అది దేహం బిడి ప్రాణం' అనుకున్న ఆనంద దంపతుల జంటను నిర్దయు రాలయిన మృత్యువు వేరుపరచింది. ఆడుతూ పాడుతూ ఆనందంగా తిరుగుతూన్న శిరీష గుండెయాగి మరణించటం నేటికీ నమ్మలేదు పాపం రామారావు! అందుకనే పిచ్చికి-మంచికి మధ్య హద్దులోని అంచులమీద నడయాడు తున్నాడు. బ్రతుకుమీద ఆశపోగొట్టుకున్నవాడి ఆరోగ్యం చెడటం సహజమైన విషయం. అతడిప్పుడు బికారి, దేశ దిమ్మరి, రోగిష్టి— ఏదో రోడ్డుపైన స్పృహతప్పి మృత్యు దేవత చల్లని హస్తాల్లో చిరుపాపలా అవుపించే అతడ్ని దాటినబోతూన్న లారీ మనుషులు దయతలచి తెచ్చి హాస్పి టల్లో వదిలి వెళ్ళారు.

రామారావు గతాన్ని గురించి విన్న నిర్మల హృద యం తరుక్కుపోయింది. ఆమె నయనద్వయం అశ్రుపూరిత మైంది. ప్రతిభావంతుడైన డాక్టర్ మధుసూధనరావు రోగనిర్ణయం చేయలేక పోయాడంటే యిప్పుడామె వేమీా

ఆశ్చర్యపడలేదు దైహికమైన జబ్బులను పసిగట్టే నేస్తు మాత్రమే డాక్టర్లకుంది. ఆశ లంతరించి శూన్యమైన భవిష్యత్తు నూహించుకొని అనుక్షణం బేలపడిపోయే మనో రోగికి మందేమిటి? బాహిరమైన అనుపానాలు తాత్కాలి కోపశమనం కలిగించవచ్చు. అంతే! తద్వారా రోగి అనుభవించే మానసిక అశాంతిని మరింత పొగడవచ్చు! ఈలాంటివారి పరిస్థితి బాగుపడాలంటే వైద్యం వారి దేహా నికి కాదు హృదయానికి ఇవ్వాలి! జీవితంపై ఆశ చిగురింప జేయాలి! అప్పుడే అదిసాధ్యమవుతుంది. అలా తలపోసిన నిర్మల తన మనసులో ఏదో నిర్ణయానికి వచ్చింది. ఆమె పెదాలపై ఒక చిరుదరహాసం తళుక్కుమని మెరిసింది. ఆ చిరునవ్వులో త్యాగం, సేవాపరాయణత, తద్వారా లభ్య మయ్యే ప్రశాంతి ఆత్మ పరితృప్తి వ్యక్తమయినవని మనో శాస్త్రజ్ఞుడెవరయినా యిట్టే గ్రహించగలడు.

ఆ సాయంకాలం రామారావుకి హార్లిక్స్ గ్లాసు అందిస్తూ వుంటే 'ఎందుకండీ! నన్నిలా సత్కరిస్తారు? అవసరమైతే నేనే అడిగిపుచ్చుకోనా?' అన్నాడతను.

నిర్మల మృదంగా నవ్వుతూ 'మీ అవసరాలు మీరు గుర్తించుకునే దశకోసమే నేను యెదురుచూస్తూ వున్నాను.' అంది.

ఆమె మాటలు విన్న అతడు తృళ్ళిపడ్డట్టు ఆమె వంక తలెత్తి చూశాడు. ఆమె కళ్ళలో ప్రేమ సౌహార్ద్రాల పరిపూర్ణ కాంతి వెల్లివిరుస్తున్నట్టుంది. చిరుదరహాస ఆమె

వదనంమీద తారాడుతూనే వుంది. ఆమె సూటిగా తన్ను చూస్తున్న అతని కళ్ళలోకి చిరునవ్వుతో చూస్తూ 'అవునండి! అలాంటి శుభఘడియకోసమే నేను యెదురుచూస్తూ వున్నాను.' వత్తి పలికింది. ఆమె గొంతుకలో దృఢత్వం ఖంగుమని మ్రోగింది. తన కర్తవ్య నిర్వహణంలో ఆషామాషిగా యేదో పూరించుకోసం అన్నమాటలవని భావించుకునేందుకు కూడ వీలుకానట్టి ఆ దృఢత్వం రామారావును సంభ్రమంలో ముంచింది.

ఆమె చేతిలోని గ్లాసునందుకొని అతడా హార్లిక్స్‌ను గటగట త్రాగేశాడు.

"నేటికి నాల్గు రోజులైనా మీ పరిచయాన్ని యే నాడు మరువలేను. సిస్టర్! మీ పేరుకుతగ్గదే మీ అంతః కరణముకూడా. కాని..." అతని గొంతు గద్గదమైంది. విషాదచ్ఛాయలు అతని హృదయాన్ని అన్నివైపులనుంచి వచ్చి కౌగిలించుకున్నట్లుంది.

"...కాని మీ పవిత్రమైన కాలాన్ని నాకోసం వినియోగించటం ప్రయోజన రహితం నిర్మలా!" అంటూ వెంటనే తప్పు గుర్తించినవాడిలా 'సిస్టర్' అన్నాడు.

నిర్మల చిన్నగా నవ్వింది. 'నన్ను పేరుతోనే పిలవండి! అదే నా కానందం!' అంది.

తలగడలానుకొని కూర్చున్న రామారావు మౌనంగా నిర్మలవైపు చూస్తూ కూర్చున్నాడు. నిర్మల నిర్మలమైన జలాశయంలా గంభీరమైన ప్రశాంతిని గుర్తుకు తెస్తుంది. వయసు పాతికేళ్ళకంటే మించదు. లేత పసిమి రంగులో చక్కని అవ

యౌవన సౌష్ఠవంతో వికసించిన గులాబి పుష్పంలాగుంది. విశాలమైన ఆమె నయనద్వయంలో కాంతి రేఖలు ఆనవరతమూ నడయాడుతూ వుంటేని 'దివినుండి భువికి దిగివచ్చిన దేవతామూర్తిలాగుందే' అని మనసులోనే అనుకున్నాడు రామారావు.

"రామారావుగారూ!"

నిర్మల పిలుపుకు వులిక్కిపడ్డాడు రామారావు.

"చూడండీ, సుఖదుఃఖాల మిశ్రితమే జీవితం. భగవానుడి యితర సృష్టికి, మానవుడికీ గల భేదమల్లా మానవుడికి పెట్టని వరమైన హృదయం—ఆ హృదయంలో ఆలోచనాశక్తి! మీరు విద్యావంతులు, సంస్కారమున్నవారు. మీరే మామూలు యిక్కట్టుకు యిలా డీలపడిపోతే, మరి సామాన్య మానవుల మాటేమిటి? ధైర్యం తెచ్చుకోండి! చేజేతులా జీవితాన్ని ఆహుతి చేసుకోకండి!" మెల్లని స్వరంతో అందామె.

"హూ...మామూలు యిక్కట్టు! నిర్మలా! క్షమించు వేదాంతగ్రంథాలు నేనుకూడా చాల చదివాను. పఠనా సమయంలో అవెంతో వాస్తవికంగా కనుపించి ఆత్మ సంతృప్తిని కల్గిస్తవి. కాని...వాస్తవిక జీవితంలో... శశిని నెలా మరువగలను? అనుకున్న ఊహాసౌధాలన్నీ కళ్ళముందే గాలిమేడలై కూలిపోతేనే నే నెలా భరించేది? నా జీవితానికి అర్థమేమిటి? ఎవరికోసం నేను జీవించాలి?" అతను మాట్లాడుతోంటే అతని గొంతుకలో కన్నీళ్ళు పారాడుతూ

వున్నట్లున్నవి. మాటలు ఆపిన మరుక్షణంలోనే అతని కళ్ళ నుండి అశ్రుధారలు జాలువారినవి.

నిర్మల తన చేతిగుడ్డతో సున్నితంగా అతని కళ్ళను తుడిచింది. ఆప్యాయంగా అతని శిరోజాలను నిమురుతూ 'పిచ్చివాడా! ఇక పడుకో!' అంటూ అతన్ని పడుకోబెట్టింది. అంత దుఃఖంలోను రామారావు ఆమె ప్రేమ భావనకు హృదయంలోనే పులకరించిపోయాడు. అమృతమయమైన హస్తస్పర్శ అతని వేదదీర్చినట్లయింది. రామారావు చిన్ననాటనే మాతృమూర్తిని పోగొట్టుకున్నాడు. ప్రేమమూర్తియైన ఆప్యాయత, ప్రేమ అతడు ఒకే ఒక వ్యక్తి చేత మాత్రమే యెరిగి వున్నాడు. ఆమె శిరీష. కాని... రెండేళ్ళయినా పూర్తిగా నిండకముందే విధి వారిని వేరుచేసింది. కాని...నేడు నిర్మల చూపిన ఆప్యాయతతో రామారావుకు తిరిగి శిరీష తలపుకొచ్చింది!

ఆ సాయంకాలం రోగిని పరీక్షించేందుకు వచ్చిన డా. మధుసూదనరావు తృప్తిగా చిరునవ్వు నవ్వి నిర్మలను ఆప్యాయంగా అభినందించాడు. రామారావులో వచ్చిన మార్పు డాక్టర్ ఆశించినంతకంటే యెంతో యెక్కువగా వుంది. నిర్మల పదినిముషాల పాటు డాక్టర్‌తో సంప్రదించింది. డాక్టర్ తలూపుతూ 'అవును నిర్మలా! మన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చామనే యాంత్రిక సంతృప్తే మనకు పరమావధి కారాదు. ఎంతో నిర్మలంగా పనుకొని జీవితంలో మనం సాధించిన విజయాలని బేరు వేసుకోవాలంటే ఇలాంటి క్లిష్ట బాధ్యతలు మన [illegible] నెత్తిన వేసుకొని సాధించిననాడే---' రామారావుకు స్పెషల్

వార్డ్‌లోకి మార్పించు! నీ ప్రయత్నంలో కృతార్థురాలివి కావాలని ఆశిస్తున్నాను. విష్ యూ గుడ్ లక్' అంటూ డాక్టర్‌గారు వెళ్ళిపోయారు. 50 పడిలో పడ్డ నిత్యోత్సాహంతో యువకుల మనస్తత్వాన్ని గుర్తుకు తెస్తూ మితిలేని జ్ఞాన తృష్ణతో నిత్య పరిశోధనలు చేశాడు. మధుసూధన రావుగారిని మనసారా తనలో తానే అభినందించుకుంది నిర్మల.

మరో గంట తిరిగేసరికల్లా రామారావు పడక స్పెషల్ వార్డులోకి మారింది. విశాలమైన హాలు- పాలతాతి వంటి గోడలు- మంద్రమైన కాంతినిచ్చే బ్లూలైటు- మంచి పర్నిచర్- చిన్న రేడియో - స్పెషల్‌వార్డు సర్వసౌకర్యాలతో అధునాతన నాగరికుడైన ధనికుని యింటి హాలును గుర్తుకు తెస్తోంది.

"నిర్మలా! ఏమిటీ మార్పు?" రామారావు నిర్మల వంక చూస్తూ ప్రశ్నించాడు.

నిర్మల తల ప్రక్కకు తిప్పుకుంటూ 'డాక్టరుగారి ఆవేశం,' క్లుప్తంగా అంది.

అతడు తన జేబులోంచి చిన్న కాగితాన్ని తీసి ఆమె కందిస్తూ 'ఈ అడ్రస్‌కు అయిదువందల రూపాయలు టి. యం. వో. చేయమని టెలిగ్రాం యిప్పించు నిర్మలా!' అన్నాడు.

నిర్మల కాగితంలోని చిరునామను విస్ఫారిత నయనాలతో చూస్తూ అంగీకారం సూచకంగా తలూపింది.

నెల రోజులు గడిచిపోయినవి.

ఈ నెలరోజుల్లోనే రామారావులో పూర్తి మార్పు వచ్చేసింది. శుష్కమైన అతని వదనంలోకి మామూలు కళాకాంతులు వచ్చినవి. అతని దేహం కాంతివంతమైంది. అతన్ని ఆవరించుకున్న నిరాశా నిస్పృహా మేఘాలు క్రమ క్రమంగా మంచుమబ్బులా మాయమైనవి. శిరీష అతని స్మృతిపథానికి అప్పుడప్పుడువచ్చి అతడు ఖిన్నుడౌతున్నా అనవరతమూ అదే ధ్యానతో క్రుంగిపోవటంలేదిప్పుడు. నిద్రాసమయంలో రాత్రులందు తప్ప మిగతా సమయాలలో నిర్మల ఒక క్షణం అవుపించకపోతే విలవిల్లాడుతాడిప్పుడు. నిర్మల ఒక జ్వాల. నిరాశాంధకారంలో ఆ జ్వాల ఆశా ప్రదీపాన్ని వెలిగించింది. జ్వాల తను ఆహుతయిపోతూనే చుట్టూ కాంతిపుంజాల్ని నింపుతుంది!

"నిర్మల్!" రామారావు ఆమెను పిలిచే తీరది.

"ఏమండీ!" ఆ పిలుపుకు వెంటనే జవాబిస్తూంది. నిర్మల. అతని కళ్ళలోకి చూస్తూ ఆనందపరవశురాలవుతుంది రామారావు ఆమె కళ్ళలోకి చూస్తూ తన్మయుడౌతాడు. నిర్మల ఆనందపరవశంలోను, రామారావు తన్మయతలోను భిన్నమైన భావాలు అంతర్గతంగా వున్నాయని గ్రహించటం సులువైన విషయమేంకాదు.

"నిర్మల్! జీవితం తిరిగి యిన్నినాళ్ళకు నాకు నూతనంగా అవుపిస్తోంది. ఏదో తెలియని ఆకర్షణ నన్ను సూదంటురాయిలా లాగుతోంది నాలో తిరిగి మునుపటి ఆవేశం మోసులెత్తుతోంది నిర్మల్... అనుగో... ఆ టేబుల్ మీదం రైటింగ్ పాడ్‌ను యిలా యివ్వు!" స్పెషల్ వార్డు వరం

డాలో యీజీ ఛైర్‌లో పడుకొన్న రామారావు ఒకనాటి సాయంకాలంలో అన్నాడు.

ప్రక్కనే కుర్చీ కూచొని సాయం సంధ్యకేసి చూస్తున్న నిర్మల మెల్లగా నవ్వి అతనివైపు సూటిగా చూచి "హృదయంలోని కవికుమారుడు మేల్కొన్నాడా!" ప్రశ్నించింది.

"హృదయ తంత్రుల్ని కంపింపచేసే ఆవేశం ఎదురుగా వున్నప్పుడు నాకేమిటి ఎవరికైనా కవిత్వం వస్తుంది నిర్మల్!" రామారావు ఆమెవైపు లాలసా దృష్టుల్ని బరుపుతూ అన్నాడు.

నిర్మల ముఖం త్రిప్పుకొని తనలో తానే నవ్వుకొంది.

"ఎంత స్వార్థపరురాలవు నువ్వు నిర్మల్! ముత్యాలొలుకబోసే నీ మునిముని నవ్వులు యీ దీనుడు చూచి ఆనందించుకునేందుకు అనర్హుడనా ప్రక్కకు తిరిగి నవ్వుకుంటున్నావ్!" ప్రశ్నించాడు రామారావు.

రామారావు ప్రశ్నతో నిర్మల ముఖంలో నవ్వు దొంతరలు మాయమయినవి. మామూలు గంభీరత ఆ ముఖాన్ని ఆవరించుకుంది. అయినా ప్రయత్న పూర్వకంగా అతనివైపుకు తిరిగి ఒక చిరునవ్వును చిందిస్తూ 'పాడ్' కోసమని గదిలోకి నడిచింది.

ఆ రోజు రామారావు కొద్ది నిమిషాల్లోనే రెండు గేయాలు వ్రాశాడు.

అతడు తాను వ్రాసిన కవితను భావయుక్తంగా నిర్మలకు వినిపించాడు. ఆ గేయాలు విన్న నిర్మల హృదయం విస్మయానందాలతో వుర్రూతలూగింది. భావము, భాష

సమపాళ్ళలో మేళవించబడి ఎంతో హృద్యమంగా వున్నవి గేయాలు. ప్రకృతిలో లీనమైన కవిహృదయానికి ఆనంద వివశుడై సౌందర్యారాధనం చేసిన గేయమొకటి. మరొకటి విరహిణియైన స్త్రీని ప్రకృతికి పోల్చి భగవానుణ్ణి ప్రియునిగా ఆరాధింపచేసిన గీతమొకటి.

"ఇలా యివ్వండి!" నిర్మల ఆ కాగితాల్ని పుచ్చుకొని మననంచేసుకుంటూ కూర్చుంది. రామారావు ఏకాగ్రతగా తన కవితను పఠిస్తున్న ఆమె కేసి తదేకంగాచూస్తూ కూర్చున్నారు.

"నిర్మల్!"

రామారావు నిర్మలనుగురించే ఆలోచిస్తున్నాడు హాస్పిటల్లో నర్సుగా పనిచేస్తున్న మామూలు స్త్రీ గా దీమె. ఈమె నిజంగా దేవతామూర్తి. అభినందించతగ్గ అందం, అందానికి తగ్గ సంస్కారం- అన్నింటికంటే మిన్నయైన నవనీత కోమల హృదయం— కాదీమె మామూలు స్త్రీ!' అనుకున్నాడు రామారావు. అతడామెగురించి తన ఆలోచనలు పొడిగించుకోబోతున్న వాడల్లా హఠాత్తుగా ఆగి ఆమెవంక చూచాడు.

మంద్రమైన మధుర స్వరంతో నిర్మల ఆ గీతాల్ని గానం చేస్తోంది. ఆమె గొంతుకలోని మార్దవము, ఆమె పాడుతున్న రాగాలని, ఆలాపిస్తున్నప్పుడు ఆమె వేస్తున్న సొక్కులు- రామారావు ముగ్ధుడైపోయాడు. వేణునాదంతో పరవశమయిన గోకులంలోని గోవులా తల ఆడిస్తూ కూర్చున్నాడు. కొంతసేపటికి గాన ఝరి ఆగిపోయింది. అయినా రామారావులోని వివశత్వం అలానే వున్నట్లుంది. కన్నార్ప

కుండా అలానే చూస్తూ కూర్చున్న వాడల్లా 'చలిగాలి వీస్తోంది. లోనికి పదండి!' అన్న ఆమె మాటలు విని వులిక్కిపడ్డాడు.

మరో రోజు- నిర్మల రామారావులు వాహ్యాళి కెళ్ళారు. నది కావలివైపున ఆకుతోటలు పచ్చగా మెరిసి పోతున్నవి. నదిలో నీరు ప్రశాంతంగా ప్రవహిస్తున్నది. అస్తమిస్తున్న అరుణ భగవానుడు పడమటి ఆకాశాన్ని రాగరంజితంచేసి సంధ్యాదేవితో సయ్యాటలాడుతున్నట్లు న్నాడు. ఆకాశంలోని అరుణిమ నదీజలాల్లో తన ఛాయను చూచుకుంటూ మురిసిపోతున్నది. వారిద్దరు ఆకాసానికేసి, ఆకుతోటలకేసి చూస్తూ ప్రకృతిలో పరవశమయిపోతూ వున్నారు. ఇద్దరిమధ్య ఆ సాయంకాలంలాగే గంభీరత మౌన రూపంలో ప్రశాంతత కావలమైవుంది.

అలానే దాదాపు అర్ధగంట గడనిపోయింది.

"నిర్మల్ ప్రకృతి ఎంత అందంగా వుందోచూడు! మరో ఘడియలో మబ్బుముంచుకొనివచ్చి లోకాన్ని చీకట్లు ఆవరించుకోకుండా యిలాగే శాశ్వతంగా వుంటే..."

"ఇలానే శాశ్వతంగా వున్నా ఉపయోగమేముం దండీ రామారావుగారూ! మనిషి మనసులోమార్పురానంత వరకూ ఏమీ ఉపయోగము డదు. అందని అంశాలను ఆరా దించేందుకు బహులు అందుకోవాలని, లోకంలోని ఆనందా న్నంతా ఎవరంతకువారే మరొకరికి మిగల్చకుండా స్వాహా చెయ్యాలని ఆరాటపడటమంటూ వుండేవరకు యేమీలాభం

లేదు. వీలుగాక ఊరుకున్నాడు గాని చాతనైతేనా సంధ్య నొకడు తెచ్చి తన పెరటిలో బంధించుకుంటాడు. చల్లగాలిలో మరొకడు లాభాలు సంపాదించాలని చూస్తాడు. మానవ నైజం మారితేనే ఈ అందాల్లోని రమణీయకత అందరికి అర్థ మయేది."

రామారావు నిర్మల మాటలకు విభ్రాంతుడయ్యాడు. ఆమె పలుకుల్లో యేదో మర్మం వున్నట్టు పసిగట్టనవాడై మాట్లాడలేకపోయాడు. ఆలోచిస్తూ యిసుకలో అలానే కూర్చుండిపోయాడు.

"వెళదాం పదండి!" మరెంతసేపటికో నిర్మల మాటలు విన్న రామారావు మౌనంగా లేచి ఆమెను అనుస రించాడు.

బ్రెడ్, జామ్, ఎర్రటి యాపిల్ పళ్ళ ముక్కలున్న పళ్ళెం ఒకచేతిలో, పాలగ్లాసును మరో చేత్తోను పట్టుకవచ్చి రామారావుముందుంచింది నిర్మల. వ్యాహ్యాళినుంచి తిరిగి వచ్చినప్పటినుంచి అతను నోరెత్తి పలుకనేలేదు. ఒకటి రెండుసార్లు నిర్మల యేదో మాట్లాడినా 'అవును' 'కాదు' అన్నట్లు తలూపాడు. అంతే! వారిద్దరి పరిచయమైన యీ రెండు మాసాల్లోనూ వారిద్దరి మధ్యా యిలాంటి పరిస్థితి యేనాడు సంభవించలేదు.

రామారావు తన ముందుంచిన ఫలహారాలవైపు వూరకే చూస్తూ కూర్చున్నాడు.

నిర్మల అసహజమైన ఆ వాతావరణాన్ని మార్చా లనే ఉద్దేశ్యంతో బుద్ధిపూర్వకంగా చిరుదరహాసాన్ని ముఖం మీదకు తెచ్చిపెట్టుకుంటూ 'ఏనండీ! మరో క్రొత్త కవితను ఏమైనా వ్రాయాలని ఆలోచిస్తున్నారా? ఈ దినం మరింకేం ఆలోచించకండి ఆరోగ్యం పాడవుతుంది. రేపు వ్రాస్తారు గాని!' అంది.

కాని ఆమె మాటలు ఆమెకే అసహజంగా ధ్వనిం చాయి.

రామారావు మౌనంగా నవ్వాడు.

"ఎనిమిదవుతోంది. నేను వెళ్ళివస్తాను. గుడ్‌నైట్!" రోజులాగే ఆమె రామారావుకు విష్‌చేసి వెళ్ళిపోబోయింది.

"నిర్మలా...!"

రామారావు పిలుపు క్రొత్తగా వినిపించింది. ఆమె వెనుదిరిగి చూచింది.

రామారావు ఏదో కృత నిశ్చయానికి వచ్చినట్లు అతనిలోని ఆలోచనలు అంతమయి ఒక నిర్ణయానికి వచ్చి నట్లు అవుపిస్తున్నా ఆ నిర్ణయాన్ని వెలిబుచ్చేందుకు జంకుతూ వున్నట్లు వుంది.

నిర్మలముఖం వివర్ణమయింది. 'భగవాన్!' ఆమె పెదాలు అప్రయత్నంగా చిన్నగా గొణిగాయి. రామా రావు ఇదేమీ గమనించలేదు. 'రెండు నిముషాలు యిలా కూర్చో నిర్మలా!' అతడు ఆమెకు తన ముందున్న కుర్చీని

చూస్తూ తనలో తానే గొణుక్కున్నట్లు అన్నాడు. నిర్మల తలవంచుకొని కుర్చీమీద కూర్చుంది రెండు నిము షాలు గడిచిపోయాయి! కాలం తన గమనాన్ని మరచి ఆగి పోయినట్లుంది. మౌనంకూడ భీతావహమైందేమో? ఉన్న ట్టుండి కూర్చున్న వాడల్లా సుడిగాలిలా గభ్భున లేచాడు రామారావు. బలిష్టమైన అతని హస్తద్వయం నిర్మల రెండు భుజాలను పట్టుకోవటం, మెరుపు వేగంలో సంభవించింది. ప్రళయ ఝంఝూమారుతానికి చిగురుమొక్కలా నిర్మల విహ్వలురాలయింది. రామారావు గబగబా అనేశాడు. "నిర్మల్" మృత్యుముఖంలోవున్న నన్ను నీవు రక్షించావు. నీవు నా జీవనదాతవు నిర్మలా! ఎండిన నా జీవితానికి నీ సాహచర్యంవల్ల నవ వసంతం వచ్చింది. నీవు లేకుండా నేను జీవించలేను నిర్మలా! చెప్పు, నీకే రక్షింపబడిన ఈ ప్రాణి నిన్నర్థిస్తోంది. అభ్యంతరం లేకపోతే నిన్ను నా సహధర్మ చారిణిగా స్వీకరించాలని అనుకుంటున్నాను. నీ నిర్ణయాన్ని వినిపించు నిర్మలా! ఆరని కుంపటిలా ఈ ఆలోచనను నేనింక హృదయంలో దాచుకోలేను నిర్మలా!" అతని శరీరం ఉద్రే కంతో వూగుతుంది. కళ్ళు ఎర్రగా మెరుస్తున్నాయి! నాసికా పుటాలు ఎగిరెగిరి పడుతున్నట్లున్నవి.

నిర్మల గట్టిగా తన అధరాన్ని నొక్కుకుంది. సున్ని తంగా ఆమె అతని చేతుల్ని విడిపించుకుంది. 'ఈ రాత్రి నన్ను ఆలోచించుకోనీండి! ఉదయం వస్తూనే నా నిర్ణయం చెబుతాను!' అంటూ మరి తిరిగి చూడకుండా ఆమె గబ గబా అడుగులువేసి చీకట్లో కలిసిపోయింది.

# 4

రోజూ సూర్యోదయంతోపాటు తనూ వస్తున్న నిర్మల మరునాడు రాలేదు. రామారావుకు ప్రతిక్షణం ఒక యుగంలాగుంది. మరికొద్దిసేపటిలో పనికుర్రాడు ఒక కవరు తెచ్చి రామారావు చేతికందించాడు. వేకువజామునుంచి నిర్మలకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్న అతడు కొద్దిగా విసుక్కొని కవరు చించాడు.

"రామారావుగారూ! మా తల్లికి సంతానం ఇద్దరు. నేను, మా అన్నయ్యాను. మా అన్నయ్య అమృతమూర్తి. నన్నెలా ప్రేమించేవాడో వ్రాసేందుకు నాకు మాటలురావు. అలాంటి అన్నయ్య రెండేళ్ళక్రిందట హఠాత్తుగా మరణించాడు మిమ్మల్ని లారీ మనుషులు హాస్పిటల్‌కు తెచ్చినపుడు నేనక్కడే వున్నాను. మా అన్నయ్య మరణాన్ని నేను కళ్ళారా చూడకపోయేవుంటే మీరే మా అన్నయ్య ని భ్రమించేదాన్ని.

వైద్యశాస్త్రంతో పరిచయమున్నవారికి జిజ్ఞాస కలిగించింది మీ జబ్బు! పైగా మిమ్మల్ని చూచే భారం పూర్తిగా నా మీద వేశారు డాక్టరు మధుసూధరావు గారు. మీ చరిత్ర వినటం--- ముమ్మూర్తులా మీరు మా అన్నయ్యను పోలివుండటం --- యీ రెండు కారణాలు నేను మీ యెడ ప్రత్యేకశ్రద్ధ తీసుకునేందుకు కారణాలయినవి.

దైహికంగాకంటే, మానసికంగా మీరెక్కువ బాధపడు తున్నారని, మీ మానసిక వ్యధను పూర్తిగా తొలగించ నిదే మీ దేహారోగ్యం బాగుపడదని డాక్టర్‌గారికి మిమ్మల్ని గురించి నా అభిప్రాయం తెలిపాను. అంతేగాక మీకు మా అన్నయ్యకిగల పోలికల్ని గూడ తెలిపాను. డాక్టరుగారు ప్రతిభావంతులు. మానసిక సంబంధమైన వ్యాధుల్ని గురించి రీసెర్చికూడా చేస్తున్నారు. "అమ్మా! మరోలా భావించకు! జీవితాశ అడుగంటిన అతడిలో తిరిగి ఆశ రగుల్కొలిపితే అతడు మామూలు మనిషవుతాడు అతడే మీ అన్నయ్యనుకో! నీవు గట్టిగా కృషి చేయగలిగితే అతడిని తిరిగి మామూలు మనిషిని చేయగలవు. నీ జీవితానికి ఇదొక మహత్కార్యంగా భావించుకొని ప్రయ త్నించు తల్లీ!" అన్నాడు. "క్షమించండి రామారావు గారూ! ఆ రాత్రే యింటిలో నా భర్తతో కూడ ఆలోచిం చాను. నాకు పెళ్ళయినట్లు, రెండేళ్ళ బిడ్డకు నేను మాతృ మూర్తిని అయినట్లు మీకు చెప్పనే లేదు! నా భర్త విశాల హృదయులు. డాక్టరుగారిలానే వారూ నన్ను ప్రోత్సహిం చారు. వారిద్దరి ప్రోత్సాహమే లేకపోతే నేనీ సాహస కార్యానికి పూనుకోను. ప్రమాణంచేసి చెబుతున్నాను. అలాగని నేను ఇన్ని రోజులు చేసింది వృత్తనటన అని భావించమాకండి మరణించిన మా అన్నయ్య స్థానంమీకు హృదయంలో నేనిచ్చాను. చిత్తశుద్ధితో మీకు సేవచేయ గలిగాను. కాని--- నేనందమయిన స్త్రీని, యవ్వనవతి ని మీరు యువకులు, నేనూహించిన భయం నిజమయింది

నా యెడ మీ దృష్టినాకు నెల క్రిందటే అర్థమయింది. కానీ మీరింకా పూర్తిగా కోలుకోలేదు. అందుకని మిన్నక వూరుకోవటమేమిటి- త్వరగా మీలో పూర్తిగా కళా కాంతులు ఆవేశం కలిగి ఈ ఆట వీలయినంత త్వరలో అంతం కావాలనే దృష్టితో ఒక విధంగా ప్రోత్సహించాను కూడా నేమో! అన్నయ్యా! ఈ చిన్న ఉత్తరంలో నాలో పెల్లుబుకుతున్న భావాలను ఎలా వెలువరించను. మీలాంటి అన్నయ్యనాకు లభ్యమైనందుకు నేనెంతగా గర్విస్తున్నానో యెలా చెప్పగలను? మీ ప్రతిభను మీరు గుర్తించుకోలేక పోతున్నారు. కవితాశక్తి మీకొక వరం అన్నయ్యా! నా జీవితంలో మీ రెండు గీతాలను ఏ నాడూ మరచిపోలేను. దైవ సాక్షిగా చెబుతున్నాను. రోజూ ఆ గీతాలను మననం చేసుకుంటున్నానంటే నమ్మండి. ఆ గీతాలను నేను పాడుతూ వుంటే విన్న మీ బావగారు మీ కవితాశక్తికి ముగ్ధులయ్యారు. మిమ్మల్ని చూడాలని ఉవ్విళ్ళూరుతున్నారు కూడ. దేశానికి మీలాంటివారి ప్రయోజనం ఎంతయినా వుంది. ప్రేమను గురించిగాని, స్వార్థరాహిత్యానికి మారుపేరయిన ఉపపత్ని పదానికి నిర్వచనంగాని నాబోటిదానితో చెప్పించుకోదగ్గవారు కాదు మీరు! ప్రాజ్ఞులు! నేను మిమ్మల్ని కోరేదొకటే! యథార్థం మీ ముందు వుంచుతున్నాను. బాగా ఆలోచించండి! తర్వాత కూడా నేను చేసింది తప్పేనని భావిస్తే నన్ను క్షమించి మర్చిపోండి. అలా కాకుండా నా ప్రవర్తనలో విజ్ఞత వుందని భావిస్తే

మీ చెల్లెలి గృహద్వారం ఎల్లప్పుడూ మీకు స్వాగతం చెబుతూ వుంటుంది. నా సోదరునికి మించిన సోదరుడు నాకు లభ్యమయినాడనుకున్న నా ఆశను నిరాశ చేయరుగదూ

మరేం వ్రాయనన్నయ్యా!

నీ చెల్లెలు
నిర్మల.

ఉత్తరం చదువుకున్న రామారావు ముఖంలో రంగులు మారాయి. అతని మస్తిష్కం తీవ్రంగా పనిచేసింది అతని హృదయ స్పందనం రెట్టింపు వేగంతో అల్లల్లాడింది ఉత్తరం మడిచి అతడు ఐదు నిముషాలు గట్టిగా తల పట్టుకున్న వాడల్లా హఠాత్తుగా కళ్ళు విస్ఫారితం చేసి పిచ్చివాడిలా "ఆమె నా సోదరి! నా జీవన దాత! అమృత వర్షానికి పిచ్చిమొక్కలు మొలవరాదు" గట్టిగా గొణిగాడు.

అప్పుడే గదిలో అడుగుపెడుతున్న డాక్టరు మధుసూధనరావుగారు ఆ మాటలు విని ప్రఫుల్లవదనులయ్యారు.

# మాతృహృదయం

గదిలోని దీపంలో కిరసనాయిల్ నిండుకుందేమో, సన్నగా వెలుగుతోంది. ఆ గుడ్డివెలుతుర్లో ఒక తల్లి మంచంమీదకు వంగి కూర్చొని వుంది. ఆమె ముఖంలో విచారరేఖలు నడయాడుతున్నవి. మూర్తీభవించిన విషాదాధి దేవతలాగుంది. నవమాసాలు మోసి, కని, అంతవరకు పెంచిన తన శిశువు మృత్యు సాన్నిధ్యంలో వుంది. ఊపిరి పీల్చుకోవటం ఆశిశువుకు కష్టసాధ్యంగావుంది. భారంగా ఉఛ్వాస నిశ్వాసలు కొనసాగుతున్నవి. తల్లి తన బిడ్డ ముఖంలోకి కనురెప్పలు కూడ ఆర్పకుండా అలాగే నిశ్చలంగా చూస్తోంది. ఆమె కళ్ళలో కన్నీరులేదు. స్రవించి స్రవించి ఇంకిపోయినట్లుంది.

చేరవేసిన తలుపు కిర్రుమంది. దృఢకాయులయిన ఒక వృద్ధుడు వొంటినిండా ఓవర్‌కోటుని కప్పుకొని లోనికి

ప్రవేశించాడు. ఆ కోటుమీది మంచుబిందువులు క్షీణకాంతిలోకూడా మిల మిలా మెరుస్తున్నవి. పలుకు తోడుకూడ లేకుండా ఒంటరిగా, చావుతో పోరాడుతున్న కన్న శిశువు ముందు కూర్చున్న తల్లికి వృద్ధుని రాకతో మన సెందుకో కొద్దిగా తేలికపడ్డట్టయింది. ప్రక్కనున్న పాత కుర్చీని యీడ్చుకొని వృద్ధుడు మంచంముందే కూర్చున్నాడు. దుఃఖార్తితో నున్న తల్లి ముసలివాని ముఖంలోకి చూస్తూ 'దయామయుడైన భగవానుడు నా బిడ్డను తప్పక రక్షిస్తాడు గదూ!' అంది.

ఆ మాతృ హృదయం తనలో లేని విశ్వాసాన్ని తనే పూరించుకుంటూ ఆగంతకుడు కూడ ఆ విశ్వాసాన్ని బలపరచాలని కోరుతోంది.! జవాబుగా ఆ వృద్ధుడు తన తలను అదో మాదిరిగా వూపాడు. 'అవును,' 'కాదు' అనే రెండర్థాలూ ఆ తల వూపులో ఎటుయినా సులభంగా ఊహించుకోవచ్చు! ఆతృతతో వృద్ధుని గమనిస్తున్న కన్న తల్లి కళ్ళలో కన్నీరు మిలమిలా మెరిసింది! అలా చూస్తున్న ఆమె రెండు కళ్ళు గిర్రున తిరిగినట్లయింది. వేయి సమ్మెటలతో తన తల నెవరో బ్రద్దలుచేస్తున్నట్లనిపించింది. కూర్చున్న కుర్చీ కలాగే చేరగిలపడి ఆమె ఒక నిముషం పాటు కన్నులు మూసుకుంది.

"ఏమిటది?" ఆమె నిర్ఘాంతపోయింది. మూడు రోజులు-అవును సరిగా మూడు పవళ్ళు మూడు రాత్రులు కంటిమీద రెప్ప వేయకుండా తనలానే అదే కుర్చీలో మృత్యు సన్నిధిలోవున్న తన బిడ్డవంకే చూస్తూ కూర్చునివుంది.

హా ఆత్మజా యీ మైకమేమిటి? అని కళ్ళు తెరచి చూచింది. హా. చంకమీద తన శిశువులేదు! వృద్ధుడు కూర్చున్న ఆసనం కూడా ఖాళీగా వుంది. అతడు వచ్చి వెళ్ళినట్లు గుర్తుగా నీటి బిందువులుగా పరివర్తన చెందిన మంచు బిందువుల ఛాయలు ప్రబల సాక్ష్యంగా వున్నాయి. తల్లి కెవ్వుమని కేక వేసింది. ఆ వచ్చిన వృద్ధుడు మృత్యువేనని, నిర్దాక్షిణ్యంగా తన చిన్నారి శిశువును తీసికెళ్ళాడని ఆ అమాయిక తెలుసు లేకపోయింది.

తల్లి గుండెలు బాదుకుంటూ బయటకు పరుగెత్తింది. నిడుసూన వీధి రెండువైపులకి తన దృష్టిని సాదించివదామె. కాని—ఆ వృద్ధుడు ఛాయలు కూడా అవుపించలేదు. పంచ అరుగు ప్రక్కనే ఒక స్త్రీ నల్లటి ముసుగు కప్పుకొని కూర్చుని వుంది. తల్లి దుఃఖాతిశయాన్ని గమనించిన ఆవిడ యిలా అంది. 'ఇంతవరకు నీగదిలోయున్న ఆ వృద్ధుడు యెవ రనుకున్నావ్? వాడే మృత్యువు. నీ బిడ్డనెత్తుకుని వాడు పరు గిడటం నేను చూశాను. వాడి వేగం ముందు నీ నడక యే పాటి? ఒకసారి అతని చేతుల్లో చిక్కింది తిరిగి రావట మంటూ వుండదు' అంది.

"అతడేమార్గాన వెళ్ళిపోయాడో చెప్పు తల్లీ! నా బిడ్డను తిరిగి నేను సాధించుకుంటాను. తల్లీ! అమ్మా! చెప్పవూ!" తల్లి దీనంగా బ్రతిమాలింది.

మృత్యువు యే మార్గాన వెళ్ళిందీ నాకు తెలును. చెబుతాను కూడా. కాని, నీ విప్పుడే మృత్యువుచే అపహ

రించబడ్డ నీ బిడ్డకోసం పాడిన పాటలన్నీ ముందు నాకు విని
పించాలి. నీవు ఆ పాడే పాట లెంతో మధురంగా వుంటాయని
నాకు తెలుసు! నేను తమోదేవతను! అలా పాడుతున్నప్పుడు
అందమైన నీ రెండు కళ్ళలోనుంచి ఉద్భవించే జల బిందువుల్ని
చూడలని నా కెంతో యిచ్ఛగా వుంది." అంది.

"అలాగే తల్లీ తప్పకుండా పాడతాను! అన్నీ పాడ
తాను. కాని ముందు నాకా మార్గం చెప్పు. నా చిన్నారి
శిశువును రక్షించుకొని వచ్చిన వెంటనే నా యీ వాగ్దా
నాన్ని తప్పక చెల్లించుకుంటాను." తల్లి కంఠంలో ఆతృ
తతో పాటే దుఃఖపు జీరకూడ కాన్పించింది.

చీకటి దేవత మారు పలుక లేదు! మూగదానిలా
మౌనంగా కూర్చుంది. తమోదేవత మొండిపట్టును గ్రహిం
చిన తల్లి పాటలు పాడ ప్రారంభించింది. రుద్ధకంఠంతో
యెన్నో పాటలు పాడింది! ఆ పాటలకి తాళగతితో ఆమె కన్నీరు
స్రవిస్తోంది! హృదయం బ్రద్దలవుతుంటే ఆమె పాడుతోంది!
నిలువెల్లా దహించుకపోతోంటే ఆమె పాడుతోంది. ఆమె
మెదడు మడతల్లో భీకర సంగ్రామం జరుగుతోంటే ఆమె
పాడుతోంది!!!

"ఇదిగో! ఈ కుడివైపు తిన్నగా వెళ్ళు! మృత్యువు
నివసించే అరణ్యాని కిదే త్రోవ" చీకటిదేవత తల్లికి దారి
చెప్పింది.

తన కడుపుకోత తీర్చుకోవాలనే ధ్యాస తప్ప
ఆమెకి ఆ తల్లికి మరే ఆత్రుత లేదు. చీకటి చెప్పిన

దాఃటట వగరిస్తూ పరుగెత్తింది. చీకటి- చలి-మంచు' అవేవీ ఆమెను బాధించినట్లు లేవు. అలా పరిగెత్తిన తల్లి అరణ్యానికి ముందు రెండురోడ్లు కూడలిలో ఆగిపోయింది. ఆ రెండు బాటలు కూడా అడవికే దారితీస్తవి. కాని అందులో మృత్యువెళ్ళిందే దారినో! ఎలా? ఆమె ఆలోచిస్తూ దిక్కులు చూస్తోంది. ఆ రెండు రోడ్ల కూడలి ప్రక్కనే పెద్ద నాగజెముడు పొద మొండిముళ్ళతో భీకరంగా అవుపిస్తోంది.

"అమ్మా!" తల్లికి ఎవరో పిలిచినట్లు వినిపించింది. ఆమె విస్తుపోయి పిలుపువచ్చిన వేపుకి చూచింది. ఆ నాగజెముడు ముళ్ళపొదే పిలుస్తూంది! 'మృత్యువు యేదారిన నీ బిడ్డను తీసుక పెళ్ళిందో నాకు తెలుసు! చెబుతాను. కానీ--- నేను చలిలో గజగజలాడిపోతున్నాను. అన్ని చెట్లకుమల్లే నాకు ఆకులుకూడ లేవు. రెండు నిమిషాలపాటు నన్ను కౌగలించుకొని యీ చలి చావునుంచి తప్పిస్తే చాలు— అంతే నేను కోరేది" అంది.

ఆత్రుతతో అలమటిస్తున్న తల్లి ఆలస్యం చేయలేదు. తన రెండు చేతులూ బారచాపి గట్టిగా ఆ నాగజెముడు పొదను కౌగిలించుకొంది. ఆమె వళ్ళంతా రక్తప్రవాహమే! ఆ వాడిముళ్ళు యెన్ని ఆమె మెత్తని కండరాల్లోకి గ్రుచ్చుకొన్నవో! ఆ బాధ నామె లక్షించనేలేదు. కాని విచిత్రమేమిటంటే; ఆ మొండి ముళ్ళపొద వసంతకాలంలోలా నవనవలాడుతూ కన్పించింది! దుఃఖితయైన మాతృదేవి వేడి

కాలికత ప్రసాదించిన వరం కాబోలు దానికది!!!

నాగజెముడు పొద ఆనందంతో తల్లికి దారి తెల్పింది.

శరవేగంతో పరుగెత్తుతున్న తల్లికి ఎదురుగా ఓ పెద్ద నదీప్రవాహం అవుపించింది. నది ఒడ్డుల్ని ఒరుసుకుంటూ ప్రవహిస్తోంది. నీటిరొద హోరుమని వినిపిస్తోంది! అయినా ఆమె భయపడలేదు. నీటిలోకి అడుగు వేయబోతోంది. అంతలోనే "ఏమిటా పని! నీ బిడ్డను తిరిగి పొందుట కాదుకదా నీ గుప్పెడు ప్రాణులుకూడ పోతవి" ఆ నది అంది. 'అయితే?' తల్లి దీనంగా ప్రశ్నించింది.

"ముత్యాలంటే నా కెంతో యిష్టం. అందుకేవీలయినన్ని తెచ్చిదాచుకుంటూ వుంటాను. నీ రెండు కళ్ళు మంచి ముత్యాల్లా తళతళ లాడుతున్నవి. అవి నాకిస్తే నేను నీకు దారి యివ్వగలను," నది అంది.

తల్లి ఆలోచించలేదు. వెంటనే తన రెండు కనుగ్రుడ్లు పీకి నదిలోకి విసరివేసింది! ప్రవాహం సంతోషంగా దారి యిచ్చి "ఈలాగే వెళ్ళు. కొద్దిదూరంలో ఒక పెద్ద తోట వుంది. ఎన్నో మొక్కలు రకరకాలైన రంగుల పూగుత్తులతో ఆ తోట అందంగా వుంటుంది. అదే మృత్యుదేవత మరణించిన జీవుల్ని ఎప్పటికప్పుడు వేరుచేస్తూ ఫలభరితమైన ఉద్యానవనాన్ని నిర్మిస్తూ వుంటుంది." అని చెప్పి పంపింది.

తల్లి పరుగెత్తుతోంది ఆమె అంధురాలిప్పుడు. ఎన్ని ఎదురుదెబ్బలో! అలా కొద్దిదూరం పరుగెత్తేసరికి

పూలవాసనలు గుబాళిస్తున్నట్లు ఆమె నాసికారంధ్రాలు గుర్తించాయి. ఆమె ఆగి 'మృత్యు వెక్కడ? నా చిన్నారి శిశువును దొంగిలించుకొనివచ్చిన మృత్యు వెక్కడ' కేకలు పెట్టింది.

ముగ్గుబట్టలావున్న నెరిసిన జుట్టుతో వికారంగా వున్న ఒక వృద్ధురాలు 'ఆయనింకా రాలేదు. ఎవరు నువ్వు? మానవమాత్రులకి సాధ్యంకాని యీ ప్రదేశంలోకి యెలా వచ్చావ్?' తీవ్రంగా చూస్తూ అంతకంటే తీక్ష్ణంగా ప్రశ్నించింది.

"దయామయుడైన ఆ భగవంతుడే నాకు దారి చూపాడు. తల్లీ! కరుణామయూ! నా బిడ్డను నాకు చూపు! జన్మ జన్మాలకి నీ ఋణాన్ని నేను తీర్చుకోలేను." తల్లి వెక్కి వెక్కి యేడుస్తూ ప్రాధేయపడింది.

కఠినురాలైన ఆ వృద్ధవనితకూడా కరిగిపోయినట్లుంది 'నాకు తెలియదనుకోమ్మా! ప్రపంచంలో ప్రతిజీవికి ఓ జన్మ వృక్షముంటుందని నీకు తెలియదూ! అనంతమైన యీ చెట్ల వరుసల్లోనే ఆ జన్మవృక్షాలుకూడ వున్నవి మిగిలిన చెట్లకి వాటికీ భేదమల్లా హృదయస్పందనం మాత్రమే! నీ బిడ్డకూడ యీ చెట్లలోనే ఒకటయివుంటుంది. హృదయస్పందననుబట్టి నీ బిడ్డను నీవు గుర్తించుకోగలవా?' అంది. వృద్ధురాలు.

"నా చిన్నారి హృదయస్పందననే నేను గుర్తించలేనా?" తల్లి దుఃఖస్వరంలోనే ఆత్మాభిమానం తొణికిసలాడింది.

"కాని..." వృద్ధురాలు మధ్యలోనే మౌనం వహించింది.

ఏమిటన్నట్లు తల్లి కళ్ళతోనే ప్రశ్నించబోయి తను అంధురాలని గుర్తుకువచ్చి ఆగింది.

"నిగనిగలాడే నీ కురులు నాకు అసూయ కల్పిస్తున్నవి. నా యీ తెల్ల వెంట్రుకల్ని నీవు తీసుకొని నీ నీలాల్ని నాకివ్వాలి" అడిగింది వృద్ధురాలు.

తల్లి నవ్వింది. 'అంతేనా ఇదేనా-నీ కోరిక!' ఆమె మనస్ఫూర్తిగా అందు కంగీకరించిన వెంటనే వారిద్దరి శిరోజాలు ఒకరి కొకరివిగా మారిపోయాయి!

వృద్ధురా తల్లి చేయిపట్టుకొని తోటలోకి నడిపించుకొని వెళ్ళింది. ఎన్ని చెట్లు! రకరకాలైన వృక్ష సంతతులు రమణీయంగా బారులు బారులుగా వున్నవి. ఆ జీవ వృక్షాలే ప్రపంచంలోని అన్ని జాతుల మానవులూను! విధి అందరికీ ఒక్కటే గదూ!

ఒక్కొక్క వృక్షం ముందు నిలుచుండి చెవి ఒగ్గి స్పందనాన్ని వింటోంది తల్లి! అలా తిరిగి తిరిగి ఓ గున్న మామిడి చెట్టు హృదయస్పందన విని ఆగింది. మరోమారు కూడ విన్నది. ఆమె కంఠంలో దుఃఖపు జీరలు మాయమయినవి. ఆమె ముఖంలో విషాదం అంతరించింది. ఆమె పిచ్చిదానిలా ఆ మామిడి మొక్కను గట్టిగా తన హృదయానికి హత్తుకుంటూ 'ఇదే నా బిడ్డ! వీడే నా చిన్నారి తండ్రి' పిచ్చిగా కేకలుపెట్టింది.

"దాన్ని విడిచేయ్!" గట్టిగా గర్జించింది వృద్ధురాలు 'బహుశా యే క్షణమయినా మృత్యువు రావచ్చు. నీ విక్క యిలానే నిలుచుని వుండు. అతను వచ్చి యీ మొక్కను కూకటి వేళ్ళతో పెళ్ళగించబోతాడు. వద్దని గట్టిగా అడ్డు పడు, ప్రార్థించు. అంగీకరించకపోతే మరో జీవ వృక్షాన్ని నీవు పట్టుకొని త్రుంచివేస్తానని బెదిరించు. భగవంతుని ఉత్తర్వు లేకుండా యే జీవవృక్షమూ త్రుంచివేయబడరాదు. అందువల్ల అతడు నీతో లొంగకతప్పదు' వృద్ధురాలు వుపాయంచెప్పి ప్రక్కకు తప్పుకొంది.

సరిగ్గా మరి రెండు క్షణాలకే చలిగాలి జివ్వుమని వీచింది. మంచుతో వళ్ళంతా పులుముకున్నట్లు విపరీతమైన చలి!

గ్రుడ్డితల్లి గజగజా వణికిపోతోంది. మృత్యు స్వరం వినిపించింది.

"ఓహో నీవు వచ్చావా!"

అంధ మాతృదేవత తన చిన్నారి జీవనవృక్షాన్ని గట్టిగా వాటేసుకొంది.

"నా కంటే ముందే ఎలావచ్చావ్?" మృత్యువు ఆశ్చర్యంగా ప్రశ్నిస్తూ ఆమెను సమీపించాడు.

తల్లి నొసటితో ఆకాశంవంక చూసి తను పట్టుకున్న జీవ వృక్షాన్ని మరింత గట్టిగా తన హృదయానికి హత్తుకుంది. మృత్యుదేవత దీర్ఘహస్తాలు ఆ చిన్నారి మొక్క మీదికి విరుచుక పడబోతున్నవి.

కళ్ళు లేకన్నా, తల్లి జరుగబోయేది వూహించుకుని "భగవంతుని పేరుతో నిన్ను వేడుకుంటున్నాను. ఈ జీవ వృక్షాన్ని కూకటివేళ్ళతో పెళ్ళగించబోక. నా కడుపులో చిచ్చు రగిలించబోక. నా బిడ్డను నాకివ్వు!" భోరున యేడుస్తూ ప్రాధేయపడింది.

మృత్యువు వికటాట్టహాసం చేశాడు. 'నేను చేసేదంతా భగవానుని యిచ్ఛప్రకారమే! నేను యీ తోటమాలిని మాత్రమే! నన్నడ్డుపెట్టబోకు. తప్పుకో!' మృత్యువు అర చేయి ఆమె ముంజేతికి తగిలింది. ఆ శీతల హస్త స్పర్శకి ఆమె విలవిల్లాడి పోతుంది. కాని క్షణకాలం మాత్రంలోనే ఆమె

ఆ కౌగిళ్ళను విడిచి మరో జీవవృక్షాన్ని గట్టిగా పట్టుకొని "నీవు దాన్ని పెకిలిస్తే యిదో యిదికూడ దాన్ని అనుస రిస్తుంది" అంది ఆమె గొంతులో దుస్సహమైన కర్కశతరం తారట్లాడింది.

శిశువు జీవవృక్షాన్ని పెకలిస్తున్న మృత్యువు అలాగే నిర్ఘాంతపోయాడు. మరో క్షణానికల్లా తేరుకుని "దాన్ని తగులబోకు!" గట్టిగా అరచాడు.

"మాతృహృదయమంటున్న నీవే మరో మాతృ హృదయానికి అనవసరంగా చిచ్చు రగిలిస్తా!" ప్రశ్నించాడు మృత్యువు.

"మరో మాతృహృదయమా!" తల్లి ఆశ్చర్యంగా అడిగింది.

"అవును! నీ శిశువులాగే అదీను. కాలంతీరి మరణిం చన నీ బిడ్డ చావుకే నీ వింతలా విలపిస్తూంటే అకారణంగా మరెన్నో యేళ్లు జీవించవలసిన ఆ బిడ్డ ప్రాణాల్ని బలితీసు కుంటే ఆ కన్నతల్లి గతేమిటి?" మృత్యు కొద్దిసేపాగి తిరిగి అన్నాడు. 'నీ కళ్ళు అవుపిస్తవి...రా...ఇలా...చూడు.

తల్లి మృత్యువును శమిాపించింది కనురెప్పలారుస్తూ చూచింది.

"నీ శిశువు తిరిగి బ్రతుకుతే ఆ బిడ్డ భవిష్యత్తు ఎలా వుంటుందో చూడు ఆ తొట్టిలో" అన్నాడు మృత్యువు.

రెండు నిముషాలపాటు తదేకంగా చూచిన తల్లి 'అబ్బా' అని కేక వేసి గట్టిగా కళ్ళుమూసుకుంది.

లేన చిన్నారి శిశువు చుట్టూ ఆకలి, ఆవేదన, ఆక్రంద నాలు-ఆ శిశువు ముఖంలో నీలినీడలు తారట్లాడుతున్నవి. గడ్డ కట్టుకున్న దిగులు ఆ ముఖంమీద భయంకరంగా అవుపిస్తోంది. బాధ అతని నరనరాల్ని తోడేస్తున్నట్లు గింగర్లు తిరుగుతున్నాడు. 'కుయ్యో' మని కుక్కలా అరచి అరచి అలసిపోతున్నాడు.

"చూశావా!" మృత్యుకంఠం గంభీరంగా ప్రశ్నించింది. మాతృమూర్తి వెక్కి వెక్కి యేడుస్తూ అవునని తలూపింది. "లోకరక్షకుడైన దైవసాన్నిధ్యంలో నీ శిశువు ఎలా వుంటాడో యీ మాటు చూడు" తిరిగి ఆజ్ఞాపించాడు. మృత్యువు నీటితొట్టిలోకి తిరిగి చూస్తున్న తల్లి ముఖంలో రంగులు మారాయి. ఆమె దుఃఖం రూపులేకుండా పాలిపోయింది. ఆమె నయనాల్లో దరహాస రేఖలు వెన్నెల కిరణాల్లా తళతళ లాడాయి.

ఆ శిశువుచుట్టూ అనంత కమనీయమైన ప్రకృతి మధ్య చిరునవ్వులు చిందిస్తూ ఆహ్లాదంగా ఆడుకుంటున్నాడు. ఆ ముఖంలోని అద్భుతమైన వెలుగురేఖలు దిక్కుల్నంటిని ధవళ కాంతితో నింపుతున్నవి.

"ఏది కావాలో కోరుకో!" మృత్యువు కంఠస్వరం విని మరో లోకంలోని ఆనందాన్ని మైమరచి చూచే మాతృదేవత వులిక్కిపడింది.

"నా బిడ్డ ఆనందమే నా ఆనందం. నా చిన్నారి శిశువు బాధామయ జీవితాన్ని గడపటం నేను సహించలేను.

శాశ్వత యెడబాటైనా సరే! రెండో మార్గమే నేను కోరుకుంటాను."

ఆ పెదాలు గొణుక్కున్నవి. మృత్యువు చిరునవ్వు నవ్వాడు.

ఆమె ఆనందంతో తిరుగుదారి పట్టింది.

(హాన్స్ క్రిష్టియన్ అండర్సన్ "ది స్టోరి ఆఫ్ ఎ మదర్" కథకు అనుసరణ)

